# చతుర

జూన్ 2003 ● రూ. 7/-



స్వప్నసౌధం తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి

# చతుర ప్రపంచం

## తస్మాత్ జాగ్రత్త

ఇది కంప్యూటర్ యుగం. దాదాపు అన్ని వృత్తులవారూ, అన్ని రకాల వ్యాపారస్థులూ కంప్యూటర్‌లని ఉపయోగిస్తు




న్నారు. అయితే దాన్ని ఉపయోగించేటప్పుడు చిన్న తప్పుచేసినా పెద్ద ప్రమాదం సంభవించవచ్చు.

దానికి గొప్ప ఉదాహరణ మిన్నియాపోలీస్ నగరానికి చెందిన రిచర్డ్. అతను ఆఫీసుపనిమీద ఫ్లోరిడా వెళుతూ, ముందు తను వెళ్తానని మర్నాడు విమానంలో భార్యని రమ్మని చెప్పి వెళ్ళాడు. అమెరికాలోని సాధారణ హోటల్స్‌లో కూడా ఫోన్‌లతోపాటు కంప్యూటర్‌లుంటాయి. అతను తన హోటల్ గదినుంచి హెడ్డాఫీస్‌కి ఇ-మెయిల్ ఇచ్చాడు, ఆఫీసు నియమాల ప్రకారం తన గదిలో తన భార్య కూడా వుండచ్చేమో

తెలుపమని. వాళ్ళు వుండచ్చని వెంటనే బదులిచ్చారు.

దాంతో హోటల్ రిసెప్షనిస్ట్‌తో మాట్లాడి తన గదిని సింగిల్ ఆక్యుపెన్సీనుంచి డబుల్ ఆక్యుపెన్సీకి మార్చమని అడిగాడు. మర్నాడు విమానానికి వచ్చే తన భార్యని హోటల్‌కి తీసుకురావడానికి ఎయిర్‌పోర్ట్‌కి కారు పంపే ఏర్పాటుచేశాడు. ఆ తర్వాత తన భార్యకి ఆ విషయం వివరిస్తూ సరదాగా ఓ ఇ-మెయిల్ పంపాడు. అంతే అతను తన భార్య ఇ-మెయిల్ టైప్ చేస్తూ పొరపాటున ఓ అక్షరం టైప్ చేయడం మరిచాడు. చూసుకోకుండా దాన్ని అలానే పంపేశాడు.

అమెరికాలోని హోస్టన్ నగరంలోని ఓ ముసలావిడ భర్త మరణించాడు. ఆయన ఓ చర్చిలో ఫాదర్‌గా పనిచేసేవాడు. ఆవిడ అతని ఫ్యూనరల్‌కి వెళ్ళి ఇంటికి తిరిగివచ్చింది. కండోలెన్స్ మెసేజెస్ ఎవరైనా పంపారేమో చూద్దామని ఆవిడ తన కంప్యూటర్‌ని ఆన్‌చేసి, తన ఇ-మెయిల్ బాక్స్‌లోకి వెళ్ళింది. మొదటి మెసేజ్ చూడగానే ఆవిడ భయంతో మూర్ఛపోయింది. ఆవిడ కొడుకు కొద్దిసేపటి తర్వాత గదిలోకి వచ్చి నేలమీద పడివున్న తన తల్లిని చూసి కంప్యూటర్ మోనిటర్ స్క్రీన్ మీద ఓ మెసేజ్‌ని చదివాడు. అది ఇలా వుంది. 'టు: మై లవింగ్ వైఫ్ (నా ప్రియ భార్యకి), ఫ్రం: యువర్ బిలవ్‌డ్ హజ్బెండ్ (ప్రియమైన భర్తనుంచి) సబ్‌జెక్ట్: ఐ హేవ్ అరైవ్‌డ్ (నేను చేరుకున్నాను). మెసేజ్: "నేను ఇప్పుడే ఇక్కడికి క్షేమంగా చేరుకున్నాను. ఇక్కడ ఓ హోటల్‌లో చేరాను. రేపొద్దున్న నీవు ఇక్కడకు రావడానికి అనుమతి పొందాను. అందుకు అన్నీ సిద్ధం అయ్యాయి. నీవు కూడా కష్టపడి రేపు ఇక్కడకు చేరుకుంటావని ఆశిస్తాను. ఇక్కడ బాగా వేడిగా వుంది." వగైరా వగైరా...భార్య పేరులోని ఒక్క అక్షరం మార్పుతో ఆ మెసేజ్ మరో వ్యక్తికి వెళ్ళిపోయింది.

---

## ప్లాట్‌ఫామ్‌పై నిలబడితే ఎదురైన పాట్లు!

రాజస్థాన్ రాష్ట్రంలో నివశించే ధరమ్ చంద్ ఏదో పనిమీద వెళ్ళి తిరిగి తన స్వస్థలానికి రైల్లో ప్రయాణం చేస్తున్నాడు. దావణగిరి స్టేషన్లో రైలు ఆగినప్పుడు కాలక్షేపం కోసం అతను ప్లాట్‌ఫామ్‌పై నిలబడ్డాడు. కాస్సేపు నిలబడ్డాడో లేదో, హఠాత్తుగా నలుగురు వ్యక్తులు వచ్చి అతణ్ణి బంధించి, ప్రభుత్వం వారి వాహనంలోకి ఓ మూటలా విసిరేశారు. ఆనక అతణ్ణి టౌన్లో వున్న శరణార్థుల శిబిరానికి తీసుకువెళ్ళి అక్కడ నిర్బంధించారు.

ఈ సంఘటన జరిగి దాదాపు నాల్గు నెలలైంది. అప్పట్నుంచీ బిచ్చగాళ్ళతో పాటు ధరమ్‌చంద్ ఉండిపోయాడు. అతనితోపాటు 21 మంది ఉన్నారు.

"నా భార్యా పిల్లలకు నేను ఎక్కడకు వెళ్ళానో తెలియదు. నన్ను బిచ్చగాళ్ళతో పాటు బంధించారని నేను వాళ్ళకు చెప్పే స్థితిలో లేను. నా కుటుంబం నేను మరణించినట్లుగా భావించి కర్మకాండలు కూడా పూర్తిచేసి వుంటారు" అంటూ బాధగా అతను తన గాథ వెళ్ళబోసుకున్నాడు.

ధరమ్‌చంద్‌తో పాటు అక్కడే మరో 21 మంది వున్నారు. డిప్యూటీ కమిషనర్, సూపరింటెంట్ ఆఫ్ పోలీస్ తమ సిబ్బందితో ఆ శరణాలయంపై మెరుపు దాడి చేసినప్పుడు ఈ విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఆ ఉన్నతాధికారులు శరణాలయాన్ని నడుపుతున్న ముగ్గుర్ని సస్పెండ్ చేశారు. వారు బిచ్చగాళ్ళు కానివారినీ, శరణార్థులు కానివారినీ బంధించినందుకు, ఆ



కేంద్రం పేరిట ప్రభుత్వంనుంచి డబ్బు దండుకొంటున్నందుకు అక్కడ వున్న 22 మందిని అధికారులు విడుదల చేశారు. వారంతా ఏదో పనిమీద ఆ పట్నానికి వచ్చినవారే. వారిని కేంద్రాన్ని నిర్వహించే వారు ఒక గదిలో ఉంచడం జరిగింది. ఆ గదికి కిటికీలు లేవు. ఒక కిచెన్, ఓ టాయిలెట్ అంతే. సాయంత్రం 6 గంట లకు తలుపులకు తాళంవేసి నిర్వాహకులు వెళ్తారు.

రాత్రంతా చీకటి. అందులోనే జనం బాధపడవలసిందే. రోజుల తరబడి వారు స్నానాలు లేకుండా ఉంటారు. అక్కడ నీళ్లకు ఏర్పాటు లేదు. నెలనెలా ఆ కేంద్రా నికి ప్రభుత్వం నుంచి 40 వేల రూపా యలు అందుతాయి. ఆ కేంద్రంలో కనీసం 25 మంది ఉండాలని ప్రభుత్వం వారి షరతు. అందువలన స్వార్థపరులైన నిర్వాహకులు అమాయకులను తెచ్చి అచ్చట బంధించారు.

ఆ సెంటర్‌కు ఒక వంటమనిషి ఉంది. ఆమె నెలకొకసారి మాత్రం వచ్చి తన జీతం 5,900 తీసుకుని హాయిగా వెళ్తుంది. ఆమెగారి అసిస్టెంట్ బియ్యం, గోధుమ పిండి, కాయకూరలు తెచ్చి అక్కడ ఉన్న వారికి ఇస్తాడు. వాళ్లు వంట చేసుకొని తినవలసిందే! రోజూ ఓ వాచ్‌మన్ వచ్చి లోపల వున్నవాళ్ళు పారిపోకుండా చూస్తాడు.

★

# చతుర

305వ సంచిక

సంపుటి: 26

సంచిక: 5

జూన్ 2003

కటిక పేదరికంలో పుట్టిన ఆ అమ్మాయి కలల రాకుమారుడు దొరబాబు పెద్ద కొడుకు. స్కూల్లో చదువుకుంటూనే దొర ఇంట్లో పనిచేసే ఆ అమ్మాయి మనసులో అతడిపట్లవున్న అంతులేని ఆరాధనని గడ్డిపర కలా తీసేసిన విధి ఆమెకు ఆ ఇంటి సేవకుడితో పెళ్లి జరిపించేసింది. అయినా ఆమె భర్తని దూరంగానే వుంచుతూ తనదైన ఊహా ప్రపంచంలో బతుకుతూ తన ప్రేమకీ, పెళ్లికీ కూడా ఏకైక గమ్యం చిన్నదొరే అనుకుంటూ... ఆ దిశగా ప్రయత్నాలు ప్రారంభించింది. కానీ అవి ఆమెను అంతకంతకు ఓ భయంకరమైన ఊబిలోకి లాగటం ప్రారంభించాయి.

అటుపైన ఏం జరిగింది?

ఇటు పెళ్ళికి, అటు ప్రేమకి మధ్య నలిగిన ఆమె మూగ హృదయం చివరికి పొందింది ఏమిటి? తంగెళ్ల శ్రీదేవిరెడ్డి రచన **'స్వప్నసౌధం'** ఈ నెల చతుర సమగ్ర నవల.



నగరం మహానగరం.
ప్రాంతం మహిళా సెంట్రల్ జైలు.
సమయం ఉదయం పదిగంటలు.

జీవిత ఖైదీల జీవనగాథల్ని తమ పత్రికలో సీరియల్స్‌గా వేసేందుకు స్పెషల్ పర్మిషన్ తీసుకుని వారిని ఇంటర్వ్యూ చేయడానికి వచ్చింది జర్నలిస్ట్ ప్రత్యూష.

లేడీకానిస్టేబుల్ వెంటరాగా ఓ సెల్‌లోకి ప్రవేశించింది. అక్కడొక అమ్మాయి తల వంచుకుని ఏదో రాసుకుంటోంది.

సన్నగా, గోధుమ వన్నెలో, అందమైన ముఖ కవళికలతో, నలుపురంగులో ఎరుపు రంగుని కలిపినట్టున్న గాఢ రాగివర్ణపు ఉంగరాల జుట్టుతో, ఎటువంటి అలంకరణ లేకుండానే అతి సుందరంగా కనిపిస్తున్న ఆ యువతి... ఆ కాగితాల మధ్య తనే ఒక అద్భుతకవిత్వంగా తోస్తోంది.

"బ్యూటిఫుల్" ఆమెను అలాగే చూస్తూ మనసులోనే అనుకుంది ప్రత్యూష.

విషయం చెప్పి ఆమె మాటలను రికార్డు చేయాలనుకున్న ప్రత్యూషకు ఆమె అంత వరకు రాసిన కాగితాలనందిస్తూ...

"చికిత్స తెలియని గాయాలతో వేసారిపోతున్నాను. ఈ పరిస్థితిలో ఓపికగా కూర్చుని నా కథను మీకు వినిపించేంత శక్తి నాలో లేదు. కన్నీళ్లు కూడా ఇంకిపోతున్న జీవచ్ఛవాన్ని నేను. అవునమ్మా! అన్నీ హరించుకుపోయి అసహాయంగా మిగిలివున్న దురదృష్టవంతురాలిని నేను. నా జీవితాన్ని మొత్తంగా ఈ కాగితాల్లో కూర్చాను. చదువుకో..." నైరాశ్యం నిండిన గొంతుకతో చెప్పింది వసుంధర.

ప్రత్యూష ఇంకేం మాట్లాడలేదు. ఆమె వైపు ఒక ప్రశ్నగా చూస్తూ ఆ కాగితాలని తన చేతుల్లోకి తీసుకుంది.

★ ★ ★

చిన్న పల్లెటూరు! వూరికి మధ్యగా ఓ చిన్న పాతకాలపు పెంకుటిల్లు! ఇంటిచుట్టూ గురివింద చెట్లకొమ్మలతో అల్లిన ప్రహరీ గోడ! మధ్యలో రకరకాల పూలచెట్లు! వెరసి... ఆ ఇంటి వాతావరణం సదా సేదతీర్చే విశ్రాంతికుటీరంలా తోస్తోంది! తోడుగా సాయంకాలపు నీరెండలో ఆ పరిసరాలు వింతగా మెరుస్తుంటే... ఆ అందాన్ని తిలకిస్తూ ఆ ఇంటికి కాసింత దూరంలో నిలబడివున్నాను నేను!

నా పేరు వసుంధర. పదవతరగతి చదువుతున్నాను. నా వయసు పదిహేను సంవత్సరాలు. ఏడవతరగతి వరకు ఊర్లోనే చదువుకున్నాను. ఎనిమిదవ తరగతినుండి పక్క టౌన్‌లో చదువుతున్నాను. నాన్న రోజువారి కూలిగా పనిచేస్తూ రోజుకు ముప్ఫయినుండి యాభై రూపాయలవరకు సంపాదిస్తుంటాడు. అమ్మ బీడీలు చేస్తుంటుంది. చెల్లెళ్లు ముగ్గురూ వూర్లో వున్న స్కూల్లోనే చదువుతుంటారు. తమ్ముడు చంటోడు! అమ్మా నాన్న సంపాదించే డబ్బుతో మా ఏడుగురు కుటుంబసభ్యులం అతికష్టంగా బతుకుతుంటాం. తోడుగా సాయంకాలం కాగానే నాన్నకు 'మందు' కావల్సిందే! ఇక ఇటువంటి పరిస్థితుల్లో నావనే ఆశలముందు నేను ఒక నిస్సహాయురాలిని అవుతుంటాను.

మా ఇంటికి ఎదురుగా అదిగో! ఒక పెద్ద బంగళా! బయట చూడ్డానికి ఎంత గంభీరంగా వుందో, లోపల అంతకుమించిన గంభీరత కనిపిస్తుంది. ఆ వూర్లోకెల్లా అది ఒక్కటే బంగళా! మిగతా అన్నీ చిన్నచిన్న డాబాలు... గుడిసెలు... పెంకుటిళ్లు! బంగళా పాతకాలానికి చెందినదే అయినా నేటికీ చెక్కుచెదరలేదు. వాళ్లు బాగా డబ్బున్నవారు కాబట్టి ఎప్పటికప్పుడు మరమ్మత్తులు చేయిస్తూ బంగళాని కాపాడుకుంటూ వస్తున్నారు. ఫలితంగా మరో కొన్ని దశాబ్దాలవరకు ఆ బంగళా బాగోగుల గురించి భయపడాల్సిన అవసరం లేనట్టుగా తయారయ్యింది. ఆ బంగళా వాళ్లను మా వూరి వాళ్లంతా 'దొరోళ్లు' అంటుంటాం. పూర్వకాలం నుండి మా ఒక్కవూరినే కాకుండా,

చుట్టుపక్కల గ్రామాలని కూడా, ఆ దొరోళ్ల పెద్దలు పరిపాలిస్తూ వచ్చారు. ప్రస్తుతం మా వూరికి సర్పంచిగా హరిజన్ ఎంకయ్య ఎన్నికైనప్పటికీ, అజమాయిషీ మాత్రం దొరోళ్ల బాబుదే! అతడి పేరు రాజారఘు మోహన్! పేరు ఎంత హుందాగా వుందో మనిషి కూడా అంతే హుందాగా వుంటాడు.

సుమారుగా నలభై సంవత్సరాల వయసు, చామనఛాయ రంగు, ఎత్తయిన దృఢమైన శరీరం, పోలీసోళ్ల మాదిరిగా చిన్నగా కత్తిరించుకున్న నల్లని ఒత్తయిన జుట్టు, కిందికి వంపు తిరిగి పెదవుల దిగువగా సాగిన మీసకట్టు, వెరసి... రాజరికానికి ఓ ప్రతిబింబంలా వుంటాడు. అతడికి భార్యా, ముగ్గురు మగపిల్లలు! పెద్దపిల్లాడు నాతోటివాడు. మిగతా ఇద్దరు చెల్లెళ్ల తోటివాళ్లు! ఆ ముగ్గురూ చిన్నప్పటినుండి హైద్రాబాద్‌లోనే వుంటూ చదువుకుంటున్నారు. పండుగలకి పబ్బాలకి వేసవిసెలవులకి వూరొస్తుంటారు. వచ్చినప్పుడు హాయిగా ఆడుతూ పాడుతూ షికార్లు చేస్తుంటారు. అలాగని అందరితో కలిసిపోతారనుకుంటే పొరపాటు. వాళ్ళ షికారుని కేవలం తమ నౌకర్లతో నౌకర్ల పిల్లలతో మాత్రమే సాగుతుంటుంది.

దొరబాబు పిల్లలు పట్నంలో చదవడం మాత్రమే కాకుండా పట్నంలోనే స్థిరపడిపోతారని, ఇందువల్ల దొరబాబు పెద్దరికానికి సమూలంగా తెరపడుతుందని, వూర్లో అందరూ అనుకుంటారు. పరిస్థితులు కూడా నాకు అదే విషయాన్ని తెలియజెప్తుంటాయి. ఎలా అంటే... నాకు తెలిసి నా పూర్తి చిన్నతనంలో దొరబాబుకి అసలు ఎదురుండేది కాదు. కాని ఈమధ్యకాలంలో 'నరసింహ' అనే మా వూరి యువకుడే దొరబాబుకి వ్యతిరేకత చూపించడం మొదలెట్టాడు.

ప్రతి సాయంకాలం స్కూల్‌నుండి రాగానే వాళ్ళ ఇంటికి పనిమనిషిగా వెళ్ళే దయనీయమైన జీవితం నాది. ఈ విషయమై 'కష్టపడుతున్నావు. తప్పకుండా బాగుపడ్తావు' అంటూ అప్పుడప్పుడూ ఆయన నన్ను జాలిపడుతూ ఆశీర్వదిస్తుంటాడు.

ఆయన భార్య పేరు స్వర్ణమంజరి. పేరుకు తగ్గట్టుగానే మనిషి చక్కగా వుంటుంది. ఆమె అప్పుడప్పుడూ ఇచ్చే పాత చీరలే నాకు లంగా, జాకెట్లు అవుతుంటాయి. అవే చీరల్ని నేను డ్రెస్సులుగా కుట్టించుకోవచ్చు. కాని డ్రెస్సు ఒక్కటి కుట్టాలంటే టౌన్‌లో నలభై నుండి అరవై రూపాయల వరకు చార్జిచేస్తారు. మావూర్లో డ్రెస్సులు కుట్టేవాళ్ళు లేరు. అందుకే... అంత చార్జీ ఇయ్యలేక వూర్లోనే పదిరూపాయలు ఇచ్చి లంగా, జాకెట్టు కుట్టించుకుంటాను.

ముఖ్యంగా దొరబాబు వాళ్ళు నాకు నెలకు ఇచ్చే జీతం వంద రూపాయలు. కానీ అవి నా చేతికి అందవు. సంవత్సరానికి పన్నెండు వందల చొప్పున నాన్న ఒకేసారి తీసేసుకుంటాడు. కుటుంబ అవసరాలకు, నాన్న తాగుడుకి, బీడీలు చేస్తుండటం వల్ల అమ్మకి సోకిన అనారోగ్యానికి, నా డబ్బు మాత్రమే కాదు... ఎన్నికలప్పుడు, ఉత్సవాలప్పుడు దొరబాబు జాలిపడి ఇచ్చే డబ్బు కూడా ఖర్చయిపోతుంటుంది.

పేదరికాన్ని భరించడమంటే మనిషి కూడా సగం చావడమేనని ఆ చిన్నవయసులోనే అర్థంచేసుకున్న నేను, నాలో నేనే ఒక కోరిక కోరుకుంటాను. అది ఏంటంటే... "దొరబాబు కొడుకు నన్ను ఇష్టపడి పెళ్ళి చేసుకోవాలి" అని అనుకుంటాను. గప్చిప్‌గా దేవుడ్ని కూడా ఆ కోరిక అడుగుతాను. కానీ సరదాగా మాటవరసకు కూడా ఆ విషయంలో నేను భయపడను. అసలు ఆ కోరిక కోరుకోడానికి నేను అనర్హురాలిని. వాళ్ళు ఎక్కడ? మేము ఎక్కడ? ఆశకైనా హద్దు వుండాలి. కాకపోతే... సినిమాల్లో కోటీశ్వరుడు కూటికిలేని అమ్మాయిని ప్రేమించి, అందరిని ఎదిరించి, పెళ్ళిచేసుకుంటుంటాడుకదా! అటువంటి అదృష్టమే నాకూ పట్టాలని ఎన్నెన్నో అనుకుంటాను.

ఇలాగని నా కలల రాకుమారుడు... దొరబాబు పెద్దకొడుకు, వూరొచ్చినప్పుడల్లా నేను అతడి దృష్టిలో పడాలని ఎంతమాత్రం ప్రయత్నించను. నాపని ఏదో నేను చేసుకుని గమ్మున వచ్చేస్తాను.

వాస్తవానికి అతడితో నేను ఇప్పటివరకూ ఒక్కమాట మాట్లాడలేదు. కాకపోతే అవకాశం దొరికితే ఎవ్వరికీ తెలియకుండా ఏ సందులోంచో ఏ మూలలోంచో అతడ్ని చూస్తాను. అతడు మాత్రం నన్ను ఏమాత్రం పట్టించుకోడని, నేను అనే ఒక మనిషిని వున్నట్టుగా కూడా అతడికి తెలుసో తెలియదో అని నాకు అర్థమౌతుంటుంది. ఇటువంటి పరిస్థితుల్లో అతడు నన్ను ప్రేమించడం అనేది అసాధ్యం! అయినప్పటికీ ఆ అవకాశం దేవుడే కల్పించాలని, అనుకోని సంఘటన ఏదో మా ఇద్దరినీ ప్రేమ బంధంతో ముడివేయాలని, ఆ తరువాత రెండు జీవితాలు ఒక జీవితం కావాలని, ఎన్నెన్నో కలలుకంటూ... ప్రతిరాత్రీ పడుకున్నప్పుడు అతడి తాలూకు ఊహల్లో ఆనందంగా మునిగితేలుతుంటాను. తెల్లవారాక అంతా యధావిధి. అయినాగాని నాలో నిరాశ వుండదు. దేవుడు నన్ను తప్పకుండా కరుణిస్తాడనే ఆశ పడుతుంటాను. ఇటువంటి నాకు, పట్నంనుండి అతడు వస్తున్నాడు అంటే కలిగే పులకింత కొత్తగా, వింతగా వుంటుంది. అతడికోసం నిరీక్షిస్తానే... అందులోని విప్రలబ్ధ విరహం ఎంతో హాయిగా వుంటుంది.

"ఏయ్... వసూ..."

వా ఏకాగ్రతని చెదరగొడుతూ దూరం నుండి నా స్నేహితురాలు పద్మజ గొంతు హడావిడిగా వినిపించింది.

ఏంటన్నట్టుగా, ఎందుకన్నట్టుగా, కలల తాలూకు బరువుతో నెమ్మదిగా తిరిగి చూశాను.

ఇక్కడ నిల్చున్నావేం? " అడిగింది తను.

"కొత్తగా పెంచిన తెల్లగులాబీలు, పచ్చ మందారాలు, అదిగో... ఎంత బాగా విచ్చుకుని ముద్దొస్తున్నాయో? బుజ్జి తల్లులు! దూరం నుండి చూస్తుంటే మరీ అందంగా కనిపిస్తున్నాయి. అందుకే ఇక్కడ నిల్చుని చూస్తున్నాను" సంతోషం కళ్లనిండా నింపుకుని చూపిస్తూ చెప్పాను.

"అబ్బా! నిజంగా ఎంత బావున్నాయో" పద్మజ కూడా ఆ పువ్వుల సౌందర్యాన్ని చూస్తూ మురిసిపోయింది.

"ఇక నాకు టైమయ్యిందే వెళ్తానూ" ఆ వెంటనే చెప్పాను.

"ఉరుమూ మెరుపూలేని వర్షంలా అంత తొందర ఏంటే? " పద్మజ కళ్ళల్లో ఆశ్చర్యం మరోసారి కనిపించింది.

"ఆలస్యమైతే దొరసానమ్మ సవాలక్ష ప్రశ్నలు వేస్తుంది" చెప్పాను.

"ఓహో! ఈ స్టూడెంట్ ఇక పనిపిల్లగా అవతారం ఎత్తబోతుంది అన్నమాట" నా భుజం తట్టింది తను.

నేనేమీ అనలేదు. మళ్ళీ తనే కల్పించుకుంటూ, "ఏయ్ పనిపిల్లా, రేపు ఎలాగూ సండేకదా... దొరబాబు కాలువకు ఈతకి వెళ్దాం. మర్చిపోవద్దు" చెప్పి ఇక ఆ వెంటనే వెళ్ళిపోయింది పద్మజ.

నేను మెల్లగా దొరబాబు ఇంటివైపు అడుగులు వేశాను.

ఆ సమయంలో దొరసానమ్మ నౌకర్లపై చీకాకుగా కేకలు వేస్తోంది. ఆ కేకలు వినగానే నా ఆలోచనలు చప్పున చెదిరిపోయాయి. ఆమె మీది భయం నన్ను హడలగొడ్తుంటే నాకు ముచ్చెమటలు కూడా పట్టాయి. ఎందుకంటే ఆమె సహజంగా మంచి మనిషే అయినప్పటికీ ఆ మంచితనానికి తోడుగా అహంకారం కూడా వుందని నాకు ఏనాడో తెలుసు. అలాగే ఆమె ఎవరి మీదైనా కోప్పడేప్పుడు మరెవరైనా నాలాంటి వాళ్లు వెళ్తే ఆ కోపాన్ని అనవసరంగా అకారణంగా వెళ్లిన వాళ్ల మీద కూడా చూపెడుతుందని కూడా నాకు తెలుసు. అందుకే

నడక వేగం పెంచి బంగళాకు ఎడమవైపుగా వున్న ద్వారం నుండి లోపలికి వెళ్లే ప్రయత్నం చేశాను.

ఎత్తయిన ఎనిమిది స్తంభాల అలంకరణతో అతివిశాలంగావున్న బంగళా మొదటి భాగంలోని వసారాలో నిల్చుని అక్కడే ధాన్యం సంచుల మూతులు కుడుతున్న నౌకర్లమీద అరుస్తున్న దొరసానమ్మ నన్ను చూడనే చూసింది.

"ఏ పిల్లా" గదామాయింపుగా పిలిచింది.

"అ...మ్మ...గా...రూ" భయంగా ఆగిపోయాను.

"అక్కడ ఎక్కడికి వెళ్తున్నావు? తల తిరుగుతోందా? " రెట్టించింది.

నేను కిమ్మనలేదు. నీళ్లు నములుకుంటూ నిలబడిపోయాను.

"ఆ దారి ఈ దారి చూసుకున్నావంటే తల పగలగొడ్తాను జాగ్రత్త! వెళ్లు నేరుగా వెళ్లు" చేయిపెట్టి చూపిస్తూ ఉరిమింది ఆమె.

నేను అదే మౌనంతో లోపలికి వెళ్లిపోయాను. నా మనసంతా పాడైపోయింది. "ఛ! పని మానుకోవాలి" నాలో నేనే అనుకున్నాను. ఇలా అనుకోవడం ఎన్నవసారో నాకే తెలియదు. ఎందుకంటే దొరసానమ్మ నాపై తన కోపాన్ని ప్రదర్శించినప్పుడల్లా ఇలాగే అనుకుంటాను. కాని ఆ తర్వాత కొంతసేపటికే పరిస్థితులతో రాజీపడిపోతాను. ఇప్పుడు కూడా అంతే!

'పేదవాడికోపం పెదవికి చేటు' అన్నట్టుగా నేను అనుకున్నట్టుగా నిజంగానే రోషపడితే నష్టం జరిగేది నాకే! అవునుమరి! నేను పని మానేస్తే దొరబాబు నుండి వచ్చే నా జీతం డబ్బులతో పాటుగా అదనంగా వచ్చే ఇతరత్రా ఆదాయానికి కూడా భంగం కలుగుతుంది. అప్పుడు ఇక నా నిరుపేద తండ్రికి ఉందనుకుంటున్న ఒకే ఒక అండను కూడా నేనే దూరం చేసినదాన్ని అవుతాను. అంతేకాదు నేను ఈ ఇంటికి దూరమైతే నా తియ్యని కలల్ని కూడా దూరం చేసుకోవాల్సి వస్తుంది. కాబట్టి గొంతులోకి పొంగుకు వచ్చిన దుఃఖాన్ని అక్కడే నొక్కేసుకుంటూ వలదన్నా వీడనంటున్న బాధను ముఖం నిండా నా ప్రమేయం లేకుండానే పులుముకుని "దేవుడా! నన్ను వీలైనంత తొందరగా అర్థం చేసుకో తండ్రీ!" మనసులోనే వేడుకుంటూ పేదరికానికి అసలు సిసలైన ప్రతిబింబంలా అలాగే లోపలికి అడుగులు వేయసాగాను.

బయటనుండి దొరసానమ్మ గొంతు వినిపిస్తూనే వుంది. అందుకు నౌకర్లు కిమ్మనకుండా పని చేసుకుపోతూనే వున్నారు. నేను ఇక పూర్తిగా లోపలికి వెళ్లిపోయాను.

బయట పెరట్లో తోమాల్సిన అంట్లు మోపెడుగా పడివున్నాయి. ఇంట్లో ఎంత మంది నౌకర్లు వున్నప్పటికీ ఎవ్వరి గిన్నెలు వాళ్లే ఎప్పటికప్పుడు కడిగేసుకుంటారు. కాగా దొరబాబువద్దకు వచ్చీపోయే వాళ్ల సంఖ్య ప్రతిరోజూ ఎక్కువగానే వుంటుంది కాబట్టి వాళ్ల గౌరవమర్యాదల కోసమో, తమ గౌరవాన్ని కాపాడుకోవడం కోసమో చేసే ప్రయత్నాల కారణంగానూ దొరసానమ్మ ప్రతి చిన్న అవసరానికి అదేపనిగా వస్తువుల్ని వాడుకునే కారణంగానూ- సుకుమారతో శుభ్రతో అర్థం కాదుగాని చేతిలోంచి కిందకి జారిపడ్డ వస్తువుల్ని సైతం తోమాల్సిన వాటిల్లోకి దొరసానమ్మ చేరుస్తున్న కారణంగానూ ఉదయం మొదలుకుని సాయంకాలం అయ్యేసరికి అంతెత్తున అంట్లు పేరుకుపోతాయి. ఈ విషయమై మామూలు రోజుల్లో గుణుక్కుంటానుగాని నా ఊహా ప్రియుడు వచ్చినపుడు మాత్రం నా పని ఇంకా ఇంకా ఎక్కువ కావాలనుకుంటాను. అవునుమరి! ఆ రోజుల్లో పని ఎంత ఎక్కువైతే అంత ఎక్కువసేపు అక్కడ వుండిపోయి నాకు సహకరించని అతడి సన్నిధిలో గడిపేయాలనుకుంటాను. అవును. అతడు నన్ను పట్టించుకోకపోయినా నేను

పట్టించుకునే అతడి అడుగడుగూ నన్ను సమ్మోహితం చేస్తుంది. కాబట్టే అతడు ఇక్కడ వున్నన్ని రోజులూ నేను నేనుగా వుండలేను. ఒక కొత్త మనిషిగా వుంటాను. సరికొత్త ప్రేమ శక్తుల్ని నా స్వంతం చేసుకుంటాను. అయినప్పటికీ బయల్పడని నా మనోభావాల దివ్యపరంపరలో నాలో నేనే మురిసిపోతాను. నాకై నేను ఎటెటో తేలిపోతాను. వాస్తవం భయపెట్టినపుడు మాత్రం బేలనౌతాను. ఆ తరువాత దైవం మీది నమ్మకం నన్ను బలపరుస్తుంటే నేను మళ్లీ మామూలు అవుతాను.

"పాపా..."

నా ఆలోచనలకు భంగం కలిగిస్తూ దొరసానమ్మ గొంతు నాకు సమీపంగా వినిపించింది.

"అమ్మగారూ" అంట్లు తోమడం ఆపి ఉలిక్కిపాటుగా తిరిగి చూశాను.

"అంట్లు తోమడం పూర్తవ్వగానే మేడమీద మూలగదిలో బూజు దులిపి, అంతా శుభ్రంగా ఊడ్చి ఫర్నిచర్‌ని తుడిచి బండలు కడిగి, ఎక్కడా ఏమాత్రం అశుభ్రత కనిపించకుండా మొత్తంగా ఒకటికి పదిసార్లు సర్ది పెట్టాలి. ఎందుకంటే రేపు ఇక్కడికి చాలా ముఖ్యమైన వ్యక్తులు వస్తున్నారు. వాళ్లకు ఆ గదిలో ఎంతమాత్రం ఇబ్బంది కలగకూడదు. ఇందుకుగానూ ఆ గదిలో అగర్‌బత్తీ వెలిగించడమే కాకుండా, పెర్‌ఫ్యూమ్ కూడా గోడలకు స్ప్రే చేయాలి. అర్థమైందా? " చెప్పుకుపోయింది దొరసానమ్మ. ఇప్పుడు ఆమె ముఖంలో ఇందాకటి కోపం ఇసుమంత కూడా కనిపించడం లేదు. ఎప్పటిలా సౌమ్యంగా చెప్పుకుపోయింది.

"సరే అమ్మగారూ" తల ఆడించాను.

దొరసానమ్మ ఇంకేమీ మాట్లాడలేదు. "ఒరేయ్. ఎంకటీ" పెద్ద పాలేరును కేకేస్తూ ఎడంగా వున్న దొడ్ల చావిడివైపు నడిచింది.

నేను తిరిగి అంట్లు తోముకోసాగాను. తోముకుంటూ వెళ్లిపోతున్న దొరసానమ్మనే చూస్తూ 'అమ్మగారు ఎప్పుడూ ఇంతే! అప్పుడే ఎండలా మండుతుంది. అప్పటికప్పుడే మంచులా కురుస్తుంది' మనసులో అనుకున్నాను.

ఏదోలే! నా పుట్టుక పేదదైనా, అదృష్టం బాగుండి అనుకున్నది నిజమైతే ఈ బంగళా ప్రాభవంలో నేనొక వైభవలక్ష్మిని అవుతాను! అప్పుడు నా కారణంగా నా వాళ్ల పేదరికం కూడా తుడిచిపెట్టుకుపోతుంది.

★ ★ ★

ఉదయం ఆరు గంటలు కావొస్తోంది. అప్పటికి చెల్లెళ్లతో కలిసి ఇంటికి సమీపంగా వున్న సర్కారోళ్ల చేతి పంపునుండి ఇరవై బిందెల నీళ్లు తెచ్చిపోసాను. చెల్లెళ్లు ముగ్గురూ కలిసి పంపుకొట్టడం, నేను బిందెలు మోయడం ఒక తప్పని బాధ్యత. కాగా మధ్యమధ్యలో పెద్ద చెల్లెలు సగం దూరం వరకు బిందెలు మోసుకువచ్చి అందిస్తూ నాకు ఆసరా అవుతుంటుంది. ఇలా మేము నీళ్లు తీసుకువచ్చే సమయంలో నాన్న బీడీ ఆకును కత్తిరిస్తుంటాడు. అమ్మ వంట చేస్తుంటుంది.

నీళ్లు తీసుకురావడంవల్ల నేను సగం వరకు తడిసిపోయాను. ఆ తడిసిన బట్టల తోనే రాత్రి తాలూకు అంట్లు తోముతూ కూర్చున్నాను. పెద్ద చెల్లెలు నేను తోముతున్న అంట్లను శుభ్రంగా కడుగుతోంది. చిన్న చెల్లెళ్లు ఇద్దరూ తోటలో పువ్వుల్ని తుంచుతున్నారు. ఆ పువ్వుల్ని కొలత లెక్కన పూల సాహెబుకు అమ్ముతుంటాము.

"వసుంధరా... అంట్లు తోమడం పూర్తయిందా? " వున్నట్టుండి ఇంట్లోంచి అమ్మ కేక వినిపించింది.

"ఆ! అయిపోయింది, వస్తున్నాను" అమ్మకు వినిపించేలా గట్టిగా చెప్పి మిగిలి వున్న మసి బాణలిని ఇటుక మట్టితో బాగా రుద్ది, చెల్లెలికి అందించి ఒక్క రూపాయికి దొరికే నల్లసబ్బుతో మసితో మాలిన్యం

అయిపోయిన నా చేతుల్ని శుభ్రంగా కడుక్కుని, నా లోపలి లంగాతోనే నా కడుక్కున్న చేతుల్ని తుడుచుకుంటూ ఇంట్లోకి నడిచాను.

నెలకు ఒకసారి ఊరి బయటకు వెళ్లి మోపులుగా మోసుకువచ్చే ఫారిన్ తుమ్మకట్టెలతో అమ్మ వంట చేస్తోంది. ఇంట్లో పొగ గొట్టం లేనందున ఇల్లు మొత్తంగా పొగ అల్లుకుని వుంది. ఆ పొగకు శాశ్వత విడిదిని ఏర్పాటు చేసినట్టుగా వంట చేస్తున్న రెండవ గది పూర్తిగా నల్లబారిపోయి వుంది. అందుకు తోడుగా చీర మాసిపోయి, చిరిగిపోయి చిరుగులవద్ద ముడులు వేసుకుని వున్న అమ్మ ఏళ్లనాటి దీనత్వంలా వుంది. తరతరాల శాపంలావుంది.

అనారోగ్యానికి ఆప్తబంధువైన అమ్మ అస్సలు ఒక్క పని కూడా చేయకుండా హాయిగా విశ్రాంతి తీసుకోవాలి అనుకుంటాను. కాని పరిస్థితులు సహకరించవు. అందుకే కనీసంగా అమ్మ అందరిలా మంచి బట్టలైనా కట్టుకోవాలనుకుంటాను. కాని అమ్మ బట్టలు మా అందరికంటే హీనంగా వుంటాయి. పైగా చవకబారు నల్లసబ్బుతో ఉతుక్కుంటాము.

"చదువుకునే పిల్లలు బంజరు భూములోకి వెళ్లి కట్టెలు కొట్టుకు రాకూడదని ఇందువల్ల ఆడపిల్లలకు వుండే సహజమైన సుకుమారత్వం పాడైపోయి మొరటుబారిపోతారని, చవకబారు సబ్బుబిళ్లలతో బట్టలు ఉతుక్కోవడంవల్ల వస్త్రహీనత పెరిగి నాటు మనుషుల్లా కనిపిస్తారని, దొరబాబు ఇంట్లో అయినా సరే పనిమనిషిగా వుండటంవల్ల భవిష్యత్తులో బాగుపడినప్పటికీ ఆ తాలూకు ప్రభావంతో విలువ అనేది అడుగంటిపోతుందని, పువ్వులు అమ్ముకోవడమంటే పాపాలు మూటగట్టుకోవడమేనని, తాగి తందనాలు ఆడే తండ్రిగారి నీడలో ఆడబిడ్డలకు రక్షణ వుండదని... ఎన్నో ఎన్నెన్నో మాటలు మాట్లాడుతుంది మా చుట్టూ సమాజం.

ఇటువంటి సమాజం గురించి లోతుగా ఆలోచించినప్పుడల్లా నాలో ఆవేశం మహాసముద్రంలా పొంగుతుంది. ఇలాగని బయల్పడను. నా ఆవేశాన్ని నాలోనే అణుచుకుంటూ రేపటి బంగారు జీవితానికై అర్రులు చాస్తుంటాను. అవును! మమ్మల్ని ఎత్తి చూపే ఈ సమాజం, దొరబాబు కోడలిగా రేపటి నా అదృష్టాన్ని చూసి కుళ్లుకుని చావాలని ఉద్వేగంగా ఎదురుచూస్తుంటాను. నిజం మరి! దిగువస్థాయి వాళ్లను ఎప్పటికీ దిగువగానే భావించే సగటు ప్రపంచానికి ఎక్కువ తక్కువల తేడాలు చూపకుండా అందరినీ నిత్యం ఆదరిస్తుండే దొరబాబు కుటుంబానికి వ్యత్యాసం ఎంతో వుంది. కాబట్టి నన్ను తమ ఇంటి కోడలిని చేసుకోవడానికి దొరబాబు దంపతులు ఎంతమాత్రం వెనకడుగు వేయరని నేను విశ్వసిస్తుంటాను. నా విశ్వాసాన్ని ఆ దేవుడు గుర్తించి తీరుతాడని కూడా నేను గట్టిగా అనుకుంటుంటాను.

వేయించిన ఎండుమిరపకాయల్ని అమ్మ రోట్లో వేసి దంచడం ఆరంభించింది. కట్టెల పొగ, మిరపకాయల ఘాటు, అమ్మ దగ్గుని వున్నట్టుండి పెంచేసింది. ఇట్లాంటి దీన సంఘటనలు మా ఇంట్లో అత్యంత సహజం. అందుకే లోపలికి ఒకమారు జాలిగా చూసి ఆ తరువాత నాలో నేనే బాధపడిపోసాగాను.

అమ్మ దగ్గుతూనే వుంది. నేను బియ్యం గాలించడం అయిపోయింది. అయినప్పటికీ అమ్మ దగ్గు తగ్గలేదు. ఇక ఎంతోసేపు ఊరుకోలేకపోయాను.

"అమ్మా... నేను నూరుకుంటానుగాని నువ్వెళ్లి బయట చెట్టునీడన పడుకో పో" చెప్తూ లోపలికి వెళ్లాను.

ఎండు మిరపకాయలతో చింతపండు చెట్నీ నూరడం అంటే జబ్బులు పట్టుకుపోవాల్సిందే! మా పేదరికానికి తరుచూ అటు

వంటి చెట్నీలే దిక్కవుతుంటాయి కాబట్టి అటువంటి కష్టాన్ని అమ్మ ఎన్నోమార్లు భరిస్తుంటుంది. పేదరికం కారణంగా మా అందరికీ విభిన్నమైన కష్టాలు వున్నాయి. కాగా అందరికంటే అమ్మనే ఎక్కువ కష్టాల్ని ఎదుర్కుంటున్నట్టుగా తోస్తుంది నాకు! అందుకే అమ్మను చూస్తే అప్పుడప్పుడూ కన్నీళ్లు వస్తాయికూడా.

"నేను పడుకుంటే మీరంతా స్కూలు మానుకోవాల్సిందే! నా కష్టమేందో నేను పడతానుగాని, ముందు ఆ బియ్యం గిన్నె తీసుకువచ్చి ఇక్కడ బెట్టి ఆ నీళ్ల గిన్నె పొయ్యిమీద బెట్టు! మీ నాన్న స్నానం చేయక నాలుగు రోజులైంది. ఈ రోజైనా బలవంతంగా చేయించాలి" చివరి మాటల్ని కాసింత నిష్ఠూరంగానే అంది అమ్మ.

నిజమే! అమ్మ బాధలో అర్థం వుంది. ఎలా అంటే నాన్న సాదాసీదా తాగుబోతు కాదు. పచ్చి తాగుబోతు! రేపటికి ఇంట్లో బియ్యం లేకపోయినా, ఈ రోజు ఇంట్లో వున్న ఐదు రూపాయల్ని సైతం తాగుడు కోసం ఖర్చుచేస్తుంటాడు. దుకాణాల్లో దొరికే మామూలు సారా, తాండాల్లో దొరికే బెల్లం సారా, మందుకల్లు, చీపులిక్కరు ఇలా అన్ని రకాల తాగుడు నాన్నకు బాగా అలవాటయ్యింది. మోసులు ఎత్తిన అలవాటు ఏం మోసం చేసిందో తెలీదుగాని, నాన్నకు ఇప్పుడు శరీరంలో వణుకుడు ఆరంభమయ్యింది. ఎప్పుడయినా సమయానికి డబ్బు లేక తాగకపోతే ఆ వణుకుడు పెరిగిపోతుంది. ఇరవై నాలుగు గంటలు తాగి వుంటేనే వణుకుడు అదుపులో వుంటుంది. అప్పుడే తన పనిని తాను సరిగ్గా చేసుకోగలడు. ఇందుకోసం ప్రతి రోజూ సాయంకాలం కూలిపని అయిపోగానే నాన్న ఏ కల్లు దుకాణంలోనో, ఏ సారా దుకాణంలోనో దర్శనమిస్తాడు. తాగి వచ్చేటప్పుడు మళ్లీ రేపు సాయంకాలం వరకు అవసరమయ్యే మందును వెంటే తెచ్చుకుంటాడు. ఈ కారణంగా నాన్నమీద నాకు ఒక విసుగు అనేది క్రమంగా పెరిగిపోతోంది. ఇలాగని నాన్నమీది ప్రేమ మాత్రం తగ్గిపోవడం లేదు. ఎలాంటివాడైనా నా తండ్రి నాకు వుండాలనే ఆదుర్దా నాది. అందుకే ఎప్పుడైనా నాన్న ఇంటికి రావడం ఆలస్యమైతే అది ఎంత రాత్రయినా సరే నాన్నను వెదుక్కుంటూ వెళ్తాను.

కల్లు తాగిన వాళ్లు బోర్లా కిందపడితే బతకడం అనేది వుండదు కాబట్టి నాన్న ఎప్పుడు ఏ మందును తీసుకుంటాడో తెలీదు కాబట్టి నాన్న రాక ఆలస్యమైతే మాత్రం నాలోని భయం దిగంతాలకు ఎగుస్తుంది.

అమ్మ చెప్పినట్టుగా నాన్నకోసం నీళ్ళ గిన్నెను పొయ్యిమీద పెట్టి నేను బకెట్‌లోకి నీళ్ళను తోడుకుని, ఆరుబయట ఎరుకలి తడకలతో ఏర్పాటు చేసివున్న స్నానపు శాలలోకి స్నానానికై వెళ్ళాను.

స్నానం చేసి పూజచేసి అల్పాహారం తీసుకునేసరికి ఎనిమిది కావచ్చింది. అప్పటికి అమ్మ నా మధ్యాహ్న భోజనానికై క్యారియర్‌ని కూడా సర్దేసింది. కానీ అప్పుడే నేను ఎలా వెళ్ళిపోతాను? వంటపని పూర్తి కాగానే అమ్మ వెళ్ళి బీడీ పని చూసుకుంటుంది. ఇక నేను తమ్ముడికి స్నానం చేయించి, చిన్న చెల్లెళ్ళు ఇద్దరికీ జడలేసి, పూలసాహెబు ఎప్పుడొచ్చినా సరే నా బాధ్యతగా పువ్వుల్ని దేనికవే వేర్వేరుగా కొలిచి పెట్టి, నా పుస్తకాలు సర్దుకునేసరికి సమయం తొమ్మిదికి చేరువవుతుంది.

నేను నా పనుల్ని పూర్తిచేసుకునేలోపు పెద్దచెల్లెలు తన పనుల్ని కూడా పూర్తి చేసుకుంటుంది. అల్పాహారపు అంట్లను తనొక్కతే కడిగి, పనులవల్ల గందరగోళమైన ఇంటిని మరోసారి శుభ్రంచేసి ఇంకా ఏమైనా చిన్నచిన్న పనులు మిగిలివుంటే వాటిని చక్కదిద్ది తనదైన విధిని సక్రమంగా నిర్వర్తించుకుంటుంది. పెద్దకూతురిగా నా పని కాస్త ఎక్కువైనా నాకు బాధలేదు.

అసలు సమయం ఉంటే అన్నిపనులూ నేనే చేయాలి అనుకుంటాను.

అలవాటుగా నిద్రపోయిన తమ్ముడ్ని మంచంమీద పడుకోబెట్టి వెళ్ళి, "అమ్మా వెళ్లొస్తాను" పుస్తకాల సంచిని, క్యారియర్‌ని చేతుల్లోకి తీసుకుంటూ చెప్పాను.

"తమ్ముడు పడుకున్నాడుకదా? " తమ్ముడి వైపు చూస్తూ అంది అమ్మ.

"వాడు హాయిగా ఎప్పట్లా పడుకున్నాడు. నీ పనికి ఏం ఆటంకం వుండదు" చెప్తూనే వెళ్ళి మూలగా నిల్చోబెట్టి వున్న సైకిల్ వెనక్కి పుస్తకాల సంచిని క్యారియర్‌ని జాగ్రత్తగా వుంచి, తర్వాత నెమ్మదిగా సైకిలుని బయటకు తీసుకువెళ్ళాను.

నాతోపాటుగా వచ్చే మిగతా విద్యార్థులం అందరం తొమ్మిదిగంటలకు రచ్చబండ వద్దకు చేరుకుంటాం. అటునుంచే అందరం బయలుదేరివెళ్తాం. ఎవరైనా ఆలస్యమైతే మాత్రం ఒక్కరుగా బయలుదేరి వెళ్ళాల్సిందే. ఈరోజు నా పరిస్థితి ఒంటరిదే అయ్యింది. ఎందుకంటే... నేను రచ్చబండ వద్దకు వచ్చేసరికే సమయం తొమ్మిదిగంటల ఇరవై నిముషాలు దాటిపోయింది.

ఏం చేస్తాం? అటూఇటూ అనేసరికే ఈవాళ ఆలస్యం అయిపోయింది. ఇలాగని ఒంటరిగా వెళ్ళే ధైర్యం నాలోలేదు. ఎందుకంటే... టౌన్‌కి వెళ్ళాలంటే దొరబాబు చింత తోటగుండా వెళ్లాలి. అది మహారణ్యంలాంటి తోట! పైగా రెండు కిలోమీటర్ల విస్తీర్ణాన్ని ఆక్రమించి ఇరుకైన దారితో భయంకరంగా వుంటుంది. తోటను దాటేలోపు ఏ పోకిరీవెధవో వచ్చి వెర్రివేషాలు వేసినా ప్రకృతిసాక్షిగా ఎవ్వరికీ తెలియకపోవచ్చు. ఎందుకంటే దొరబాబు జోక్యంతో ఊరికి ఈశాన్య దిక్కునుండి టౌన్‌వరకూ తారురోడ్డు పడింది. దీంతో తోటలో జనసంచారం తక్కువైపోయింది. ఇక మేము విద్యార్థులం మాత్రం తోట దారిని వదలలేదు. ఎందుకంటే... టౌన్‌కి అర్థ కిలోమీటరు దూరంలో మా స్కూలుభవనం వుంటుంది. కాబట్టి మేము ఈ తోటనుండి వెళ్తేనే మాకు స్కూలు దగ్గరౌతుంది. లేదంటే మేము బయలుదేరే సమయానికి స్కూల్‌కి చేరేసరికి దాదాపుగా గంట ఆలస్యం ఖచ్చితంగా అవుతుంది.

"స్కూల్‌కి వెళ్ళాలా వద్దా? " నాలో నేను ఆలోచించుకుంటూ అటూఇటూ చూశాను. నాకుమల్లే ఆలస్యం అయి వుండాలనుకున్న నాతోటి విద్యార్థులు ఎవ్వరూ కూడా నాకు కనిపించలేదు.

మామూలుగా అయితే స్కూల్‌కి వెళ్ళకపోయినా ఫర్వాలేదు. కానీ ఈవేళ ఇంగ్లిష్ పరీక్ష. వారంరోజుల ముందుగానే ఈ విషయాన్ని చెప్పి, పరీక్షలో ఇవ్వబోయే పాఠ్యాంశాల్ని కూడా తెలియచెప్పింది టీచర్. మరి ఇలాంటప్పుడు, నేను వెళ్ళకపోతే పరీక్షకు భయపడే రాలేదని టీచరు మాత్రమే కాదు పిల్లలు కూడా అనుకుంటారు. పైగా పరీక్ష దొంగ అంటూ నా స్నేహితురాళ్ళంతా నన్ను వెక్కిరిస్తూ ఆటపట్టించడం ఖాయం. అందుకే... స్కూలుకి వెళ్ళే విషయమై ముందు సంశయించినా ఆ తర్వాత మాత్రం వెళ్ళాలనే నిర్ణయించుకుని ఇక నెమ్మదిగా నా సైకిలుని ముందుకు పోనిచ్చాను.

నేను అనుకున్నట్టుగానే దొరబాబుగారి చింతతోపులో కనుచూపుమేర కూడా ఎవ్వరూ కనిపించడంలేదు. ఎక్కడో దూరంగా ఆ చెట్ల గుబుర్లమధ్యలోంచి మాత్రం పాలేర్లకేకలు వుండుండి వినిపిస్తున్నాయి.

నేను సైకిలుని వేగంగా పోనిస్తున్నాను. ఇంతలో నా వెనక మరెవ్వరో సైకిలు మీదనే వస్తున్నట్టుగా సైకిలు గంట వినిపించింది. "పోకిరీగాళ్ళు కాకపోయి వుండుంటే బాగుణ్ణు" మనసులో భయంగా అనుకుంటూ సైకిలుని పక్కకు పోనిచ్చాను.

కోమటి వెంకటస్వామి కొడుకు రామే

శ్వరం నన్ను దాటుకుని ముందుకు వెళ్ళిపోయాడు. రామేశ్వరం నా తోటివాడే. నా క్లాసే. కానీ ఊర్లో వున్న ఏడవ తరగతి వరకే చదివి, ఫెయిలై, ఇంటిదగ్గరే వుంటూ దుకాణం చూసుకుంటున్నాడు. స్కూల్లో ఉన్నప్పటికీ వాడిలో తేడాలేదు. అప్పట్లో చిన్నపిల్లాడిగా వుంటూనే ఆడపిల్లల్ని అణువణువునా గుచ్చి చూసేవాడు. అవకాశం దొరికితే కావాలని ఢీకొట్టేవాడు. ఇక ఇప్పుడుమాత్రం దుకాణంలో కూర్చుని, ఒక్కో పుట్నం గింజను తీరికగా నోట్లో వేసుకుంటూ తమ దుకాణానికి మాత్రమే కాదు ఆ దారివెంబడి వచ్చిపోయే ఆడపిల్లల్ని కళ్ళార్పకుండా చూస్తుంటాడు. వస్తువుల్ని అందించేటప్పుడు కావాలని తగులుతుంటాడు. కేవలం ఆ తగలడంవల్ల మనుషుల్ని చూడడంవల్ల వాడికి దొరికే ఉన్మాదపు ఆనందం ఎలాంటిదో తెలియదుకానీ ఊర్లో వున్నది ఆ ఒక్క దుకాణమే కావడంవల్ల వాడి తలనొప్పిని వద్దనుకున్నా భరించక తప్పడంలేదు.

వాడు అసలే కామపిశాచి! సైగా ఒంటరిగా వెళ్తున్నాను. అందుకే వాడ్ని చూడగానే నా గుండె ఝల్లుమన్నమాట వాస్తవం. కానీ వాడు నన్ను దాటుకుని వేగంగా ముందుకు వెళ్ళిపోయాడు కాబట్టి "ఏదో అత్యవసర పనిమీద వెళ్తున్నాడులే. హమ్మయ్య థాంక్ గాడ్" అంటూ నాలో నేనే హాయిగా ఊపిరి పీల్చుకున్నాను.

కానీ అంతలోనే ఆటంకం ఎదురయ్యింది. నేను అలా కొంతదూరం ముందుకు వెళ్ళి సహజంగా చిన్న మలుపు తిరిగేసరికి ఆ మలుపు మొదట్లోనే వున్న గురువింద చెట్ల పొదలమాటుకి సైకిలుతో పాటుగా వెళ్ళిపోయిన రామేశ్వరం నా సైకిలుకి అడ్డు తగులుతూ అనూహ్యంగా వచ్చి దారికి అడ్డంగా పడుకున్నాడు.

సైకిలు ఆపే తొందరలో అనుకోకుండా బ్యాలెన్సు తప్పాను. ఫలితంగా నేను కింద పడిపోవడం, నామీద సైకిలు పడడం, నా కాళ్ళూచేతులూ గీరుకుపోవడం క్షణాలవ్యవధిలో జరిగిపోయాయి. అయినప్పటికీ నేను తాత్సారం చేయలేదు. నామీదనుండి సైకిలును వేగంగా లేపుకుని, ఆ సైకిలుని అక్కడే పడవేసి, అక్కడ్నుంచి వెనుతిరిగి పరుగెట్టసాగాను. నా వెనకే పరుగెట్టుకువచ్చిన రామేశ్వరం నన్ను ఆ వెంటనే చేజిక్కించుకున్నాడు.

"ఏయ్! వదల్రా" గట్టిగా అంటూ వదిలించుకునే ప్రయత్నం చేశాను. వాడు అందుకు ఏం మాట్లాడలేదు. నా నోటిని మాత్రం గట్టిగా నొక్కేసి నన్ను ఆ పక్కగా వున్న పొదల్లోకి బరబరా ఈడ్చుకుపోయాడు. వాడు అసలే నల్ల తుమ్మమొద్దులా బలిష్టంగా వుంటాడు. వాడి పశుబలాన్ని జయించడం నాకు అసాధ్యంలా తోచింది. అయినాకానీ నేను డీలాపడిపోలేదు. నా శక్తినంతా కూడదీసుకుని వాడ్ని తప్పించుకోడానికి శతవిధాలా ప్రయత్నిస్తూనే వున్నాను. ఆ ప్రయత్నంలో భాగంగా వున్నట్టుండి వాడ్ని బలంగా ఎగిరితన్నాను. ఆ దెబ్బకు వాడి కాళ్ళల్లో ఒక్కసారిగా బలం తగ్గిపోయి నన్ను తన ప్రమేయం లేకుండానే వదిలేస్తూ వెనక్కి తుళ్ళిపడ్డాడు.

అదే అదనుగా "రక్షించండి... రక్షించండి" అని గట్టిగా అరుస్తూ నేను అక్కడ్నుంచి వెనుతిరిగి పరుగెట్టసాగాను.

ఆ వెంటనే తమాయించుకున్న ఆ తుమ్మమొద్దుగాడు "ఏయ్...! ఏయ్!" అంటూ నా వెనకే నన్ను వెంబడిస్తూ పరుగు లంకించుకున్నాడు.

ఈమారు నేను వాడికి అంత సులువుగా దొరికిపోలేదు. దాదాపుగా అర్ధకిలోమీటరుకి ఎక్కువగానే పరుగెట్టాను. అప్పటికి కూడా నా అరుపులు ఆగలేదు. వాడి అరుపులు కూడా ఆగలేదు. అయినప్పటికీ ఆ అరుపుల్ని వినిపించుకునే నాథుడే కరువైనట్టుగా, అభయపూర్వకంగా ఏ ఒక్కరి ఆచూకీ కన

బడడంలేదు. అయినాసరే దిక్కులు పిక్కటిల్లేలా ఓవైపు అరుస్తూ, మరోవైపు వుండుండీ వెనక్కి తిరిగి చూస్తూ ప్రాణంపోయినా వాడికిమాత్రం నేను దొరకరాదనే తెగింపుతో పట్టుదలతో నా వేగం మరింత పెంచడానికి ప్రయత్నించాను. అదివరకే నాలోని బలాన్ని అంతా ఉపయోగించి వున్నాను కాబట్టి లేని బలాన్ని కూడగట్టుకుని పరుగెట్టే ప్రయత్నం చేసేసరికి నా శరీరం అదుపు తప్పింది. ఫలితంగా పరుగెడుతున్న వేగంతోనే బోర్లాపడిపోయాను. ఆ దెబ్బకి నా నవనాడులూ ఒక్కసారిగా కదిలినట్టయ్యింది. ఆ భయంకర కదలిక నా ప్రాణాన్ని హరించిన భావన కలుగుతుంటే అష్టదిక్కులూ ప్రతిధ్వనించేలా అరిచాను.

"అ...మ్మా...!"

నా బాధ ఎంత పెద్దదైతే అక్కడ ఎవరికి కావాలి? అసలు కాటేయడంకోసం కాచుకుని వున్న కాలనాగుకి కావలసింది ఎదుటి ప్రాణిలో అసహాయతనే కదా? ఇప్పుడు ఆ అసహాయత ఊబిలో నా జీవిత ప్రశ్న కొట్టుమిట్టాడుతోంది. అంతేకాదు ఆ కాలనాగు వికృతమైన చిరునవ్వుతో నాకు కాస్త దూరంలో నిలబడి చూస్తూ ఏదో ఒక క్షణంలో నన్ను చేరేవాడిలా కనబడుతుంటే నాకు నేను ఓటమి చేరువలో నిలిచిన జీవన్మృతిలా కనిపిస్తున్నాను.

నా నిస్సహాయత వాడిని మరింత బలోపేతం చేసింది. పగ్గాలు తెగిన పొగరుదున్నను చేసింది. అందుకే... అదే చిరునవ్వుతో వాడు నావైపు నెమ్మదిగా అడుగులు వేయడం ఆరంభించాడు.

అసలే కాళ్ళూచేతులూ గీసుకుపోయి ఒకవైపు రక్తం కారుతోంది. మరోవైపు లేవలేని అశక్తత నన్ను ఇనుప ఫెన్సింగ్‌లా చుట్టేసింది. ఈ స్థితిలో నావైపుగా వస్తున్న ఆ విషసర్పాన్ని ప్రాణాలు కోల్పోతున్న దానిలా చూశాను.

"ఏంటే ఆ చూపు? ఇక నన్ను తప్పించుకోలేవు" నన్ను సమీపించిన ఆ దైత్యుడి కంఠంలో క్రూరమైన ఆనందం.

"ప్లీజ్... నన్నేం చేయొద్దు" నాకు తెలీకుండానే నా కళ్ళవెంబడి కన్నీళ్ళు ధారాపాతమౌతుంటే అప్రయత్నంగా చేతులు జోడించాను.

"ఏం చేయొద్దు?" వ్యంగ్యంగా అంటూ కింద పడివున్న నన్ను ఒకమారు పరిశీలించి చూశాడు. ఆ చూపుల్లో స్పష్టమౌతున్న కాముకత్వం నాలో నిలువెత్తున అసహ్యపు అలజడుల్ని రేపుతుంటే నెమ్మదిగా నన్ను నేను ఒక మారు చూసుకున్నాను.

మోకాళ్ళకి ఎగువగా చెదిరిన నా లంగా, బలమైన నా కాళ్ళను వాడి కళ్ళకు ఉచిత ప్రదర్శనలా చూపెడుతున్న విషయాన్ని అప్పటికిగానీ తెల్సుకోలేకపోతూ చప్పున లంగా సవరించుకున్నాను.

అప్పటికి వాడు నన్ను పూర్తిగా సమీపించడం మాత్రమేకాదు, నా మీదకు క్రమంగా వంగుతున్నాడు కూడా.

"రేయ్! చంపేస్తాన్రా" ఏం చేయాలో తెలియని అశక్తతో నాకు తెలియకుండా నా గొంతు చించుకుని, నాకు తెలియకుండానే వాడిని బలంగా నెట్టేశాను కూడా.

అంతలో ఎడంగావున్న బాటవెంబడి ఎవ్వరో వస్తున్న అలజడి కలిగింది. అది నాలో కొంత ధైర్యాన్ని కలిగించింది. కానీ వాడిలో మాత్రం శాడిజాన్ని నిదురలేపింది. అందుకే వెనక్కి తుళ్ళిపడిన వాడల్లా ఒక్కసారిగా నన్ను సమీపించి,

"వసుంధరా నన్ను క్షమించు. వాడెవ్వడో నిన్ను మానభంగం చేస్తుంటే కూడా రక్షించలేకపోయాను. రక్షించాలనే వచ్చానుకానీ వాడిచేతిలో చేతకానివాడినైపోయాను. అయ్యో! గాయాలు నీ శరీరానికేకాదు, ఇదిగో నా శరీరానికి కూడా. ఓరి దేవుడా! ఆడపిల్ల జీవితం నిలువునా నాశనం అయిపోయింది కదా తండ్రీ!"

చేతులు తిప్పుతూ మాటలకి అనుగు

ఐంగా ముఖకవళికల్ని మార్చేస్తూ, మంచివాడుగా మానవత్వం వున్నవాడిగా నన్ను వెంబడించే సమయంలో తగిలిన తన చిన్న చిన్న గాయాలని స్పృశించుకుంటూ, వాడు కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంటే నేను ఒక్కసారిగా జరిగింది ఏమిటో మర్చిపోయాను. అందుకే వాడివైపు విస్తుపోయి చూస్తుండిపోయాను.

“ఎవరూ... ఎవరూ” బాట వెంబడి వస్తున్నవాళ్లెవరో కాస్త గట్టిగానే ప్రశ్నిస్తూ మేము వున్న దారిమీదకు వచ్చారు.

“అన్నా! పాపం మన ఆశప్ప కూతురు. ఎవడో దొంగ సచ్చినోడి చేతిలో నాశనమైపోయింది” వచ్చినవాళ్ళు అలా కనిపించారో లేదో ఇలా వాళ్ళకు పరుగున ఎదురువెళ్ళాడు వాడు.

“అయ్యయ్యో...” జాలిగా, గాబరాగా నావైపు చూస్తూ వాళ్ళు పరుగున వచ్చారు.

వాళ్లెవరో నేను గుర్తుపట్టలేదు. కాకపోతే ఎక్కడో చూసిన జ్ఞాపకం మాత్రం తోస్తోంది.

“అయ్యో పాపం! ఇందాక కేకలు వినిపిస్తే ‘మంచె దగ్గరి’ కేకలు అనుకున్నాం. ప్రాణం మీది కేకలు అని అర్థమై వుండుంటే వచ్చి మానం కాపాడేవాళ్ళం. ఛ...ఛ! ఆ చెరుకు తోటలో బోరు వేస్తున్న శబ్దం ఈ దీనురాలు వేస్తున్న కేకల్ని సరిగా అర్థం కానివ్వలేదు” అని, పక్కనే ఆదుర్దా కనబరుస్తూ నిలబడివున్న రామేశ్వరం గాడివైపు చూస్తూ, “ఏం బాబూ! వాడెవ్వడో రాక్షసుడు అమ్మాయిని నాశనం చేస్తుంటే కాపాడడం నీకు చేతకాలేదా? ” కొండంత సానుభూతిని ముఖంలో పలికిస్తూ అడిగాడు వచ్చినవారిలో ఒక్క వ్యక్తి.

“కాపాడబోయాను కాబట్టే ఈ గాయాలు అయ్యాయి అన్నా” తన గాయాల్ని మళ్ళీ స్పృశించుకుంటూ ఏడుపుముఖంతో చెప్పాడు వాడు.

అందుకు వచ్చినవారిలో రెండవవ్యక్తి ఏదో అనబోయాడు. అంతసేపటివరకూ వాళ్ళు ఏం మాట్లాడుతున్నారో, వాళ్ళ దృష్టిలో నా జీవితం అన్యాయంగా ఎటువంటి ముద్ర వేసుకుంటుందో, అర్థమౌతున్నా కూడా మాటరాని మౌనాన్నై ఎలా వుండిపోయానో తెలీదుకానీ... ఇక ఎంతోసేపు అదే మౌనంతో వుండలేకపోయాను. ఏ అగ్నిగోళాల సందుల్లోనో చిక్కుకుపోయిన భావనతో చెలరేగిపోతున్న నా మనసును నేనే ఓదార్చుకుంటూ తేరుకుని ఒక్కసారిగా బిగ్గరగా అరిచాను.

“ఇంకేం మాట్లాడొద్దండీ”

నేను అనూహ్యంగా అలా అరిచేసరికి రామేశ్వరంగాడితో పాటుగా ఆ ఇద్దరు వ్యక్తులూ నన్ను ఆశ్చర్యంగా చూశారు.

“మీకు దండం పెడతాను. వీడు చెప్పిన మాటలు అన్నీ అబద్ధం” నేనూ ఒక సగటు ఆడపిల్లను కాబట్టి చేతులు జోడిస్తూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాను.

“నీ గురించి నేనుగానీ వీళ్ళుగానీ, ఎక్కడా బయటపెట్టం వసుంధరా” నాకు ఏదో జరిగినట్టుగా, ఆ విషయాన్ని పెద్దమనసుతో దాచిపెట్టి నా జీవితాన్ని కాపాడుతాం అన్నట్టుగా నంగనాచిలా అన్నాడు రామేశ్వరంగాడు.

“నోర్ముయ్యరా వెధవా” ఏడుస్తూనే కసిగా గొంతు చించుకున్నాను.

“వూరుకోమ్మా! ఈ బాబు ఏమైనా చెడ్డగా మాట్లాడాడా? నీ మేలు కోరే మాట్లాడుతున్నాడు కదా? ”

“అయ్యా... మీరెవరో నాకు తెలీదుకానీ, వీడు చెప్తున్న మాటల్ని దయచేసి నమ్మొద్దు. నన్ను ఎవ్వరూ ఏం చేయలేదు. వీడే నన్ను నాశనం చేయాలని చూశాడు. అప్పుడే దేవుళ్లలా మీరొచ్చారు. నన్ను నమ్మండి” అనే బాధతో ఏడుస్తూ చెప్పుకున్నాను.

వెంటనే ఆ వ్యక్తులు ఆ శనేశ్వరంగాడిని చూశారు.

"అన్నా! ఆడపిల్లకదా" వాడు హుందాతనం ప్రదర్శించాడు.

"ఒరేయ్ నిన్ను చంపేస్తాన్రా" వాడిమీదకు చేతగాకపోయినా వెళ్ళబోయాను.

"అయ్యో పాపా..."

"వద్దమ్మా" అంటూ ఆ ఇద్దరు వ్యక్తులూ నన్ను ఆపారు.

"నన్ను నమ్మండి. నాకేం జరగలేదు" వాళ్ళకు మరోసారి విన్నవించుకున్నాను.

"జరిగినా జరగకపోయినా నీదారిన నీవు వెళ్ళిపోమ్మా. మనం ఇలాగే మాట్లాడ్తూ ఇంకాసేపు ఇక్కడే వుంటే ఎంతయినా బాగుండదు. అసలే ఆడపిల్లవి. అందునా పెళ్ళి కావల్సినదానివి. ఎవరైనా నాల్గవ వ్యక్తి వచ్చి ఇదంతా వింటే వూరంతా పుకారైపోతుంది. అందుకే మరేం మాట్లాడకుండా వెళ్ళిపోమ్మా. నీకు అన్యాయం జరిగిందా లేదా అనేది కూడా మేం ఆలోచించం. ఈ విషయాన్ని ఇక్కడే మర్చిపోతాం"

"అవునమ్మా వెళ్ళిపో"

ఆ వ్యక్తులు నా మేలుకోరి చెప్తుంటే నేను ఇంకేం మాట్లాడలేకపోయాను. అసలు నాకేం జరగలేదు అని ఇంకో వందమార్లు చెప్పుకున్నా వాళ్ళు విన్పించుకునే స్థితిలో లేరు. అందుకే నేను అసహాయంగా మిగిలిపోయాను. బేలగా, నామీద నాకే కలుగుతున్న జాలితో సగం చచ్చినదానిగా, ఆ వ్యక్తులవైపు అలాగే చూస్తూ... నా ఆవేశాన్ని, ఆక్రోశాన్ని పిడికిళ్ళలో బిగించుకున్నాను.

★ ★ ★

రాత్రి పదకొండు గంటలు కావొస్తోంది.

ఇంట్లో అందరూ పడుకున్నారు. నాకు నిద్ర రావడంలేదు. పడుకుని అటూ ఇటూ కదులుతూ రామేశ్వరంగాడి గురించే ఆలోచిస్తున్నాను.

నా జీవితంపై భరించరాని ముద్రవేసిన ఆ రాక్షసుణ్ణి ఎలాగైనాసరే నాశనం చేయాలనే పగ, కసి, నాలో క్షణక్షణానికీ పెరిగిపోతుంటే ఆ ఉద్వేగాన్ని, ఉద్రేకాన్ని తట్టుకోవడం నాకు అసాధ్యం అనిపిస్తోంది. అందుకే... వుండుండీ లేచి కూర్చుంటున్నాను. మరికొన్నిసార్లు లేచి అటూఇటూ తిరుగుతున్నాను.

"వసూ" కాసేపటికి అమ్మ గొంతు వినిపించింది.

వినిపిస్తున్నా కూడా ఆలోచిస్తూ పలకలేదు.

"అమ్మా వసూ" మళ్ళీ పిలిచింది అమ్మ.

"ఆ..." ఆలోచిస్తూనే పలికాను.

"నిద్ర రావడంలేదా? సైకిలుమీదనుండి కిందపడ్డావుకదా. పైకి కనిపించే దెబ్బలే కాదు, కనిపించని దెబ్బలు కూడా శరీరం లోపల తగిలి వుంటాయి. ఆ దెబ్బల బాధ తగిలినప్పుడు తెలీదుకానీ, తర్వాతర్వాత బాధ పెడుతుంటాయి" అంటూనే లేచి కూర్చుని ఆవులిస్తూ చెదిరిన జుట్టుని ఒకమారు విడిచి కొప్పుగా కట్టుకుని, తర్వాత అటునుంచి లేచి నెమ్మదిగా వంటగదివైపు నడిచింది అమ్మ.

"ఎక్కడికి? " నీరసంగా అడిగాను.

"సెగ కాపుతాను" వెళ్తూనే చెప్పింది అమ్మ.

"వద్దమ్మా" అమ్మను వారించాను.

"వద్దంటే ఎట్లాగే? సెగ కాపకపోతే నీవు ఇక ఈ రాత్రంతా ఆ నొప్పులతో జాగారం చేయాల్సిందే" అంది అమ్మ.

"ఆ కాపడమేంటో మధ్యాహ్నామే అయిపోయిందికదా. అనవసరంగా ఈ రాత్రిపూట ఎందుకు కష్టపడతావు? " అమ్మ కష్టపడడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. నాకుమల్లే అమ్మకు కూడా నేను బాధపడడం ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుకే, "మధ్యాహ్నాం తిన్నామని రాత్రికి తినకుండా పడుకుంటావా? ఇదీ అంతే" అంటూనే లోపలికి వెళ్ళింది.

నేను ఇంకేం అనలేదు. అమ్మ మాత్రం

తన గోడును వంటింటి గోడలతో ఏకరువు పెట్టుకోసాగింది.

"నొప్పులు తగ్గడానికి ఏవైనా మాత్రలు తెప్పిద్దామనుకుంటే సంచిలో పైసాలేదు. పోనీ అరువు పెడదామంటే ఆ శెట్టి బాకీ ఇప్పటికే మోపెడయ్యింది. కడుపులోకి మందు లేకుండా ఎన్నిసార్లు సెగ కాపుతే ఏం లాభం? "



తెల్లవారుఝామున ఐదు గంటలు కావస్తోంది. అప్పటికే నాకు మెలకువ వచ్చి అర్ధ గంటకు పైనే అయ్యింది. కానీ ఎప్పటిలా లేచి నా పనేంటో నేను చేసుకోవడం లేదు. నిన్నటి ఒంటినొప్పులు ఇప్పుడు పచ్చిపుండ్లలా తయారై నన్ను పడకమీదనుండి కదలనివ్వడంలేదు. కాబట్టి అలాగే పడుకుని వున్నాను.

నేను దొరబాబుకి కాబోయే కోడలిని. అంటే నేను కాబోతున్న పెద్దింటి గృహిణిని అన్నమాట. మరి ఇలాంటప్పుడు నాపై ఉత్తి పుణ్యానికి కూడా అపవాదు రావడం బాగుండదు. అది కుటుంబ పరువును సవాల్ చేస్తుంది. కానీ పరిస్థితి మాత్రం నాకు ఇప్పుడు ప్రతికూలంగా నిలిచింది. జరిగిన సంఘటన ఏదైనప్పటికీ అది నాకూ రామేశ్వరంగాడికి మధ్యలోనే వుండిపోయి వుండుంటే బాధ వుండకపోయేది. కానీ సమస్యను భూతద్దంలోంచి చూపిస్తున్నట్లుగా మా ఇద్దరికీ మధ్య మరో ఇద్దరు నిలిచారు. కాబట్టే నా మనసు కల్లోల సముద్రమై నన్ను కలవరపరుస్తోంది.

"వసూ" పిలుస్తూ వచ్చింది అమ్మ.

"ఆ..." జీవం లేనట్టుగా పలికాను.

"రాత్రి నేను సెగ తీసుకువచ్చేసరికే చిత్రంగా కునుకు తీసివున్నావు. మరి ఇప్పుడు నొప్పులు తగ్గినట్టేనా? తగ్గితే గనుక మెల్లగా లేచి అటూ ఇటూ తిరుగు. ఆరోగ్యంగా వుంటుంది. లేదంటే తగ్గినట్టే తగ్గి నొప్పులు మళ్ళీ మొదలవుతాయి" చెప్పింది అమ్మ.

"చేతకావడంలేదు" మెల్లగా చెప్పాను.

"అంటే నొప్పులు తగ్గలేదా? " గాభరాపడింది అమ్మ.

అదే క్షణంలో నాకు అసలు విషయం గుర్తుకువచ్చి అమ్మకు ఉపశమనం కలిగించబోయాను. అంతలోనే నాన్న కల్పించుకుంటూ, "ఏందే పొద్దుటే సోది పెట్టారు" చికాకు ప్రదర్శిస్తూ పడుకున్నవాడల్లా లేచి కూర్చున్నాడు.

"నిన్నటినుండి పిల్ల బాధ పడుతుంటే కళ్ళకు కనిపించలేదుకానీ ఇప్పుడు ఆ బాధ గురించి మాట్లాడుతుంటే చెవులకు వినిపించిందా? " అమ్మ గొంతులోని వెటకారం నాన్న నిర్లక్ష్యాన్ని సూటిగా వెళ్ళి గుచ్చింది.

నాన్న ఇక కిమ్మనలేకపోయాడు. మంచం దిగి బీడీ వెలిగించుకుంటూ బయటకి నడిచాడు.

నాన్నమీద నాకు కోపం వచ్చింది. పిల్లలు ఏం తింటున్నారు? ఏం చేస్తున్నారు? అనే విషయాల్ని పట్టించుకోవడం చేతకాదు కానీ, పిల్లలమీద కోపం, విసుగు ప్రదర్శించడం మాత్రం బాగా అలవాటు. ఇలాగని నాన్నకు మాపై ప్రేమలేదని అనుకోవడం పొరపాటే. ఎందుకంటే... నాన్నకు మామీద బోలెడంత

ప్రేమ వుంది. ఆ విషయం చాలాసార్లు రుజువవుతుంటుంది కూడా. కాకపోతే నాన్న మంచితనం, మూర్ఖత్వం రెండూ సమపాళ్ళలో కలిసివున్న వ్యక్తి.

"ప్చ్... ఏం మనిషో ఏమో? " వెళ్తున్న నాన్ననే చూస్తూ విసుగ్గా గుణిగింది అమ్మ.

"నాన్న గురించి తెల్సిందేకదా! ముందు ఇటు విను" అంటూ అమ్మ ముఖాన్ని నా వైపుకు తిప్పుకుని "దొరబాబుగారు నెలకు ఒకమారు మెడికల్ క్యాంపు ఏర్పాటు చేయిస్తారు కదా. మరి ఈ నెలలో నిర్వహించే క్యాంపు రేపే వుందికదా. ఇలాంటప్పుడు మాత్రలకోసం అని ఆ శెట్టిని కాళ్ళావేళ్ళా పడడం దేనికి? " చెప్తూ అమ్మ గదవపట్టి చిన్నగా ఆడించాను.

"నిజమేనే! కాకపోతే రేపటివరకూ ఈ బాధల్ని భరిస్తావా? " నా చేతులకు తగిలిన గాయాల్ని మృదువుగా స్పృశిస్తూ దీనంగా అడిగింది అమ్మ.

"మనలాంటి పేదవాళ్ళకు భరించడం అనేది బాగా అలవాటేగా" అన్నాను.

"ప్చ్! ఏం బతుకులో ఏమో! బీడీ ఆకు మాదిరిగా ఎండిపోయి వున్నావు" ఆ పక్కనే చేటలో కత్తిరించకుండా పెట్టి వున్న తుని కాకు కట్టల్ని చూస్తూ నిరాశగా నిట్టూర్చింది అమ్మ.

"బాధపడొద్దమ్మా! ఎవరి బతుకుల్లో అయినా కొన్నాళ్ళు వెన్నెల... కొన్నాళ్ళు చీకటి. మనం ఇప్పుడు చీకట్లో వున్నాం కాబట్టి మనం పయనిస్తున్నది వెలుగువైపు" నా రంగుల స్వప్నాన్ని దృష్టిలో వుంచుకుని సన్నని చిరునవ్వుతో చల్లగా చెప్పాను.

★ ★ ★

మరుసటిరోజు ఊర్లో మెడికల్ క్యాంపు ఏర్పాటు చేశారు. ఉదయం ఎనిమిది గంటలనుండి సాయంకాలం నాలుగు గంటలవరకూ కొనసాగే ఆ క్యాంపు నిర్వహణ మొత్తాన్ని దొరబాబు దగ్గరుండి చూసుకుంటారు. పైగా ఆడవాళ్లకోసం మహిళా డాక్టరు రావడం అనేది దొరబాబుకు ప్రజల మీద వున్న అభిమానాన్ని నిరూపిస్తుంటుంది. అయితే ఇదంతా దొరబాబు ప్రజల మెప్పును పొందేందుకు ఉపయోగిస్తున్న స్వార్థాస్త్రమని గిట్టనివాళ్ళ అభిప్రాయం.

ఆలోచిస్తూ అమ్మ వెంట మెల్లగా మెడికల్ క్యాంపు వద్దకు వెళ్లాను. ఎప్పటిలా పంచాయతీ ఆఫీసులో క్యాంపు ఏర్పాటు చేశారు. ఉదయం సమయం కాబట్టి కూలికి వెళ్లే జనాలు ముందుగా చూపించుకుని తొందరగా వెళ్లిపోవాలనే ఆతృతతో కనిపిస్తూ రెండు వరసల్లో బార్లు తీరి నిల్చుని వున్నారు. నేను, అమ్మ వెళ్లి ఒక పక్కగా కూర్చున్నాం.

మా వెనక నుండి వాహనం వచ్చి ఆగిన శబ్దం అయ్యింది.

"దొరబాబు వచ్చినట్టున్నారు" అంటూ అమ్మతోపాటుగా వెనుతిరిగి చూశాను. నేను అన్నట్టుగానే వచ్చి ఆగిన జీపులోంచి దొరబాబు ఠీవిగా కిందికి దిగాడు. ఆయన రాకను అల్లంత దూరం నుండే గమనించి అంతకు మునుపే లేచి నిల్చున్న వాళ్లు, ఆయన రాగానే గమనించి అప్పటికప్పుడే లేచి నిల్చున్నవాళ్లు అందరూ కూడా "దండాలు బాబూ" అంటూ సవినయంగా చేతులు జోడించసాగారు.

"వసూ" అంతలో నా పక్కలో నుండి పద్మజ గొంతు వినబడింది. ఆ గొంతులో ఎప్పటిలా హడావిడిగాని సహజత్వంగాని లేదు. ఏదో అర్థం కాని భావన స్పష్టంగా ఎగిసిపడింది.

ఆ భావన నా మస్తిష్కాన్ని అలా వచ్చి తాకిందో లేదో ఇలా ఆలోచనల్లోంచి ఒక్కసారిగా బయటపడుతూ తిరిగి చూశాను.

"ఏంటీ వసూ" అదే అర్థం కాని భావనతో నా భుజాల్ని పట్టుకుని కుదిపింది పద్మజ.

"నేనేంటోగాని నువ్వేంటి అలా? " కనుబొమలు ముడిచి అన్నాను.

"ఏంటోనే! నాకు అంతా అయోమయంగా

వుంది. చూస్తుంటే ఏం జరగనట్టుగానే వుంది. కాని..." నన్ను, అమ్మను మార్చి చూస్తూ అంది పద్మజ.

"ఎందుకు జరగలేదమ్మా! సైకిలు మీద నుండి కిందపడ్డంవల్ల కనిపించే దెబ్బల కన్నా కనిపించని దెబ్బలే ఎక్కువ తగిలాయి" అమ్మ కల్పించుకుంది.

అందుకు పద్మజ అమ్మవైపు ఓ మారు చిత్రంగా చూసి ఆ తర్వాత నా వైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"అవునే! సైకిల్ మీద నుండి పడటంవల్ల ఒళ్లంతా హూనమైపోయింది" బాధగా చెప్పాను. కాగా నా అంతరంగంలో మాత్రం పద్మజకు నా గురించి మరోలా తెల్సి వుంటుందనే అనుమానం చెలరేగుతూ నాలో అలజడిని రేకెత్తించింది. ఆ రామేశ్వరంగాడు ఖచ్చితంగా తప్పుడు ప్రచారం చేసి వుంటాడని, వాడి ఇల్లు పద్మజ వాళ్లింటికి దగ్గరే కాబట్టి వాడి అవాకులూ చవాకులు ఆ ఇళ్ల మధ్య ముసురువానల్లా కమ్మి వుంటాయని, అది సాధారణమైన విషయం కాదు కాబట్టి వాళ్లల్లో వాళ్లు చెవులు కొరుక్కోవడం వల్ల సహజమైన అన్ని విషయాల మాదిరిగా ఊరు ఊరంతా గుప్పున ఇంకా పాకిపోలేదని, ఈ రోజో రేపో తప్పకుండా పాకిపోతుందని, చివరికి ఆ విషయం దొరబాబు కుటుంబానికి కూడా తెలిసిపోవచ్చని స్పష్టమౌతూ నాలో వణుకుడు కూడా ఆరంభమైంది. అయినప్పటికీ బయటపడలేదు.

"అలాగా!" నా ముఖంలోకి అదో మాదిరిగా చూస్తూ అంది పద్మజ. ఆ చూపుల్లో నిజాన్ని నేను దాచిపెడ్తున్నానో లేక అపవాదును మోస్తున్నానో ఏదీ తెలియని సందిగ్ధం తెలియకనే తెలిసివస్తోంది. అయినాగాని అర్థం కానట్టుగా వుండిపోయాను. ఎందుకంటే విషయాన్ని దాని నోటి నుండే రాబట్టి వాస్తవం ఏంటనేది తర్వాత వివరించాలనేది నా ఆలోచన! అందుకే సహజత్వం ప్రదర్శిస్తూ "అదేంటే అదోలా మాట్లాడ్తున్నావు? మరోలా చూస్తున్నావు? " అడిగాను.

"ఏం లేదే!" అని కాసేపు ఆగి, అమ్మవైపు చూస్తూ "పెద్దమ్మా! నేను ఎవరో పరాయి దాన్నో లేక స్వంత మనిషినే అయివుండి గిట్టనిదాన్నో అయి వుండివుంటే ఇప్పుడు సీక్రెట్‌గా వుండిపోవడమో లేక హాపీగా ఫీల్ కావడమో చేసేదాన్ని. కాని నేను మీ శ్రేయోభిలాషిని! అందుకే నాకు తెల్సిన విషయాన్ని నిజమా కాదా అని అడుగుతున్నాను. మరేం అనుకోకూడదు" అనుమతిగా అంది పద్మజ.

తను మాట్లాడిన ఆంగ్ల పదాలు అర్థం కాలేకపోయినా మిగతా అంతా అర్థమైంది కాబట్టి అడుగు అన్నట్టుగా తలాడించింది అమ్మ.

"ఆ పెద్దమ్మా" వెంటనే విషయానికి రాలేనిదై మరోసారి నసిగింది పద్మజ.

"చెప్పమ్మా" అంది అమ్మ.

"ఆ ఏంటంటే" అని పద్మజ అంటుంటే "వొదినా" అంటూ వచ్చింది ఈడిగోళ్ల రాములమ్మ.

రాములమ్మవైపు చూసింది అమ్మ.

"ఏంది వొదినా! పిల్ల గురించి వూర్లో అట్లా మాట్లాడ్తున్నారు? " నేరుగా అడిగేసింది రాములమ్మ.

అటు పద్మజ, ఇటు రాములమ్మ ఇద్దరి మధ్య అమ్మకు ఏమీ అర్థం కాలేదు. అందుకే రాములమ్మవైపు కంగారుగాచూస్తూ "ఏంది రాములమ్మా? నువ్వూ అట్లాగే అంటున్నావు. ఈ పిల్ల అట్లాగే అంటోంది" అంటూ పద్మజను ఒక మారు చూసి ఆ తరువాత నావైపు చూసింది. నన్ను చూసిన ఆ చూపుల్లో "ఏం జరిగిందే? " అన్న భావన ప్రస్ఫుటమయ్యింది.

"అదే.. మన వసమ్మను ఎవ్వడో తండ్రికి బుట్టని నా కొడుకు ఏదో చేశాడని, ఆ విషయాన్ని మన శెట్టి కొడుకు కండ్ల బడిందని

వూరువూరంతా చెప్పుకుంటున్నారు" గొంతు తగ్గించి సూటిగా చెప్పింది రాములమ్మ.

"అవును పెద్దమ్మా! విషయం ఇంకా బాహాటం కాలేదు కాని ఇళ్లల్లో మాత్రం ఎవ్వరికి వాళ్లు గోరంతలు కొండంతలు చేసి చెప్పుకుంటున్నారు" చెప్పింది పద్మజ.

రాములమ్మ చెప్పింది విన్నప్పుడే సగం చచ్చినట్టుగా తయారైన అమ్మ, పద్మజ మాట పూర్తికాగానే పూర్తిగా చచ్చినదానిలా తయారయ్యింది. ఆ స్థితిలో నన్ను చూసిన అమ్మ చూపుల్లోని నిలదీసినట్లున్న భావం నన్ను కూడా చంపేస్తుంటే అప్రయత్నంగా, కసిగా పెదవి విప్పాను.

"దొంగనా వెధవ! అబద్ధాన్ని చెప్పినందుకు అన్నం లేకుండా చస్తాడు"

నా మాట పూర్తి కాకముందే అమ్మ తేరుకుంది. ఆడపిల్లను, పైగా పెళ్లి కావల్సినదాన్ని కాబట్టి, తను విన్న విషయాన్ని వెనకేసుకు రాకుండా "మా పిల్లకు ఏం కాలేదు. సైకిలు మీద నుండి కిందబడింది. అంతే" ఆత్రంగా చెప్పింది.

అందుకు రాములమ్మ ఏదో అనబోయింది. అందుకు నేను అడ్డుతగులుతూ "వాడికి అక్కాచెల్లెళ్లు వుండీ కూడా నాపై లేనిపోనివి సృష్టించి చెప్పినందుకు వాడు ఖచ్చితంగా నాశనం అవుతాడు. అసలు ఆ రోజు ఏం జరిగిందో తెల్సా! జరిగిన విషయాన్ని ఇంట్లో కూడా చెప్పలేదు. చెప్తే లేనిపోని గొడవలు జరుగుతాయనే చెప్పలేదు" అని ఓ రెండు క్షణాలు ఆగి ఆ రోజు జరిగిన సంఘటన గురించి పూసగుచ్చినట్టుగా వివరించాను.

"అలాగా! మరి ఆ డర్టీరాస్కెల్ ఏంటే అంత ఘోరంగా సీను సృష్టించాడు" గుండెలపై చేయివేసుకుంది పద్మజ.

"వాడ్ని ఊరికే వదిలేది లేదు" పళ్లు బిగువున అన్నాను.

రాములమ్మ మాత్రం నావైపు నోటమాట మరిచి చూస్తుండిపోయింది. నేను చెప్పింది వింటున్నప్పుడే ఆమె తన నడుముకు ఓ చేతిని ఆన్చుకుని మరో చేతిని గదవమీద వేసుకుని నాకు అనుగుణంగా ముఖ కవళికల్ని మారుస్తూ చూసింది. ఇక ఇప్పుడు శిలా ప్రతిమలా మారిపోయింది చూడూ. ఆ చూపుల్లో "నా మాటలమీది అపనమ్మకం" కనిపించకనే కనిపిస్తోంది. ఆమెలోనే కాదు పాముతోకను చూసి పడగనే చూశామని చెప్పే ఈ జనాలు అందరిలోనూ ఇక మీదట అదే భావాన్ని చూడాల్సి వస్తుందని, నా నిజాయితీ అరణ్యరోదనే అని నాకు తెలుసు! ఇలాగని నాలో అధైర్యం చోటు చేసుకోలేదు.

నడిసముద్రంలో అదుపు తప్పబోయిన నావని క్రమబద్ధం చేయబోయే నావికుడి మొండి ధైర్యంలా నాలో నాకే తెలియని కొత్త ధైర్యం ఏదో వచ్చి చేరింది. అందుకే మరెవ్వరూ పెదవి విప్పకముందే నేనే అన్నాను.

"వాడ్ని ఏం చేస్తానో నాకే తెలీదు"

"వూరుకోమ్మా వసమ్మా! పెండ్లి కావల్సిన దానివి! అనవసరంగా గోటితో పోయేదానికి గొడ్డలి ముట్టుకోవద్దు" అప్పటికిగానూ నెమ్మదిగా నోరు మెదిపింది రాములమ్మ.

"నేను ఊరుకుంటే వాడి ప్రచారం మితిమీరుతుంది" ఆవేశంతో ఎగిసిపడ్డాను.

"అయ్యయ్యో! ఊరుకోకపోతే గొడవలు వూరుదాటి కూడా పోతాయి. అప్పుడు నిన్నెవరు పెండ్లి చేసుకోవాలి? జరిగింది ఏదో జరిగిపోయింది. ఏం జరగనట్టే నోరు మూసుకుని వుండిపో! అవసరమైతే అయినవాళ్లతో ఇందాక చెప్పినట్టే కట్టు కథను బొంకు! సరేనా? " తనేదో గొప్ప సలహా ఇస్తున్నట్టుగా కళ్లింత చేసి చెప్పింది రాములమ్మ.

ఆమె చివరగా చెప్పిన మాటలు వినగానే నాకు తిక్కరేగింది. ఫలితంగా మెదడు మొద్దుబారి పిచ్చిపడుతున్నట్టుగా అంతరంగంలో కలకలం మొదలయ్యింది. నా

గోడుని ఇక ఈ సమాజం వినిపించుకోదా అనే ప్రశ్న చెలరేగుతూ నాలో విచక్షణా రాహిత్యం కూడా క్రమంగా మొదలయ్యింది. అందుకే ఇక నన్ను నేను అదుపులో పెట్టు కోలేకపోతూ ఆక్రోశంగా అన్నాను.

"ఊరుకోమ్మా... బుద్ధి లేకుండా ఏం మాట్లాడ్తున్నావు? "

"అయ్యో మాతల్లీ! నీ మేలు కోరి చెప్తుంటే నన్నే కసిరించుకుంటున్నావు? అయినా ఒకరి సుద్ది నాకెందుకులే! బుద్ధి మాటలు చెప్తే గుద్దులాటకు వస్తారు ఎవరైనా" నిష్ఠూరంగా అంటూ ఇంకొక్క నిముషం కూడా అక్కడ నిల్చోకుండా వెళ్లిపోయింది రాములమ్మ.

"ఎందుకలా కోప్పడ్డావే? ఇక నీ మీద ఆ రాములమ్మ లేనిపోని ఆవేశాన్ని పెంచుకుని నీ గురించి కనిపించిన వాళ్లకంతా పనిగట్టు కుని చెప్పడం ఖాయం" భయంగా చెప్పింది పద్మజ.

"అదేం చెప్తుంది బోడి" ఆమె మాట్లాడిన 'కట్టుకథను బొంకు' అనే మాట నా చెవుల్లో మార్మోగినట్టుగా నా హృదయాన్ని కలిచివే స్తుంటే వెళ్లిపోతున్న ఆమెనే చూస్తూ అన్నాను. అదే క్షణంలో ఆ సమీపంలో వున్న జనాలు అందరూ మావైపే చూస్తు న్నారనే సంగతి నా కళ్లల్లో పడింది.

"ఏయ్ వసూ! డోంట్ వర్రీ! నీ గురించి ఈ రాములమ్మ లాంటివాళ్లు ఏం మాట్లా డినా నేను మాత్రం నీ అపవాదును నమ్మ డంలేదు. నాలాగే ఎందరో వుండివుంటారు కూడా! కాబట్టి నీవు అనవసరంగా మనసు పాడుచేసుకుంటూ బాధపడొద్దు! అయినా నిజాయితి నీ వైపు వున్నప్పుడు నీవు భయ పడాల్సిన అవసరం లేదు, బాధ పడాల్సిన అవసరం లేదు. నిజం నిప్పులాంటిది. అది దాగదు. ఎంత సీక్రెట్‌గా వున్నా మండి తన స్వరూపాన్ని తెలియజేస్తుంది" అభయ పూర్వకంగా నా భుజం తట్టింది పద్మజ.

ఆ మాటలు నిజంగానే నాలో చైతన్యం కలిగించాయి. దాంతో ముందు ధైర్యపడి తర్వాత దిగాలుపడిపోయిన నా ఆత్మశక్తిని మళ్లీ ధైర్యపరుచుకుంటూ అప్రయత్నంగా కళ్లనీళ్లు తుడ్చుకున్నాను.

సకలాన్ని తనలో ఇముడ్చుకున్న సాంద్ర మహాసముద్రంలా నిలబడి వుంది అమ్మ.

"అమ్మా" పిలిచాను.

"ఆ" పలికింది అమ్మ. ఆ పలుకులో జీవం లేదు. అమ్మ స్థానంలో మరే కన్న తల్లి వున్నా అలాగే వుంటుందని నాకు తెలుసు. అందుకే అమ్మను బాధపెడ్తున్న విషయమై కనీసంగా ఓదార్పు మాటను గాని, ధైర్యం చెప్పినట్టుగా గాని ఏ మాటా మాట్లాడకుండా "మనం ఇక్కడే ఇట్లాగే వుండిపోతే అవతల జనాలు మళ్లీ పెరిగిపో తారు. మనం వెళ్దాం పద" చెప్తూనే అమ్మ చేయి పట్టుకుని అడుగు ముందుకు వేశాను.

★ ★ ★

"లేదమ్మా! నీ మీద ఒట్టు! నాకేం జరగ లేదు" అనుమానంతో నన్ను ప్రశ్నిస్తూ వేపుకు తింటున్న అమ్మతో వేదనగా వాదిం చడం మొదలెట్టాను.

"ఏం జరగందే అంత ధైర్యంతో వాడు ఎందుకలా మాట్లాడ్తాడు? " బీడీ వెలిగిస్తూ ప్రశ్నించాడు నాన్న. ఆ ప్రశ్న ఇప్పటికి నాన్న నుండి ఎన్నిసార్లు వెలువడిందో కూడా లెక్కలేదు.

"అదంతా వాడి రాక్షసత్వం! అందుకు వాణ్ని నేను నాశనం చేసి తీరుతాను" కోపంగా అరిచాను.

"వాణ్ని నాశనం చేయడం ఏమోగాని అన వసరపు ఆవేశాలకు పోతే నీవు నాశనం అవుతావు" హెచ్చరించాడు నాన్న.

"అయినా పర్వాలేదు" ఎటూ తోచని పరి స్థితుల మధ్య తెగించి మాట్లాడాను. ఇలా గని నిజంగా కూడా తెగిస్తానో లేదో కూడా నాకు తెలీదు.

"ఏం పర్వాలేదే? నోర్మూసుకో! చేసేది ఏందో మేం చేస్తాం" అంది అమ్మ.

"ఏం చేస్తారు? మీకు ఏం చేతనవుతుంది?" నా కుటుంబ అసహాయత నాకు తెలుసు కాబట్టే నిలదీసినట్టుగా ప్రశ్నించాను. కాగా నా సమస్యకు పరిష్కారమార్గాన్ని నేను వెదుక్కోవడంకాదు నేను ఆవేశం కొద్దీ, ఆగ్రహం కొద్దీ ఏమేం మాట్లాడ్తున్నా అంతా చేసేది అమ్మా వాళ్లేనని నేను మొదటి నుండి నమ్ముతున్నాను. అయితే వాడ్ని ఏదో చేయాలనే కసి మాత్రం నన్ను ప్రేరేపిస్తూనే వుంది. అలాగే ఆర్థిక బలహీనులం కాబట్టి, నోట్లో నాలుక లేని వాళ్లం కాబట్టి నా విలువల్ని కాపాడ్డంలో అమ్మా వాళ్లు ప్రయత్నించినా కూడా విఫలం అవుతారేమోనన్న భయం నన్ను మరోవైపు నుండి పీడిస్తోంది.

"ఈ ఆశప్ప చేతుల్లో పైసలు లేకపోవచ్చు గాని గుండెల్లో ధైర్యానికి తక్కువలేదే! రేపు ఈవాళ్టికి ఆ కోమటోడ్ని దొరబాబు ముందరకి గుంజుతాను" బీడీ నలుపుతూ పౌరుషంగా లేచి నిల్చున్నాడు నాన్న.

అంతే! సప్తసముద్రాలు ఏకమై నన్ను ముంచెత్తిన భావన ఒక్కసారిగా కలిగింది. ఏ వసంతంలోకి నేను వెళ్లాలనుకుంటున్నానో ఆ వసంతపు లోగిలిలో నన్నొక పూజకు పనికిరాని పువ్వుగా నిల్చోబెట్టాలనుకుంటున్న నాన్న ఆలోచన నాలో నిలువెత్తు అగ్నిగుండాల్ని సృష్టించింది. ఫలితంగా నేను కలవరపడిపోయానో లేక కాడుబడిపోయానో నాకే అర్థం కాలేదు కాని "నువ్వేం మాట్లాడ్తున్నావో నీకు తెలుస్తోందా? నేనేంటీ ఆ దొరబాబు ముందరకు రావడం ఏంటీ?" అంటూ ఒక పక్కగా నేలమీదే కూర్చుని వున్నదాన్నల్లా ఒక్క ఉదుటన లేచి నిల్చున్నాను.

"నువ్వేం మునసబు కూతురివా? దొరబాబు మన ఇంటిదేవుడు! ఆ బాబుగారి ముందు మన కష్టం ఎటువంటిదైనా సరే చెప్పుకోవల్సిందే" అన్నాడు నాన్న.

"నేను చదువుకున్నాను. నాకూ విలువలు వున్నాయి" తప్పించుకునే ప్రయత్నంగా చెప్పాను.

"నీవు దొరబాబు దగ్గరకే రాకపోతే ఆ విలువలు పూర్తిగా అడుగంటిపోతాయి. ఆ సంగతీ మర్చిపోవద్దు" వేలుపెట్టి చూపిస్తూ రెట్టించినట్టుగా అన్నాడు నాన్న.

"అవునే వూరందరికీ తెల్సిపోతే విలువ పోలేదు కాని దొరబాబు ఒక్కడి దగ్గరకీ వస్తే నీ విలువ పోతుందా?" ఆ వెంటనే సూటిగా ప్రశ్నించింది అమ్మ.

"నీవు ఇట్లాగే మొండిగా మాట్లాడ్తే కన్న కూతురువే అయినా నీ మీద మాక్కూడా అనుమానం వస్తుంది. ఎందుకంటే దొరబాబు చెప్పే పంచాయితీ సామాన్యమైనది కాదు. టౌన్ నుండి డాక్టరమ్మను పిలిపించి నీకు పరీక్షలు జరిపించి అబద్ధం అని తెలిస్తే ఆ శెట్టి ఎముకల్ని కట్టెపుల్లల మాదిరిగా విరగ్గొట్టిస్తాడు. నిజమని తెలిస్తే మాత్రం పోయిన శీలానికి నష్టపరిహారం ఇప్పిస్తాడు" భుజం మీది తువ్వాలును తీసి ఓ మారు బలంగా దులిపి కొట్టి కనుబొమలు ఎగరవేస్తూ నిర్లజ్జగా చెప్పుకుపోయాడు నాన్న.

నష్టపరిహారం అనే మాట నాన్నమీద నాకు ఒక్కసారిగా అసహ్యాన్ని కలిగిస్తుంటే "ఛీ" మనసులోనే అనుకుంటూ నాన్నవైపు అదే ఛీత్కారంతో చూశాను.

ఒకవేళ నాకు నిజంగా అన్యాయం జరిగి వుండివుంటే నా తండ్రి అనే ఈ మనిషి అందుకు బాధపడటం ఏమోగాని వచ్చే డబ్బు కోసం సిగ్గుమాలి ఎదురు చూసేవాడేనా? నాలో ఎగిసిన దీనమైన ప్రశ్నకు సమాధానంగా నా కళ్లలోంచి కన్నీళ్లు జలజలా రాలుతూ చెక్కిళ్లను తడిపేయసాగాయి.

"ఏందే? ఎందుకు ఏడుస్తున్నావు?" గాభరాగా నాకు దగ్గరగా వచ్చి నా గదవ పుచ్చుకుంది అమ్మ.

ఏం లేదన్నట్లుగా తలాడిస్తూ నాన్నవైపు

చూశాను. నా కన్నీళ్లు నాన్నలో ఏదో అనుమానాన్ని కలిగిస్తున్నట్లుగా నాన్న చూపుల్ని బట్టి ఆ తక్షణమే స్పష్టంగా అర్థమైంది. అయినప్పటికీ ఆ విషయమై నోరు మెదపలేదు. ముఖ్యంగా దొరబాబు దగ్గరకి వెళ్తే పంచాయితీ మాత్రమే జరిగి నా మీది అపవాదు ఎదుటివాళ్లకు ఒక ప్రశ్నగా మిగిలిపోతుందని భయపడ్డాను. కాని నాన్న చెప్పినట్టుగా ఆ డాక్టరమ్మ ఎరో వచ్చి నన్ను పరీక్షిస్తే నేను భయపడాల్సిన అవసరం ఎంత మాత్రం లేదు. నా నిజాయితి దొరబాబుకు స్పష్టంగా తెల్సిపోతుంది కాబట్టి ఆ ఇంటి కోడలిగా మారే విషయమై కూడా కించిత్ భయపడాల్సిన అవసరంలేదు.

"ఏందే మౌనంగా నిలబడిపోయావు? వస్తావా రానంటావా? " ఈ మారు గదమాయించాడు నాన్న.

"వస్తాను" ఆలోచనల్లోంచి తేరుకుని గట్టిగా చెప్పాను.

★ ★ ★

మరుసటిరోజు...

నాన్న దొరబాబు దగ్గరకు వెళ్లొచ్చాడు. తను పట్నం వెళ్తున్నాడు కాబట్టి తిరిగివచ్చిన వెంటనే పంచాయితి కార్యాలయం వద్ద కాకుండా తన ఇంట్లోనే విచారిస్తానని నాన్నకు చెప్పి పంపాడు. దొరబాబు చెప్పిన ప్రకారం నిజాన్ని నిరూపించుకునేందుకు మరో రెండ్రోజులు ఆగవల్సిందే! అయితే ఆ రెండ్రోజుల వరకు నేను స్కూల్‌కు వెళ్లకూడదనే నిర్ణయించుకున్నాను. నేను వెళ్లాలనుకున్నా అమ్మ వెళ్లనీయదు. అసలు చెప్పాలంటే మరో వారం రోజుల వరకూ కూడా తగ్గని శరీరబాధ నాది. కానీ చిత్రంగా విచిత్రంగా భయపెడితే వెక్కిళ్లు తగ్గిపోయేట్టుగా పరిస్థితుల ప్రభావంవల్ల నా బాధల గురించి నేను మర్చిపోయినట్టుగా వుంది. ఇక పుకారు విషయానికి వస్తే ఆ తాలూకు బాధమాత్రం నన్ను డేగలా వెంటాడుతోంది.

మూడవరోజు...

ఎప్పట్లా ఉదయాన్నే మెలకువ వచ్చింది. వెంటనే లేచి ఆవులిస్తూ బయటకి నడిచాను. చీకట్లు ఇంకా పూర్తిగా తొలిగిపోలేదు. మసకమసకగా వున్న వాతావరణం చల్లగా మృదుమనోహరంగా వుంది. అమ్మ ఎప్పుడు నిద్ర లేచిందోగాని కళ్లాపి చల్లడం పూర్తిచేసి నీళ్ల కుళాయివద్ద కాళ్లు కడుక్కుంటోంది. చెల్లి ముగ్గేస్తోంది.

"వసూ! ముఖం కడుక్కో! నేను ఛాయ్ పెడ్తున్నాను" ఆ వెంటనే నా వెనకనుండి చెప్తూ ఇంట్లోకి నడిచింది అమ్మ.

"సరే" అంటూ తిరిగి వెనక్కి వెళ్ళి, నీళ్ళకుళాయికి సమీపంగా కట్టివున్న కోళ్ళ గూడు మీద రేకు డబ్బాలో పోసివున్న ఉప్పు కలిపిన బొగ్గుపొడిని ఓ అరచేతిలోకి తీసుకుని, మరోచేతి చూపుడువేలుతో ఆ బొగ్గుపొడిని అద్దుకుని పళ్లు రుద్దుకుంటూ, మళ్ళీ చెల్లెలివైపుగా నడిచాను.

అప్పటికి చెల్లెలి ముగ్గు పూర్తయింది. మసకచీకట్లు తొలిగిపోయాయి కూడా!

"అక్కా! నువ్వు పళ్ళు తోముకునేలోపు నేను వెళ్ళి చేతిపంపు దగ్గర మనవంతు వచ్చిందేమో చూసివస్తాను" ముగ్గు బుట్టని అక్కడే పెట్టేసి అట్నుంచి అటే వెళ్తూ చెప్పింది చెల్లెలు.

"ఆ!" సరే అన్నట్టుగా అన్నాను నేను. అంతలో నీలంరంగు పొట్టికారు హారన్ మోగిస్తూ వేగంగా రోడ్డెంబడి దూసుకువచ్చింది. అది దొరబాబు కారు. అందుకే కారుని చూడగానే 'హమ్మయ్య! దొరబాబు వచ్చేశారు' ఆనందంగా మనసులోనే అనుకుంటూ కారువైపే చూడసాగాను. హారన్ మోగిస్తూనే కారు బంగాళావైపు దూసుకుపోయింది. హారన్ శబ్దం వినగానే బంగళాలో ఎక్కడో పనిచేసుకుంటున్న ఓ నౌకరు పరుగున వచ్చి గేటును మొత్తంగా తెరిచిపెట్టాడు. కారు లోపలికి దూసుకుపోయింది. ఆ వెంటనే నౌకరు గేటును

ఎప్పట్లా మూసేశాడు.

ఇనుపచువ్వల గేటు కాబట్టి మూసివేసినప్పటికీ లోపలి దృశ్యం అంతా స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆ నౌకర్లు, ఆ కార్లు, ఓ భగవంతుడా! ఆ అదృష్టానికి నేను ఎప్పుడు దగ్గరౌతాను?'

పళ్ళు తోమడం ఆపి దిగాలుగా కారువైపు చూస్తుంటే,

దొరబాబు రెండవ కొడుకు అంటే నడిపిబాబు రవీంద్ర, మూడోకొడుకు చినబాబు రాజా నరేంద్ర ఒకరి తర్వాత ఒకరు కారులోంచి నిద్రమత్తుతో దిగి అక్కడే నిల్చున్న తమ తల్లిని ఆనందంగా చుట్టేశారు. ఆ ఇద్దర్నీ చూడగానే అందాకటి నాలోని నిష్టూరం అకస్మాత్తుగా మాయమైపోయింది. అతీతమైన అలజడి అంతర్లీనంగా నన్ను అత్యద్భుతంగా చుట్టేసింది.

"అతడు కూడా వచ్చేవుంటాడు" మనసు అనుకోవాల్సిన మాటను పైకే గుసగుసగా అంటూ ఆత్రంగా అతడి కోసం చూశాను.

మరి కాసేపటికి దొరబాబు పెద్దకొడుకు నా రుచిరప్రబంధం పెదబాబు రాజాధీరేంద్ర నెమ్మదిగా కారు దిగాడు.

ఎత్తయిన, దృఢమైన శరీరం, చామనఛాయ రంగు, నూనూగు మీసాలు, అందుకు సరైన మిలట్రీ హెయిర్‌స్టయిల్, రాజరికాన్ని మరో కోణంలో నిర్వచించే ఆధునిక ఖరీదైన డ్రెస్సింగ్, వెరసి చక్కని ముక్కూ ముఖంతో ప్రబంధనాయకుడిలా కనిపించే నా ధీరేంద్ర... ఇప్పుడూ అలాగే అనిపిస్తున్నాడు.

అతగాడు పూర్తిగా లోపలికి వెళ్ళిపోయాక కూడా నేను నేనుగా వుండలేకపోయాను. వీడని మైమరపులో స్వప్నకాంతనై అలాగే నిలబడిపోయాను. 'సింగార తోటలో సీతాకోక చిలుకల గుంపును చెదరగొడుతూ విషకీటకాలు స్వైరవిహారం చేసినట్లుగా' వున్నట్టుండి నా స్వప్నం చెదిరింది.

కారణం ఏమిటో తెలియదుకాని అనూహ్యంగా వచ్చేసిన అతగాడి రాక నాకో తీయని బహుమానమై అలరించింది. ఇంత వరకూ బాగానే వుంది. కాని అతగాడి ఎదుటగా నా గొడవ పంచాయతీ జరగడం ఎంత చవుకబారుగా వుంటుంది? నేను దోషిని కాకపోవచ్చు. అయినప్పటికీ ఆ నింద ఎంత అవమానంగా వుంటుంది? అందుకే పంచాయతీ జరగకూడదు. దొరబాబు తన కొడుకులతో కలిసి విందుల్ని ఏర్పాటు చేసుకోవాలి. ఆ విందుల్లో ఆనందంగా పాల్గొని ఆ ముగ్గురూ వెళ్ళిపోయాకే నా సమస్యకు పరిష్కారం జరగాలి. అవును! 'ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ బెస్ట్ ఇంప్రెషన్' అనే ఆంగ్లమాట ప్రకారం... ధీరేంద్రతో నా పరిచయం ప్రత్యేకమైన పరిస్థితుల్లో జరగాలి. అంతేగాని అతడి దృష్టి నాపై ఈ స్థితిలో పడకూడదు. నేను తమ ఇంటి పనిపిల్లనే అయినప్పటికీ పార్ట్‌టైమ్ పనిమనిషిని కాబట్టి నాతో ఆ ముగ్గురు పిల్లలకు ముఖపరిచయమే తప్ప మాటల పరిచయం లేదు. మా పరిస్థితులు బాగోలేక తెలివితేటలు గల విద్యార్థిని అయినప్పటికీ పనిపిల్లగా కూడా వుండాల్సివస్తుందని, పరిచయం జరిగిన తర్వాత అతగాడికి చెప్పుకుంటే అర్థం చేసుకుంటాడు. అప్పుడు జాలి కూడా వుంటుంది. కాని నా పరిచయం జరగకమునుపే నాపై 'బ్యాడ్ ఇంప్రెషన్' అతగాడికి పొరపాటున కలిగిందంటే... ఇక ఆ ముద్రనుండి ఈ జన్మకు కాదుకదా, మరుజన్మకు కూడా తప్పించుకోలేను.

"వసూ..."

నా ఆలోచనల్ని ఒక్కసారిగా చెరిపేస్తూ అమ్మ గొంతు వెనకనుండి వినిపించింది.

"ఆ..." నేను కూడా ఒక్కసారిగా ఉలిక్కిపడుతూ తేరుకున్నాను.

"అదేంటీ? ఉలుకూ పలుకూ లేకుండా అట్లా నిలబడివున్నావు? ముఖమైనా కడుక్కున్నావా లేదా? కడుక్కుంటే వెళ్ళి చాయ్ తాగుపో" నాకు చెప్పి "అవతల నీళ్ల వంతు

వచ్చిందో లేదో చూస్తానని వెళ్లిందేగాని రాలేదు. వెళ్ళి చూసొస్తాను" పెద్ద చెల్లెల్ని ఉద్దేశిస్తూ అని వాకిలిదాటి చేతిపంపు దిశగా వెళ్ళింది అమ్మ.

నేను నీళ్ళకళాయి దగ్గరికి వెళ్ళి ముఖం కడుక్కుని, ఇంట్లోకి నడిచాను. అప్పటికి నాన్న లేచి కూర్చుని టీకి బదులుగా సారా తాగుతున్నాడు... మిగతా ఇద్దరు చెల్లెళ్లు అప్పుడే నిద్ర లేచినట్లున్నారు. ఇంకా పరుపు ల్లోంచి లేవకుండా అటూ ఇటూ కదులుతూ వున్నారు. తమ్ముడు మాత్రం ఏ వేకువజా మున నిద్రలేచాడో ఏమోగాని, ఇంట్లో ఒక మూలగా కూర్చుని నాన్న తాగిపడేసిన కరుకు బీడిలతో ఆడుకుంటున్నాడు. అవే వాడికి ఆటవస్తువులు!

నేను వంటింట్లోకి నడిచాను. సారాకంపు ఇల్లంతా చుట్టుకుపోయి వుంది. కొత్తవాళ్ళ యితే ఆ వాసనకు వాంతులు చేసుకుని చస్తారు. కాని మాకు ఆ వాసనను భరిం చడం అనేది దినచర్యలో భాగమయింది. ఇలాగని నేను ఊరుకోలేదు.

"బయట ఎక్కడో కూర్చుని ఆ తాగేదేదో తాగొచ్చుకదా! ఇంట్లో కూర్చుని ఇల్లంతా కంపులేపుతూ... ఛ!" కసిగా గుణిగాను.

"ఏమే? గుణుగుతున్నట్టున్నావు? " నా గుణుగుడ్ని తన పాము చెవుల్తో వినేసి నిల దీసినట్టుగా అడిగాడు నాన్న.

"ఆ... మరేం లేదు! ఇంకో సీసా ఎక్కువ తాగు నాన్నా అని చెప్తున్నాను" ఆవేశంకొద్దీ చెప్తూ టీ గ్లాసుతో బయటకు వచ్చాను.

"అంటే? " కొట్టబోయేవాడిలా లేచి నిల్చు న్నాడు.

"నాన్న ఎప్పుడూ ఇంతే! తాగితే తనను తాను అదుపులో పెట్టుకోలేడు. ప్రతిచిన్న విషయాన్ని తప్పు పడ్తాడు. అందుకే సంయమనం పాటిస్తూ "ఏంలేదు నాన్నా" అంటూ వెలుపలికి నడిచాను.

నేను బయటికి వెళ్తే అందరి కళ్లు నన్ను డేగల్లా వెంటాడుతాయి. అయినప్పటికీ నాన్నను భరించలేక వెళ్ళి పూలమొక్కల మధ్య కూర్చున్నాను. ఇప్పుడు పూలమొ క్కలు నాకు పహరాగా ఉన్నాయి. కాబట్టి నన్ను ఎవ్వరూ ఇక గమనించరు అనుకో వడం పొరపాటు. ఎందుకంటే... మా గురి విందకొమ్మల ప్రహారిగోడ పక్కనే రోడ్డు వుంది కాబట్టి, ఆ రోడ్డు వెంబడే వెళ్ళే పోకిరి కుర్రాళ్ళ దృష్టి ఈమధ్యకాలంలో నా దురదృ ష్టంకొద్దీ నా ఇంటివైపే వుంటుంది. ఇదంతా పూర్వజన్మ సుకృతం. అందుకే ఇక చేసేది లేక టీ తాగుతూనే "ప్చ్" అని నిట్టూరుస్తూ దొరబాబు బంగళావైపు చూశాను.

బంగళామీద నిల్చుని వ్యాయామం చేస్తూ కనిపించాడు ధీరేంద్ర! అంతే! టీ గ్లాసును నాకు తెలీకుండానే నేను పక్కకు పెట్టేసి అతగాడివైపే ఆదమరిచి చూడసాగాను.

అంతలో అమ్మ, పెద్ద చెల్లెలు నీళ్లబిందె లతో వచ్చారు. అమ్మ నీళ్ళబిందె మోయడం నా గుండెను చివుక్కుమనిపించింది. అందుకే ఆలోచనల్ని పక్కకు పెడుతూ అమ్మకు ఎదురువెళ్ళాను.

"వద్దే! ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నావు. బరువు మోయడంవల్ల నొప్పులు మళ్ళీ తిర గబెడితే కష్టం" నన్ను వారిస్తూ ఇంట్లోకి నడిచింది అమ్మ.

"అయ్యో అమ్మా" పైకే నొచ్చుకుని "ఏయ్ పిల్లలూ! ఇంకా లేచారా లేదా? అమ్మ నీళ్ల బిందె మోస్తోంది. మీరు లేచి నీళ్లు తీసుకు రండి" బయటనుండే గట్టిగా చెప్తూ ఇంట్లోకి నడిచాను.

"అయ్యో... అమ్మ నీళ్లు తెస్తోందే"

"వద్దమ్మా... మేం వున్నాంకదా"

"అమ్మా... గుండెల్లో బాధవుతోందా? " గమనించిన వెంటనే కంగారుపడ్డాను.

"మూ..." అవును అన్నట్టుగా అంది అమ్మ.

"అందుకే బరువు పనులు చేయొద్దూ అంటాను. చూసివస్తానూ అని చెప్పి నరి కేసి వచ్చినట్టు వంతు చూసి వస్తానని చెప్పి

బిందెను మోసుకుని వచ్చావు. వద్దన్న
పనులు చేయడం ఎందుకు? ఇలా బాధ
పడ్డం ఎందుకు? " అమ్మ గుండెలపై చేత్తో
సున్నితంగా రాస్తూ మృదువుగా కోప్పడ్డాను.

"హా..." ఆయాసపడుతున్న అమ్మ వున్న
ట్టుండి గట్టిగా వూపిరి పీల్చి వదిలింది.
అమ్మకు వున్న రోగం అలాంటిది. అమాయ
కురాలైన అమ్మను పట్టిపీడిస్తూ ఒకటే కష్ట
పెడుతుంటుంది. మమ్మల్నేమో బాధపెడు
తుంటుంది.

"ఏందీ... దానికి మళ్ళీ మాయరోగం
వొచ్చిందా? " తాగిన మైకంలో తనేం
మాట్లాడ్తున్నాడో తెలియని నాన్న వంకర
టింకరగా నడుస్తూ వంటింట్లోకి వచ్చాడు.

అమ్మగాని, నేను గాని, నాన్న మాటకు
సమాధానంగా కనీసంగా తిరిగి కూడా
చూళ్ళేదు. పట్టించుకోనట్లుగానే వుండి
పోయాం. నాన్న మాత్రం జాలాడి దగ్గర
ఇనుపబకెట్టులో తడిపివుంచిన తునికి ఆకు
కట్టల్ని అక్కడే వున్న వెడల్పాటి గంపలోకి
నీళ్ళు వంపి వేసుకుని, కత్తిరించి పెట్టడానికై
బయటికి తీసుకువెళ్తూ "దీనికి రోగం లేదూ
రొష్టూ లేదూ అంతా నటన..." మాన
వత్వం లేకుండా అన్నాడు.

అప్పుడు కూడా అమ్మ ఏం మాట్లాడ
లేదు. నేను మాత్రం ఇక తమాయించుకోలే
కపోతూ "నీలాంటి తండ్రి ఇంటికి ఒకరు
వుంటే ఆ కుటుంబాలు నందనవనాలు
కాదు, వల్లకాడులైపోతాయి" పళ్ళ బిగువున
అరిచాను.

"ఏం మాట్లాడ్తున్నావే నీయాలీ... నాకే
ఎదురు చెప్పేంత మొనగత్తెవి అయిపో
యావా? నీ రంకు తెల్సినరోజే నీ సిగతరిగి
వుణ్ణింటే ఈ కొమ్ములొచ్చిన మాటలు
మాట్లాడవు నీవు..." ఒక తండ్రిలా
కాకుండా ఒక మగాడిలా మాట్లాడుతూ
చేతుల్లో వున్న ఆకుగంపను నా మీదకు
బలంగా విసిరేశాడు నాన్న.

గంప బలంగా వచ్చి నన్ను తగలడంతో
గంప తాలూకు పుల్లలు నా ముఖంమీద
గట్టిగా గీసుకుపోయాయి. ఈ గీసుకుపో
వడం మాట ఏంటోగాని గంపను తప్పించు
కునే ప్రయత్నంగా అమ్మను అలాగే పట్టు
కుని పక్కకు జరగబోయిన నేను గంప
వచ్చి నన్ను తగిలీ తగలడంతోనే అమ్మమీద
ఆసాంతం పడిపోయాను. దీంతో అమ్మలో
ఆయాసం మరీ పెరిగిపోయింది. తోడుగా
దగ్గు మొదలయ్యింది.

"అమ్మా... అమ్మా..." అమ్మను లేవనెత్తి
కూర్చోబెట్టి నా గాయాల్ని లక్ష్యపెట్టక వణికి
పోసాగాను.

ఇక నాన్న మాత్రం చలించనివాడై
నామీద అమ్మ మీద, బూతు మాటల్ని వ
దులుతూ బయటకి వెళ్లిపోయాడు. ఇంట్లో
ఏం జరుగుతోందో అర్థంకాని తమ్ముడు పరి
స్థితుల మధ్య ప్రశ్నగా మారుతూ గుక్కపట్టి
ఏడ్వడం మొదలెట్టాడు. తమ్ముడి ఏడుపుని
పట్టించుకోకుండా అమ్మకోసం గాభరాపడు
తున్నాను నేను.

"వాడు తాగితే మనిషి కాదని తెల్సి
కూడా ఎందుకే కల్పించుకుంటావు? " కాసే
పటి తర్వాత రొప్పుతూనే నెమ్మదిగా ఆగి
ఆగి చెప్తూ కళ్లనీళ్లు పెట్టుకుంది అమ్మ.

"ఈ మనిషిని మొగుడిగా నీవు గనుక
భరిస్తున్నావు. కాని తండ్రిగా నేను ఇక
భరించలేను" సహనం కోల్పోయిన దానిలా
అరిచాను.

"ఏం చేస్తావ్ పిచ్చిదానా? " నేను ఏమీ
చేయలేననే భావన అమ్మ ప్రశ్నించే తీరులో
స్పష్టంగా ఎగిసిపడింది.

"పద్ధతి మార్చుకోకపోతే దొరబాబుకు
ఫిర్యాదు చేస్తాను" కళ్లు పెద్దవి చేసి హెచ్చ
రికగా చెప్పాను.

"ఏంటక్కా ఏం జరిగింది? "

"అవతల నాన్న అసహ్యంగా అరుస్తు
న్నాడు. ఇంట్లో మీరేమో ఇలా వున్నారు?
ఏం జరిగింది అసలు? "

"అమ్మకు ఏం జరిగింది? అమ్మను నాన్న

కొట్టాడా? తమ్ముడు ఏడుస్తున్నాడు, నువ్వేమో కోప్పడ్తున్నావు. ఏంటక్కా ఇదంతా? "

నేను హెచ్చరిక చేస్తున్న సమయంలోనే వచ్చేసిన చెల్లెళ్లు ముగ్గురికి పరిస్థితి ఏమీ బోధపడలేదు. అందుకే ఏడుపు ముఖాలు వేసుకుని సమాధానం కోసం నన్నే చూస్తూ అమ్మ చుట్టూ మూగారు.

నేను చెల్లెళ్లతో ఏం చెప్పలేదు. అక్కడ్నుంచి లేచి బయట గదిలోకి వెళ్లి ఒంటరిగా, జాలిగా ఏడుస్తూ కూర్చున్న తమ్ముడ్ని ప్రేమగా ఎత్తుకుని బుజ్జగిస్తూ తిరిగి వంటింట్లోకి వచ్చాను.

అప్పటికి అమ్మ కొంచెం కుదుటపడ్డట్టుగా కనిపించింది. అది చూసి హాయిగా ఊపిరి పీల్చుకుంటూ "ఏయ్ మీరు ఇలా వచ్చి కూర్చుంటే ఎలా? తెచ్చి దించిన ఆ బిందెల్లోని నీళ్లను నీళ్ల తొట్టిలో పోసి మళ్లీ వెళ్లండి. లేదంటే మనకే నీళ్లు కష్టమౌతాయి" చెల్లెళ్లు ముగ్గుర్నీ ఉద్దేశించాను.

అంతలో "ఆశప్పా" అని పిలుస్తూ ఎవరో ఇంటికి వస్తున్నారని తెలిసింది.

"ఎవరూ? " అడుగుతూ వెంటనే వెలుపలికి వెళ్లాను.

"నాయన లేడా అమ్మా? " నేను వెళ్లగానే వాకిట్లోనే నిలబడిపోతూ అడిగాడు దొరబాబు నౌకరు.

"నాన్న ఇప్పుడే బయటికి వెళ్లాడు. ఏంటి విషయం? " వెంటనే అడిగాను.

"మరేం లేదమ్మా! దొరబాబు నాయనను రమ్మంటున్నారు" చెప్పాడు అతడు.

"ఎందుకు? " పంచాయతి విషయం కావొచ్చని నా గుండె ఝల్లుమంటుంటే మెల్లగా అడిగాను.

"నాయనను వచ్చి మాట్లాడమను" చెప్పి ఆ తక్షణమే వెనుతిరిగి వెళ్లిపోయాడు అతడు.

'ఎందుకై వుంటుందబ్బా? ఎందుకైనా సరే గాని నా గొడవ విషయమై మాత్రం వుండకూడదు భగవంతుడా' వెళ్తున్న నౌకరు వైపే భయంగా చూస్తూ మనసులోనే అనుకున్నాను.

"మనిషి ఒకటి తలిస్తే దేవుడు ఒకటి తలుస్తాడు" అన్న సూక్తిని నా విషయంలో ప్రత్యక్షంగా ఋజువు చేస్తూ ఇక ఆ మరుసటిరోజు ఉదయాన్నే దొరబాబు ఇంటికి వెళ్లాల్సి వచ్చింది. దాంతో నా అభిప్రాయం మారిపోయింది. దేవుడు చేసేది అంతా మన మంచికే అనే సర్దుబాటుకు వచ్చేశాను. ఈ సర్దుబాటు నా తృప్తికోసం నా మనసును చంపుకుంటూ చేసుకున్నది కాదు. నిజంగానే నేను మారిపోయాను. అవును! దేవుడు పరిస్థితుల్ని చాలాసార్లు మనకు అనుకూలంగా మలుస్తుంటాడు అన్పిస్తుంది. ఆ తర్వాత దొరబాబు ఇంటికి వెళ్లేందుకు మానసికంగా సిద్ధపరుచుకున్నాను.



ఉదయం తొమ్మిది గంటలు కావొస్తోంది.

అమ్మానాన్నలతో కలిసి దొరబాబు బంగళాకు వెళ్లాను. మాతో పాటుగా రామేశ్వరంగాడు తమ వాళ్లతో కలిసి వచ్చివుంటాడు లేదా వస్తాడు అనుకున్నాను. కాని మేము

వెళ్లి కూర్చున్న పది పదిహేను నిముషాల వరకు కూడా వాడుగాని వాడి తరఫున మరెవ్వరూ గాని రాలేదు. అసలు వాడొచ్చినా రాకపోయినా నాకు జరిగే న్యాయమేదో నాకు తప్పకుండా జరుగుతుంది. కాబట్టే మనసులో ఎలాంటి భయాందోళనలకు తావు ఇవ్వకుండా అమ్మానాన్నలకు మధ్యగా కూర్చునివున్నాను. మేము కూర్చున్న వసారాలో కుర్చీలు, బెంచీలు పద్ధతి ప్రకారంగా వేయబడివున్నాయి. కాని మాలాంటి వాళ్లకు వాటిపై స్థానం వుండదు. నేను చదువుకుంటున్నా మా కుటుంబ స్థాయిరీత్యా అది లెక్కలోకి రాదు. ఇలాగని నేను కించిత్ కూడా బాధపడటం లేదు. ఎందుకంటే ఇదంతా తాత్కాలికం. రేపటి జీవితంలో నా అదృష్టానికి ఇవన్నీ దాసోహం కావాల్సిందేకదా! అందుకే నాకు తెలియని కొత్త ధైర్యం నన్ను నింపాదిగా ఉంచగలిగింది.

"నా ధీరేంద్ర ఏడీ? మేము వచ్చి ఇంతసేపు అవుతున్నా కనీసంగా ఆచూకీ కూడా చెప్పడేంటీ? " మనసులో స్థిరత్వం వున్నప్పటికీ చూపుల్ని అదుపులో పెట్టుకోలేక మాటిమాటికి లోపలికి గుచ్చుతూ చూస్తూ మనసులోనే అనుకుంటున్నాను. ముఖ్యంగా నేను ఇప్పుడు కథానాయికని. కలతల్ని, కన్నీళ్లని కొంతకాలం భరించే ప్రియ బాంధవిని. కాబట్టే నా వరమాల ధీరేంద్రను చూడటం కోసం నేను అదే పనిగా ఆతృత పడుతున్నాను.

ఇంతలో కార్డ్‌లెస్ ఫోన్‌లో మాట్లాడుతూ వసారాలోకి వచ్చింది అమ్మగారు. గ్రామ బాగోగుల్ని అన్ని విధాలా చూసుకునేది దొరబాబే అయినప్పటికీ దొరబాబు భార్యగా అమ్మగారికి ప్రజల హృదయాల్లో పదిలమైన స్థానం ఉంది. అందుకే అమ్మగారు రాగానే అసంకల్పిత ప్రతీకార చర్యగా అమ్మా, నాన్న, నేనూ ముగ్గురం ఒకేసారి చప్పున లేచి నిల్చుని "దండాలు అమ్మగారూ" అంటూ ఎవరికి వాళ్లమే చేతులు జోడించాం.

అందుకు అమ్మగారు మా వైపు కనీసంగానైనా చూడకుండా ఎప్పట్లా ఫోన్‌లో మాట్లాడుతూనే నెమ్మదిగా ముందుకు నడుస్తూ ఒక చేత్తో మమ్మల్ని కూర్చోండి అన్నట్లుగా మాత్రం సైగ చేసింది.

అదే సమయంలో లోపల్నుండి దర్జాగా వెలుపలికి వచ్చాడు దొరబాబు. ఆ వెంటనే అమ్మానాన్నలు అప్రమత్తమౌతున్నట్టుగా చిన్నగా కదిలి "దండాలు బాబుగారూ" అంటూ కాసింత వంగి చేతులు జోడించారు. నేను వంగలేదు కాని గౌరవంగా చేతులు మాత్రం జోడించాను.

ప్రతిగా దొరబాబు గంభీరంగా తలను పంకిస్తూ అక్కడే వేసివున్న ఆధునిక వెదురుకుర్చీలో ఠీవిగా కూర్చుని "కూర్చోండి" మమ్మల్ని ఉద్దేశించి అన్నాడు.

కూర్చోడానికి అమ్మానాన్నలతో పాటుగా నేనూ తడబడ్డాను. మమ్మల్ని గమనించిన దొరబాబు "ఎంతసేపని నిల్చుంటారు? ఫరవాలేదు కూర్చోండి" మృదువుగా చెప్పాడు.

అయినప్పటికీ అమ్మానాన్నలు తడబడుతూనే కూర్చున్నారు. ఇక నేను మాత్రం వినయంగా కూర్చున్నాను.

దొరబాబు ఇంకేమాత్రం ఆలస్యం చేయలేదు. అమ్మానాన్నల్ని సూటిగా చూస్తూ "ఆడపిల్ల సమస్య! అందుకే మీ ఎదుటవాళ్లను రప్పించలేదు. ఇలాగని మీ ఒక్కరితో మాట్లాడి ఏదో ఒకటి సెటిల్ చేసేస్తానని అనుకోవద్దు" హుందాగా చెప్పాడు.

"దొరా" అట్లాగే అన్నట్లుగా తలాడిస్తూ అన్నాడు నాన్న.

అనుకోకుండా అదే క్షణం నాలో నాకే తెలియని భయమేదో మెల్లగా మొదలయ్యింది. అందుకే చేతులు నలుపుకుంటూ అమ్మ చాటుగా నెమ్మదిగా జరిగి కూర్చున్నాను. నాలో మొదలైన భయం ఇందాకటి పెదబాబు పెళ్లి విషయానికి సంబంధించినది. కాదు. అదేదో నా ప్రస్తుత గొడవకు

సంబంధించిన అర్థంకాని భయం.

'వసుంధరా! భయపడొద్దు! నిన్ను నీవు అన్నివిధాలా ధైర్యపరుచుకున్నాక సైతం పిచ్చిదానిలా ఏంటా భయం? ' నాలో నేనే నా అంతరాత్మను ఉద్దేశించుకున్నాను.

"వారం రోజుల వరకు ఎలాంటి పంచాయతీలు నిర్వహించకూడదు అనుకుంటూనే మిమ్మల్ని ఇక్కడికి పిలిపించాను. మీరు ఇక్కడికి వచ్చింది నిజాన్ని దాచిపెట్టుకుని మాట్లాడ్డానికి కాదు. కాబట్టి నా సహనాన్ని పరీక్షించకుండా వున్నది వున్నట్లుగా నిజాయితిగా చెప్పండి. ముఖ్యంగా కన్నతల్లితో గాని, డాక్టర్‌తోగాని, ఇలాంటి సమయాల్లో గ్రామపెద్దతో గాని నిజాల్ని దాచిపెట్టుకోకూడదు అర్థమైందా? " అని కాసేపు ఆగి "నన్ను మభ్యపెట్టడానికి ప్రయత్నించినా ఉన్నదానికంటే ఎక్కువ చేసి చెప్పుకున్నా నా సంగతి మీకు తెల్సు! అందుకే జరిగిన దాంట్లో ఎక్కువ తక్కువలు లేకుండా నిర్భయంగా అంతా చెప్పుకుంటే నిజంగా మీకు అన్యాయం జరిగినా మీరు నష్టపోకుండా చూస్తాను. ఒకవేళ ఇది అభాండమే అనుకుంటే మీ ఎదుటివాళ్లకు తగిన శిక్ష విధిస్తాను. ఆ తరువాత మీ అమ్మాయి జీవితంపై పడిన ముద్రను సమూలంగా సకాలంలో తొలగించే ప్రయత్నం చేస్తాను" నిండుగా చెప్పుకుపోయాడు దొరబాబు.

"దొరా! తమరి బాంచలం! తమరు ఇంత ధైర్యం చెప్పిన తర్వాత కూడా ఆడపిల్ల విషయం కాబట్టి అబద్ధం చెప్తామేమో అనుకొనవద్దు. కాల్మొక్కి చెప్తున్నా... మా మాట తమరి మీద ఒట్టేసి చెప్పినట్టుగా వుంటుంది. తమరి కళ్లుగప్పే ప్రయత్నం చేయడమంటే ఆ దేవుణ్ణి మోసం చేయడమే దొరా. మేము చెప్పే మాటల్ని, మమ్మల్ని గుండెల నిండుగా నమ్మి నా బిడ్డ బతుకుని అన్యాయం చేయకుండా కాపాడు దొరా" దొర మాటలకు సమాధానంగా వెంటనే లేచి నిల్చుని సగౌరవంగా నడుంవంచి చేతులు జోడించి దీనవదనంతో చెప్పుకున్నాడు నాన్న.

తాగిన మైకంలో విచక్షణ కోల్పోయి తనేం మాట్లాడుతున్నాడో తనకే తెలియని స్థితికి దిగజారే నాన్నలో ఇప్పుడు కూతురి జీవితంపట్ల అపారమైన అభిమానం తాలూకు ఆందోళన! నాన్న ప్రవర్తనలో ఇది కొత్తేమీ కాదు. అందుకే నాలో ఎలాంటి ఆశ్చర్యం కలగలేదు.

"నీ కూతురి జీవితానికి ఎలాంటి మచ్చ రాకుండా అంతా నేను చూసుకుంటాను అని మరోసారి భరోసా ఇస్తున్నాను. కాబట్టి ఇంకేమాత్రం తాత్సారం చేయకుండా నాతో అంతా చెప్పుకు పొండి! ముఖ్యంగా ఏ ఆడపిల్లా తనకు అన్యాయం జరిగిందని ధైర్యంగా బయటకు చెప్పుకోలేని మాట వాస్తవం. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకునే నిజాన్ని తెల్సుకోవడం కోసం ప్రత్యేకించి మిమ్మల్ని ఇక్కడికి పిలిపించి లోపలి ఇంట్లో గౌరవంగా ప్రశ్నిస్తున్నాను. మరి నా ప్రయత్నాన్ని మీరు ఎంతమాత్రం అగౌరపరచకూడదని మళ్లీమళ్లీ చెప్తున్నాను" నాన్న నిజాన్నే చెప్తాం అన్న తర్వాత కూడా దొరబాబు మరోసారి మమ్మల్ని సూటిగా చూస్తూ అన్నాడు. కాగా ఈ మారు దొరబాబు గొంతులో నిండుతనానికి తోడుగా ఒక విధమైన హెచ్చరిక కూడా వుంది.

అదృష్టం వెంబడిస్తున్నప్పుడు కొన్నిసార్లు దోషి నిర్దోషిగా మిగిలిపోవచ్చు. దురదృష్టం వెంటాడుతున్నప్పుడు మరి కొన్నిసార్లు నిర్దోషి దోషిగా ముద్రపడిపోవచ్చు. ఇప్పుడు నా జీవితం విషయంలో ఇలాంటిదేదో జరగదనే నమ్మకం స్వచ్ఛంగా నాలో వున్నప్పటికీ అంతఃక్రితం మొదలైన నాలోని అర్థంకాని భయం, ఇప్పుడు నేను పెదవి విప్పే సమయానికి వచ్చేసరికి అనూహ్యంగా రెట్టింపయ్యింది.

ఛ! నేనెందుకు భయపడాలి? అర్థంపర్థం లేకుండా! నాలో నేనే మనసులో అను

# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత (త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ *ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.*

ఎడిటర్:
చతుర
'ఈనాడు' కాంపౌండ్,
హైదరాబాద్ 500 482.



# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, చతుర, ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారం లోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జూన్ చతుర నవల స్వప్నసౌధం**

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

కుంటూ దొరబాబునే గుచ్చిచూడసాగాను.

"ఏమ్మా? " ఇక చెప్పమన్నట్టుగా నా వైపు చూశాడు దొరబాబు.

నేను భయపడుతూ నెమ్మదిగా లేచి నిల్చుని చేతులు కట్టుకున్నాను. నాతోపాటుగా అమ్మ కూడా లేచి నిల్చుంది. జరిగినదంతా చెప్పడానికి నన్ను నేను సిద్ధపరుచుకుంటుంటే నాకు రెండువైపులా నిల్చున్న అమ్మానాన్నలు నావైపు బెదురు, కంగారు రెండూ కలిసిన ఒకవిధమైన ఆందోళనతో చూడసాగారు.

అదే సమయంలో బయటనుండి వచ్చిన దొరబాబు పక్కనే వున్న మరో కుర్చీలో ఆసీనురాలయ్యింది అమ్మగారు.

"ఆ ఇద్దరు వ్యక్తుల్ని ఎక్కడో చూసినట్లుగా వుంది అంటున్నావు. మరి ఆ వ్యక్తులు ఎవ్వరనేది బాగా ఆలోచించి గుర్తుకు తెచ్చుకోగలవా? " కాసేపు ఆలోచించాక ప్రశ్నించాడు దొరబాబు.

'తెచ్చుకోగలనో లేదో? కాని వాళ్లు కూడా నాకు ఏదో జరిగిందనే అనుకుంటున్నారు కదా బాబుగారూ!' అనాలనుకున్నాను కాని ధైర్యం చాలలేదు. అందుకే "ఆ రోజు నుండి ఎంత ఆలోచించినా వాళ్లు ఎవ్వరో నాకు గుర్తుకు రావడంలేదు బాబుగారూ!" చేతుల్ని మరింత దగ్గరగా కట్టుకుంటూ బెదురుగా చెప్పాను.

"ఓకే! కాకపోతే వాళ్లు ఎవ్వరనేది ఆ శెట్టికొడుక్కి తెల్సినట్టే అన్పిస్తోంది కదూ? " అని కాసేపు ఆగి "వాళ్ల గురించి ఇక నువ్వేం ఆలోచించొద్దు పాపా! అదంతా నేను చూసుకుంటాను. పోతే నీవు చెప్పిన దాంట్లో అబద్ధం అంటూ ఏదీ లేదు కదూ? ఒకవేళ వుందీ అనుకుంటే మరో అవకాశం ఇస్తున్నాను నిజం చెప్పుకో" అన్నాడు దొరబాబు.

"నేను చెప్పినదాంట్లో అబద్ధం అంటూ ఏదీ లేదు బాబుగారూ!" అప్రయత్నంగా చేతులు జోడించాను.

"నిజంగా ఏమీ లేదా? " నేరాన్ని ఒప్పించేందుకుగాను ఓ పోలీస్ అధికారి అమాయక నిర్దోషిని సైతం పొరపాటున బలవంతపెట్టే చందాన నా ముఖంలోకి మరీ గుచ్చి చూస్తూ ప్రశ్నించాడు దొరబాబు.

"లేదు బాబుగారూ" దొరబాబు తీరు నాలో వణుకును తెప్పించింది.

"ఇట్సాల్ రైట్" తనంతట తనే అనుకుని

"ప్రస్తుతానికి అయితే ఈ అమ్మాయి ఒక్కతే పెళ్లికి సిద్ధంగా వుంది కదా!" అమ్మగారితో అని "ఏమ్మా! నీ కూతుర్ల వివాహాల్ని ఏటా మేము జరిపించే సామూహిక వివాహ సంప్రదాయంలో జరిపించాలనుకుంటున్నారా? అదేం కుదరదు. ముందు నీ మొగుడ్ని సరైన మార్గంలో పెట్టుకో" ఉద్దేశించింది అమ్మనే అయినప్పటికీ చెప్పడం మాత్రం అమ్మానాన్నా ఇరువుర్నీ చూస్తూ చెప్పాడు దొరబాబు.

ఆ చెప్పడంలో సున్నితత్వమే తప్ప కరినత్వం ఎంతమాత్రం లేదు.

"ఆ ఇంకో విషయం! మీ అమ్మాయి చెప్పిన విషయంలో ఎలాంటి అబద్ధం లేదని తల్లిదండ్రులుగా మీరు నమ్ముతున్నారుకదూ? " అమ్మానాన్నల్ని చూస్తూ ఆ వెంటనే అడిగాడు దొరబాబు.

అందుకు అమ్మానాన్న ఇద్దరూ నావైపు చప్పున చూశారు. ఆ చూపుల్లో అబద్ధం అయితే ఒప్పేసుకోవే! అనే భావం స్పష్టంగా కనిపిస్తుంటే అర్థం చేసుకున్న నేను "అబద్ధమంటూ ఏమీ లేదు" అమ్మానాన్నలకు మాత్రమే వినబడేలా నేలను చూస్తూ బాధగా అన్నాను. కన్నవాళ్లకే ప్రశ్నగా మిగిలిపోయిన నాలో బాధ మాత్రమే కాదు. దుఃఖం కూడా గూడుకట్టుకుని వుంది. కాని ఆ దుఃఖం రేపటి విజయం కోసం ఎదురు చూస్తూ నన్నే ధైర్యపరుస్తూ గొంతుదాటి రాకుండా గుండె లోపలికి ఎప్పటికప్పుడు ఇంకిపోతూ వుంది.

"దొరా! అబద్ధం ఇంకేమీ లేదు" చెప్పాడు నాన్న.

"అవును దొరా! నా బిడ్డకు ఏం జరగలేదనే నేను నమ్ముతున్నాను" అమ్మ కూడా చెప్పుకుంది.

"సరే! మరి నిర్ధారణ కావాలికదా! నిర్ధారణ లేకుండా ఎదుటి వాళ్లను తప్పుపట్టలేము. కాబట్టి ఈ సాయంకాలమే నీ కూతురికి డాక్టరు పరీక్షలు జరిపిస్తాను" చెప్పాడు దొరబాబు.

ఆ పరీక్షలతో నా నిజాయితీ బయటపడుతుంది కాబట్టి నాలో ఆనందం కలిగింది. అందుకే నా ప్రమేయం లేకుండా ఆ మాటకు నా కళ్లు మెరిశాయి.

"జరిపించండి దొరా" అమ్మానాన్న ఇద్దరూ ఒకేసారి అన్నారు. దొరబాబు ఇక మాతో ఏం మాట్లాడలేదు. వెంటనే తన జుబ్బా జేబులోంచి సెల్ ఫోన్ వెలుపలికి తీసి నంబరు కలపసాగాడు.

"ఏమే? అంతా నిజమే కదా? " నన్ను మెల్లగా గిల్లుతూ గుసగుసగా అడిగింది అమ్మ.

"ఎన్నిమార్లు చెప్పాలి? ఒక్కసారి చెప్తే అర్థం కాదా? అయినా... నాన్నను పక్కకి పెడితే నువ్వేంటి చిత్రంగా? ఒకసారి పూర్తిగా నన్ను నమ్మినట్టుగా కనిపిస్తావు, ఘరోసారి అపనమ్మకంతో అల్లాడిపోతావు. ఇంకోసారి ఎటూ తేల్చుకోలేక నమ్మకానికి అపనమ్మకానికి మధ్య నువ్వే ఒక ప్రశ్నగా మిగిలిపోతావు!" పెదవులచాటునుండే అమ్మ మీద కోప్పడ్డాను.

"అది కాదే"

"ఇంకేంటి? "

"కన్న కూతురు తప్పు చేయకపోయినా, దాని శీలానికి పరీక్షకాలం వచ్చిందంటే అది ఏ కన్నతల్లీ భరించరాని విషయం. ఇక తప్పు చేస్తే చావడం మేలు" కళ్ళనీళ్ళతో అంది అమ్మ.

"ఒకవేళ నాకు అన్యాయం జరిగి వున్నా అది నేను తప్పుచేయడం కాదు" అమ్మవైపు గుర్రుగా చూశాను.

"తెలుసు బిడ్డా! అన్యాయం జరిగితే చెప్పు. దొరబాబు దేవుడిలాంటి మనిషి. ఇప్పుడు నిజం చెప్పినా నిన్ను కోప్పడడు" పరిస్థితి ముంచుకొచ్చేకొద్దీ పట్టుబడబోతున్న దొంగలా తయారవ్వసాగింది అమ్మ.

అమ్మ మాటలకు సమాధానంగా అమ్మను ఒకమారు ఆపాదమస్తకం కోపంగా చూసి, ఆ తర్వాత అమ్మకు దూరంగా జరిగి నిలబడిపోయాను.

"ఏమ్మా? ఏం మాట్లాడుతున్నారు? " అంతలో అమ్మగారి గొంతు ఖంగుమని వినిపించింది.

"ఆ..." తడబాటుగా అమ్మగారివైపు చూశాను.

"ఏమైనా మాట్లాడాలనుకుంటే పక్కకు వెళ్ళి మాట్లాడండి" చెప్పింది అమ్మగారు.

నేను సరే అన్నట్టుగా తలాడిస్తూ అమ్మకు పూర్తిగా దూరంగా జరిగి, దొరబాబువైపు చూశాను. ఇందాకట్నుంచీ ప్రయత్నం చేయగా దొరబాబుకి లైను ఇప్పుడు దొరికినట్టుంది. అవతల్నుండి లైన్లోకి వచ్చిన వెంటనే "హలో!" అని పలకరించడానికి సిద్ధంగా సెల్ ఫోన్ని చెవులదగ్గర పెట్టుకుని వున్నాడు.

నాకు అమ్మమీద కోపంగా వుంది. ఇందాక "తప్పు చేయడం" గురించి మాట్లాడిన అమ్మ మాటల్లో నిజంగా అమాయకత్వం వుంది. తప్పుచేయడం వేరు, దగాపడడం వేరు. కాకపోతే అమ్మకు మాట్లాడడం తెలియక 'దగా' అనడానికి బదులుగా తప్పుని చేర్చి మాట్లాడింది. ఇలాగని నేను నిజంగా దగాపడి వున్నా అమ్మ చెప్పినట్లుగా నేను చావడాన్ని అమ్మ తట్టుకోలేదు. నన్ను గుండెల్లో దాచుకుని ఓదారుస్తుందని నాకు తెలుసు. పోతే... ఆవేదనకొద్దీ అమ్మ అలా మాట్లాడింది. అయినాసరే ఇంటికి వెళ్ళాక ఆ విషయం గురించి రాద్ధాంతం చేయాలని అనుకుంటూ దొరబాబువైపు అలాగే చూస్తున్నాను.

"హలో మేడమ్ హౌ ఆర్ యూ? ఐ

యామ్ రాజా రఘుమోహన్! కాలింగ్ ఫ్రం వీరరాఘవపురం..." అవతలివాళ్ళు లైన్లోకి రాగానే చిరునవ్వుగా కుశలమడుగుతూ తన గురించి చెప్పుకున్నాడు దొరబాబు.

"... ... ..."

"ఆ... అందరూ బాగున్నారు"

"... ... ..."

"ఆ... ఏంలేదు. ఒక హార్డ్ సమస్యను సాల్వ్ చేయాల్సి వచ్చింది" అని, నా గురించిన విషయాన్ని మొత్తం ఇంగ్లిష్‌లో చెప్పుకుపోయాడు దొరబాబు.

"... ... ..."

"టు డే ఈవినింగ్"

"... ... ..."

"అలాగా! మళ్ళీ ఎప్పుడొస్తారు? "

"... ... ..."

"నోనో! యూ ఆర్ మై ఫ్యామిలీ డాక్టర్. కాబట్టి మీరొచ్చేవరకూ పెండింగ్‌లోనే వుండనీ. రెండువారాలేకదా. ఎలాగూ ఒక వారం వరకూ బిజీగానే వుంటున్నాను. ఆ తర్వాతే తీరిగ్గా సాల్వ్ చేసుకుందాం. కానీ"

"... ... ..."

"అఫ్‌కోర్స్! ఎవరితో ఎగ్జామ్ చేయించాలో వాళ్ళతో చేయిస్తేనే నాకు శాటిస్ఫెక్షన్‌గా వుంటుంది. ముఖ్యంగా నా ప్రజలు నాకు బిడ్డలతో సమానం. సో... ఇలాంటి పరిస్థితుల్లో మీరు ఇచ్చే రిపోర్ట్సే నాక్కావాలి"

"... ... ..."

"ఓకే... ఇట్సాల్‌రైట్. సీయూ ఎగైన్" అంటూ ఫోన్ కట్‌చేశాడు దొరబాబు. ఇందాకటి మాటల్నిబట్టి నాకు జరగాల్సిన పరీక్ష వాయిదా పడిందని అర్థమై నేను దిగులుగా ముఖం పెట్టుకుని శూన్యంలోకి చూస్తూ నిలబడిపోయాను.

"డాక్టరమ్మ అర్జంటు పనిమీద ఢిల్లీ వెళ్తున్నారు. కాబట్టి రెండు వారాలవరకూ ఈ గొడవను ఇలాగే వుండనివ్వండి. అంతవరకూ వున్న సమయాన్ని మీరు మీ విషయంలో మళ్ళీ ఆలోచించుకోడానికి నేను ఇచ్చిన గడువుగా భావించండి" మమ్మల్ని ఉద్దేశించాడు దొరబాబు.

"అట్లాగే దొరా!" తలాడించాడు నాన్న.

"తమరు చెప్పినట్టే కానివ్వండి దొరా" నాన్నను అనుసరించింది అమ్మ.

"ఆ డాక్టర్ లేకపోతే వేరే డాక్టర్‌తో ఎగ్జామ్ చేయించవచ్చు కదండీ? " నాకు వచ్చిన సందేహమే అమ్మగారికి వచ్చింది.

"నాకూ తెలుసు ఆ విషయం. కానీ మనం సెలెక్ట్ చేసుకున్న ఆ అదర్ డాక్టర్ ఎవరో అనేది ఆ శెట్టీవాళ్ళు స్పాట్‌లో తెల్సుకుని వెళ్ళి, లంచం ఇచ్చి తమకు అనుగుణంగా రిపోర్ట్సు ఇప్పించుకోవచ్చు. అసలే వాళ్ళు మనకు ఈ మధ్యకాలంలో ఎక్స్‌ట్రాగా కనిపిస్తున్నారు. సో..." తెలివిగా అన్నాడు దొరబాబు.

ఆ మాటలు నాలో కొత్త ఆనందాన్ని కలిగిస్తుంటే, "అంటే? దొరబాబు నన్ను అనుమానించడం లేదన్నమాట. కాపోతే బాధ్యత కాబట్టి నిజానిజాల గురించి మళ్ళీ మళ్ళీ హెచ్చరిస్తున్నాడు అంతే" పొంగిపోతూ మనసులోనే అనుకున్నాను.

"మామీద దయ ఉంచి మాకు న్యాయం జరిపించండి దొరా" అంటూ చేతులు జోడించాడు నాన్న.

"దొరా! నా బిడ్డ జీవితం మీ చేతుల్లో వుంది. దయ చూపండి. మీ కాళ్ళు కడిగి తలమీద పోసుకుంటాం" అమ్మ కూడా చేతులు జోడించింది.

"మీ చల్లని చూపులు ఎప్పుడూ మామీద వుండాలి దొరా" నేను కూడా చేతులు జోడించాను.

"మీకు అన్నివిధాలా నేను వున్నాను. మీరేం భయపడొద్దు. వెళ్ళిరండి" చిరునవ్వుతో చెప్పాడు దొరబాబు.

"దండాలు బాబుగారూ..." సెలవు తీసుకుంటూ అమ్మా, నాన్న, నేను ముగ్గురం ఒకేసారి చేతులు జోడించి, ఆ తర్వాత అక్కడ్నుంచి నెమ్మదిగా బయటపడ్డాం.

మేము గేటుదగ్గరగా వెళ్లామో లేదో గుర్ర పుబగ్గి లోపలికి వస్తూ కనిపించింది. నగ రంలో కార్లల్లో తిరిగి మొహం మొత్తిన దొర బాబు సంతానం... పల్లెకు రాగానే ఆ గుర్రపు బగ్గీలో షికారుకి వెళ్తుంటారు. అందుకే నా కళ్లు ఆత్రంగా అతడికోసం వెది కాయి.

తమ్ముళ్లకు మధ్యగా కూర్చుని వున్న అత గాడు తెలుపురంగు దుస్తులు ధరించి కని పించాడు. ఆ దుస్తుల్లో అతడు పున్నమిచం ద్రుడితోనూ, దివిలో వెలసిన పారిజాత దివ్యకుసుమాలతోనూ, పోటీ పడుతున్న భువిచంద్రుడిలా తోస్తుంటే... నా కళ్లు సంతోషంగా మెరిసాయి. అందుకు తోడుగా నా పెదిమలు చిరునవ్వుగా విచ్చుకున్నాయి. కాని నా భావతరంగాల్ని ఎక్కువసేపు కన్పించనీయకుండా చప్పున సహజంగా మారిపోతూ అమ్మానాన్నల వెంట ఎప్పట్లా అడుగుల్ని ముందుకు వేస్తూనే వున్నాను.

అతడుగాని, అతడి తమ్ముళ్లుగాని మమ్మల్ని అస్సలు పట్టించుకోలేదు. కనీసంగా ఎవరో సాటి మనుషులు వెళ్తున్నారు కదానేనా యధాలాపంగా కూడా మావైపు చూపుల్ని పడనీయలేదు. అది వాళ్ల గర్వమో, సహజ మైన అలవాటో అంచనా వేయలేను కాని... ఆ హుందాతనాన్ని తన స్వంతం చేసుకున్న అతగాడు మాత్రం నాకు ప్రత్యేకించి ఒక మిల టరీ ఆఫీసర్‌లా కనిపిస్తున్నాడు.

"దొంగా షికారుకు వెళ్లావా? నీకోసం ఇందాకా వెదికిన నా కళ్లు ఎంత అలసిపో యాయో తెలుసా? " గేటుదాటి ముందుకు వచ్చాక నెమ్మదిగా వెనుతిరిగి చూస్తూ మన సులోనే అనుకున్నాను.

రేపటి నా ఆశ... క్షణక్షణం మనసులో కదలాడే కమ్మని కాంక్ష... ఎంత గొప్పగా వున్నాయో, ప్రస్తుత నా పరిస్థితి న్యాయం కోసం నిరీక్షిస్తూ అంత హీనంగా వుంది.

అవునుమిత్రమా! పరిస్థితుల్ని అన్నివి ధాలా తలుచుకుని కెరటంలా కృంగే నా మనసుని నా ఆత్మవిశ్వాసం ప్రతిసారీ పున ర్నిర్మిస్తోంది! అందుకే నాలో పరిపూర్ణత అంచలంచెలుగా పెరిగిపోతోంది. మరి కొంచెం ముందుకు వెళ్ళాక వెనక్కి తిరిగి చూశాను. గుర్రపుబగ్గీలోంచి దిగిన అతడు చేతుల్ని వ్యాయామంలా ఆడిస్తూ వరండా మెట్లు ఎక్కుతూ కనిపించాడు.

'నేను నిన్ను వదలను ధీరేంద్రా! నా ప్రేమ నీకోసం ఏమైనా చేస్తుంది. ఎన్న యినా చేస్తుంది, చివరికి మనద్దరినీ ఏకం చేస్తుంది' అతడిని అలాగే చూస్తూ మళ్ళీ మనసులోనే అనుకున్నాను.



ఊరి చివరగా వున్న జాతర మైదానం జనంతో కిక్కిరిసిపోయివుంది. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు కూడా కలవడంతో ఆ జనచైతన్యం ఒక జనసముద్రంలా కనిపి స్తోంది!

ఆ పోటీలు ఏటా నిర్వహించేవే అయిన ప్పటికీ, ఈ ఏడు కొత్తదనాన్ని... కొత్త ఉత్సాహాన్ని సంతరించుకోవడంతో ఆ సమీ పాన కొత్త కుగ్రామం కూడా వెలిసినట్ట య్యింది. ఎందుకంటే... వారం రోజుల పాటుగా జరిగే పోటీలను తిలకించడంకోస

మని పరాయి గ్రామస్థులు కొందరు అక్కడే వుండిపోదలుస్తూ గుడారాలను ఏర్పాటు చేసుకున్నారు. ఇక పోటీదారుల విషయానికి వస్తే... ఏ రోజుకు ఆరోజు ఆయా పోటీల్లో పాల్గొన్న వాళ్ళందరికీ దొరబాబు ఇంటిదగ్గర ఉచితభోజనాల ఏర్పాటు చేయబడింది.

పోటీల కోసం కావాల్సినంత విశాలమైన స్థలాన్ని గుండ్రంగా వదిలి, చుట్టూ కర్రలు పాతించి, ఆ వెనక ఏ వూరికి ఆ వూరి జనాలు ప్రత్యేకంగా పోటీల్ని తిలకించేందుకుగానూ కర్రలతోనే విభాగాల్ని చేయించి, ఆయా గ్రామ నామాలను ఆయా విభాగాల దగ్గర గుడ్డలపై రాయించి కట్టించి, ఓ పక్కగా ఎత్తయిన వేదికను ఏర్పాటు చేయించి, ఆ వేదిక మీదుగా గుడ్డ పందిరి కట్టించి, మొత్తానికి బ్రహ్మాండమైన వాతావరణాన్ని పదిలంగా సృష్టించాడు దొరబాబు!

పోటీల గురించి వ్యాఖ్యానించేందుకు వూర్లో చదువుకున్న కుర్రాళ్లలో ఎవరో ఒకర్ని నియమించడం జరిగేది. కాని ఈ ఏడు ఆ వ్యాఖ్యాతలు ఎవరు అనేది వేదిక మీద ఎవరూ కనిపించలేదు.

“ఎవరా వ్యాఖ్యాత?” నాలో నేను ప్రశ్నించుకుంటూ వేదికమీద ఒకమారు కలియజూశాను. నా చూపులను సమాధానపరుస్తూ అనూహ్యంగా మైకును, కాగితాలు బిగించబడిన అట్టను, తన చేతుల్లోకి తీసుకుని లేచి నిల్చున్నాడు పెదబాబు!

నేను ఒక్కసారిగా ఆశ్చర్యపోయాను. ఆ తర్వాత పరిసరాల్లో ప్రతిధ్వనించే అతడి గొంతు వినడంకోసం కారుమబ్బుల కోసం ఎదురుచూసే మయూరంలా ఆదుర్దాపడ్డాను.

“ప్రియమైన ప్రజలారా...” తన తొలిమాటగా గంభీరంగా ఉచ్ఛరించి “పోటీలు ప్రారంభం కాబోతున్నాయి కాబట్టి మీరు నిశ్శబ్దంగా వుండాలని కోరుకుంటున్నాను. ముఖ్యంగా... మా నాన్నమ్మ శ్రీమతి గాయత్రీదేవిగారి పేరిట ప్రతి ఏటా నిర్వహించే ఈ పోటీలు ఈ సంవత్సరం ఒక కొత్తదనాన్ని సంతరించుకున్నాయి. నాన్నమ్మ మమ్మల్ని అందరినీ వీడి స్వర్గాన్ని చేరుకుని ఈ ఏటికి పది సంవత్సరాలు పూర్తయిన కారణంగా పెద్దఎత్తున ఈ పోటీల్ని నిర్వహించడమైనది. ప్రతి ఏటా గ్రామంలోని ప్రతిభావంతులనే ప్రోత్సహిస్తూ వచ్చిన మా సంప్రదాయం, ఇప్పుడు చుట్టుపక్కల గ్రామాల్లోని ప్రతిభావంతులని కూడా ప్రోత్సహించడానికి సిద్ధంగా వుంది! అయితే... మా నాన్నమ్మగారి దశమవర్థంతి సందర్భంగా ప్రత్యేకతను సంతరించుకున్న ఈ పోటీల్లో మరొక ప్రత్యేకత ఏంటీ అంటే... పోటీల్లో గెలుపొందిన విజేతలకు ఏటా అందించే సాధారణ బహుమతుల్ని కాకుండా, స్వర్ణ, రజిత, కాంస్య పతకాలను మరియు ప్రశంసాపత్రాలను, కొంత నగదు బహుమతిని కూడా అందిస్తాం” అంటూ పెదబాబు చెప్పే చెప్పగానే జనాలు ఆనందంతో ఉవ్వెత్తున కేకలు వేశారు. ఆ కేకలను నేను పరవశించిపోతూ వింటూనే ఊహల్లో తేలిపోసాగాను.

“వసూ...” వున్నట్లుండి పద్మజ నన్ను కదిపింది.

పిలిచినట్లుగా తెలిసినా ఆలోచనల్లోంచి బయటపడటం ఇష్టంలేక అలాగే వుండిపోయాను.

“ఏయ్ మొద్దూ” మళ్ళీ పిలిస్తూ మళ్ళీ కదిపింది పద్మజ.

“ప్చ్! ఏంటీ?” చేసేదిలేక తేరుకుంటూ కొంత విసుగ్గానే అడిగాను.

“ఏంటీ గేమ్ చూడకుండా స్టేజీవైపు చూస్తూ తెగ ఆలోచిస్తున్నావు?” అడిగింది పద్మజ.

“ఏంలేదే! వాళ్లంతా ఎంత అదృష్టవంతులు కదా అని చూస్తున్నాను అంతే” ఏదో ఒకటి అన్నట్లుగా చెప్పాను.

కాలం తెలీకుండానే గడిచిపోసాగింది. మధ్యాహ్న సమయం అయ్యేసరికి మూడు

పోటీల వారిగా ఆరుగ్రామాల కబడ్డీ జట్లు తమ ఆటను పూర్తిచేసుకున్నాయి. గెలుపొందిన జట్లు మళ్ళీ పోటీలోకి దిగాల్సిందే కాబట్టి, తమ తదుపరి విజయంకోసమై తమలో చెలరేగుతున్న పట్టుదలను తమ ముఖాల్లోనే కనబరుస్తుంటే... ఆ పట్టుదలను నా ప్రేమ విషయమై నాలో ఆపాదించుకుంటూ ధీరేంద్రవైపు చూశాను.

అతడు కూర్చుని వున్న కుర్చీ ఖాళీగా వెక్కిరించింది. "ఎక్కడికి వెళ్లాడు?" మనసులోనే అనుకుంటూ వేదికపై అటూఇటూ చూశాను. వేదికమెట్లు దిగిపోతూ ఆహ్వానితుల వెనకనుంచి అస్పష్టంగా కనిపించాడు అతడు. అదే క్షణంలో అతడు చిటికెన సమస్య నిమిత్తమై వెళ్తుండవచ్చనే ఊహ నాలో చప్పున కదిలింది. దాంతో నేను ఇక ఆలస్యం చేయలేదు.

"పద్మా! వెళ్లొస్తానే" అంటూ చిటికెనవ్రేలు చూపించాను.

"నేనూ వస్తాను. పదవే" నా ఆశను ఒక్కసారిగా త్రుంచిపడేసినట్టుగా అంది పద్మజ. నిజానికి నాకా సమస్య ఏమీ లేదు ఇప్పుడు. అయినప్పటికీ చేసేది లేక పద్మజతో కలిసి జనాల్ని తప్పించుకుంటూ బయలుదేరాను.

"మేము మళ్ళీ వస్తాం. మా ప్లేసు మాకు వుండాలి" కొన్ని అడుగులు ముందుకు వేశాక వెనుతిరిగి చూస్తూ చెప్పింది పద్మజ

"అదేం కుదరదు. ఇక్కడ నీ పేరు రాసి పెట్టిలేదు" మా స్థలాన్ని అప్పటికే ఆక్రమించేసిన మావూరి వడ్ల శంకరయ్య కూతురు ధైర్యంగా అంది.

"ఏంటీ కుదరదా? నా తల్లే" వ్యంగ్యంగా అని, నా వైపు చూస్తూ "ఏయ్ వసూ! లక్కీగా ఇప్పుడే గుర్తుకువచ్చింది కాబట్టి సరిపోయింది. లేదంటే ఈ పోరి మనల్ని సతాయించి పెట్టేది! ముందు నువ్వెళ్లిరా! తర్వాత నేను వెళ్తొస్తాను" చెప్తూనే స్థలం కోసం ముందుకు దూసుకుపోయింది పద్మజ.

ఆ దేవుడే నన్ను కరుణించాడేమో అన్పించింది. అందుకే "దేవుడా థాంక్స్" మనసులోనే అనుకుంటూ జనాల్ని తోసుకుంటూ ముందుకు వెళ్లాను. నా ఆదుర్దా అంతా ధీరేంద్ర దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించాలనేదే! నిజంగా ఈ విషయం గురించి నిజాయితీగా మాట్లాడాలంటే తమ ఇంటి పనిపిల్లగా ధీరేంద్ర నన్ను చాలాసార్లు చూశాడు. కాని ఆ చూడటం వేరు, ఇప్పుడు చూడటం వేరు. కాబట్టే జనాల్ని తప్పించుకున్నాక నా నడకలో వేగం పెంచాను.

కాసింత దూరంలో గ్రామదేవత ఎల్లమ్మ వారి ఆలయం నన్ను కరుణించే వరాలమయిగా కనిపిస్తోంది. ఆ పక్కనే వున్న కోనేరు, దానికి ఎడంగా సీతాఫలాలవనం! ధీరేంద్ర అటుగానే వడివడిగా వెళ్తున్నాడు. నేను అనుకున్నట్టుగానే అతడు వెళ్తుండటం వల్ల నా ఆలోచన కూడా తప్పకుండా గెలిచి తీరుతుందనే నమ్మకం నాలో గట్టిగా అప్పటికప్పుడే ముద్రించుకుపోయింది.

ఇప్పుడు నాలో ఎవరైనా చూస్తారేమోననే భయంగాని, నిన్నమొన్నటి వరకు నన్ను పీడించిన గాయాలతాలూకు కించిత్ బాధ గాని వెదికినా కన్పించనట్టుగా వుంది. ముఖ్యంగా నేను వెళ్తున్నది కూడా లఘుశంక తీర్చుకోవాలనే నెపంతో! కాబట్టే ఇంతధైర్యంతో వెళ్లగలుగుతున్నాను.

చూస్తుండగానే ధీరేంద్ర సీతాఫలాల వనంలోకి వెళ్లాడు. నేను కోనేటికి ఎడంగానే సీతాఫలాల వనానికి పక్కగా వున్న రాళ్లగుట్టవైపు అడుగులువేస్తూ ధీరేంద్రకోసం యధాలాపంగా అన్నట్టుగా వనంలోకి చూశాను. సన్నగా ఈలవేస్తున్న ధీరేంద్ర గొంతు సమీపంగా వినిపించింది కాని, చెట్ల గుబురు కారణంగా అతడు కనిపించలేదు. అందుకే ఏదో పని వున్నట్లుగా కిందికి వంగి గట్టిగా గుట్టమీది మట్టిని చేతివ్రేళ్లతో గట్టిగా పెకిలిస్తూ, ధీరేంద్ర తిరిగి వచ్చేవరకు

అలాగే వున్నాను. కాసేపటి తర్వాత ధీరేంద్ర తిరిగి వస్తున్నట్టుగా కడకంటి చూపులద్వారా తెలిసి, వంగుని వున్నదాన్నల్లా చప్పున లేచి, ఓ రెండుమూడు అడుగులు ముందుకువేసి, ఆ తర్వాత కావాలని కాలు అదుపు తప్పినట్టుగా నటిస్తూ పెద్దపెట్టున "అమ్మా" అని అరుస్తూ కోనేటిలో పడిపోయాను.

నీళ్లల్లో మునిగితేలుతూ "రక్షించండీ రక్షించండీ" అని ప్రాణభయంతో కేకలు వేయడం మొదలెట్టిన నాకు, నా వెనకే మరొకరు నీళ్లలోకి దూకిన శబ్దం వినిపించింది. చుట్టుపక్కల పంటపొలాలు వున్నప్పటికీ రైతులంతా మైదానం దగ్గరే వుండిపోయారని నేను మైదానం దగ్గర వున్నప్పుడే అంచనా వేసుకున్నాను. కాబట్టే నా వెనక నీళ్లలోకి దూకింది రైతులు ఎవరో కాదని, అది ఖచ్చితంగా నా ధీరేంద్రే అని భావిస్తూ, ఈత వచ్చి వుండీ కూడా ప్రాణాపాయం సంభవించినట్టుగా నటించసాగాను. నా వెనకే దూకి వచ్చిన వ్యక్తి, మరి కాసేటికి నా జుట్టును దొరకపుచ్చుకున్నాడు. ఆ తర్వాత నా రెండు చేతుల్ని ఒడిసిపట్టి తనకు దగ్గరగా లాక్కొన్నాడు. అందాకా అతడికి వీపు చేసి వున్న నా శరీరం ఇప్పుడు అతడికి అభిముఖమౌతూ, నా తల అతడి మెడభాగంలో ప్రమేయంలేకుండా చోటు దొరికించుకుంది.

మనసైన మగాడు, తోడుగా ప్రణయప్రబంధువు ప్రేరణలా కోనేటి నీళ్ల, తడిసిన శరీరాలు, దగ్గరితనం, అంతా... అంతా ఒక స్వప్నం సాక్షాత్కరించిన శుభతరుణం!

జ్వలించు ప్రియా నులివెచ్చని ఊపిరివై
చలించు ప్రియా సుతిమెత్తని మోహానివై
మధురోహల ఉప్పెనలో తడిసి
మృదుభావాల అల్లరివై కురిసి
ప్రేమ ఉధృతివై ప్రవహించు ప్రియా ప్రవహించు...

కాసేపటి తర్వాత ఒడ్డుకు చేరినట్టుగా తెల్సింది. కావాలని నా తలను అతడి భుజాలమీదుగా వాల్చేశాను. అతడు నన్ను తన చేతులమీదుగా ఒడ్డుమీది చదును ప్రదేశానికి చేర్చడం, మింగిన నీళ్లను కక్కించడానికి నా కడుపు నొక్కడం, ఆ తర్వాత నా పె...ది...మ...ల్ని తాకడం అంతా వూహిస్తున్న నాకు మనసు ఎంతమాత్రం నిలవడంలేదు. కమ్మని అలజడి మోతాదుకి మించిపోతూ నన్ను అంతెత్తున మురిపిస్తుంటే... "పె...ద...బా...బూ..." మనసులో అనుకోబోయి పొరపాటున పైకే అనేశాను.

ఆ తరువాత నా గుండె జల్లుమనడం ఏమోగాని, నా మాటకు ప్రతిగా వినిపించిన గొంతు మాత్రం నా నిలువెత్తు శరీరాన్ని కంపరపరిచింది.

"ఏంది వసమ్మా? ఏందో అంటున్నావు?" బోయ మద్దిలేటిగాడి గొంతు బొంగురుగా అలా వినిబడిందో లేదో ఇలా చప్పున దూరం జరుగుతూ వాడిని దూరంగా నెట్టేశాను. ఆ తోపుకు వాడు వెళ్ళి గొంతు లోతు నీళ్లల్లోపడ్డాడు.

"ఛ! నేనొకటి తలిస్తే దేవుడొకటి తలిచాడు" చీకాగ్గా అనుకుంటూ అతగాడికోసం చుట్టూ కలియజూశాను. నా మనసు చీకాగ్గా వున్నా అతడిని గాలిస్తున్న నా కళ్లల్లో మాత్రం ఆతృత! అతడు ఎక్కడా కనిపించలేదు.

"ధీరేంద్రా?" నా మనసు బాధగా మూలిగింది.

"వసమ్మా! ఏంది ఇట్ల తోసేస్తివి?" అంతలో నీళ్లలోంచి పైకి లేచిన మద్దిలేటి గొంతులో అర్థంకానితనం స్పష్టంగా కనిపించింది.

నేను కనీసంగా వాడివైపు తిరిగి కూడా చూడలేదు. వెంటనే ఒడ్డుమీదకు ఎక్కి, ఆశ చావని మనసుతో మళ్ళీ అతగాడికోసం చూశాను.

"సమయానికి నేను గనుక లేకపోయి

వుంటే ఈ పాటికి నీకు పాడె సిద్ధమయ్యేది. అవును వసమ్మా! నేను ఈ సీతాపలసెట్లకు లోపల మందుకొట్టుకుంటూ వున్నాను. సిటికెనవేలు కోసం పెదబాబుగారు లోపలకి వచ్చిండు. ఆ తర్వాత కొంతసేపటికే నీవు పెద్దగా అరుస్తూ నీళ్ళలో పడిపోయినవు. అంతవరకే తోట బయటకు వచ్చేసిన పెదబాబు, నావైపు కంగారుగా చూశాడు. అప్పటికి నేను కూడా బయటకు పరుగెట్టుకొచ్చి నీళ్ళల్లో మునిగి తేలుతున్న నిన్ను రచ్చించడంకోసం ఎనకా ముందు ఆలోచించకుండా నీళ్ళల్లోకి దూకేశాను. కాని నువ్వేమో నన్ను కాపాడినాడనే కరుణ కూడా లేకుండా కసికొద్ది తోసేసావు! అంటే? బలవంతంగా ప్రాణం తీసుకోవాలనుకున్నావా? లేకపోతే కాపాడిన నామీద నీకు కోపం ఎందుకు వస్తుంది?" మాట్లాడుతూనే ఒడ్డుమీదకు వచ్చేసి నా పక్కగా నిల్చున్నాడు వాడు.

ఎవరికైనా చిన్నగాయం తగిలి ఏడుస్తుంటేనే అలా వెళ్లే వాళ్లు ఇలా నిల్చుని "ఎందుకు... ఎలా...?" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తారు. కాని నేను నీళ్ళల్లో పడిపోయి ప్రాణాపాయస్థితిలో కనిపించినప్పటికీ, నన్ను ఒడ్డుకు చేర్పించేవరకు కూడా వుండకుండా వెళ్ళిపోయిన నా ధీరేంద్ర నిర్లక్ష్యం... నన్ను దైన్యంగా మార్చివేసింది. నాలో వేనవేల దుఃఖాల్ని గుమ్మరించింది.

నేస్తం!

నీలో మానవత్వం లేదా?

నీవు మనిషి రూపంలో వున్న 'మహాత్ముడు' అనుకుంటున్నాను.

'మహర్షి' అనుకుంటున్నాను.

'మహామనీష' అనుకుంటున్నాను.

కాని సగటు మనిషికి సైతం తగ్గి కనిపిస్తున్నావేం?

"ఏం వసమ్మా! అట్ల నిలబడిపోయినావేం? ఇంద... ఈ తువ్వాలు తీసుకుని తల, ఒళ్లు, బాగా తుడ్చుకో" అంటూనే ఒడ్డుమీదే కాసింత దూరంలో వున్న తన తాలూకు తువ్వాలుని తీసుకువచ్చి నా చేతికి ఇచ్చాడు మద్దిలేటి.

నాలో చెలరేగుతున్న స్వప్నవికలం నా మనసును అతలాకుతలం చేస్తుంటే వాడు గుర్తు చేశాక సైతం తడిసిన నా శరీరాన్ని చూసుకుని నేను బిడియపడలేదు. చేతితో తువ్వాలు అలాగే పట్టుకుని మరేం తోచనట్టుగా నేలను చూస్తూ నిలబడిపోయాను.

"ఏం వసమ్మా?" పిలిచాడు మద్దిలేటి.

అప్పటికిగాని వయసులో వున్న ఓ మగవాడి ముందు నేను నా శరీరాన్ని అస్పష్టంగా బహిర్గతం చేస్తున్నాననే చలనం నాలో రాలేదు. ధీరేంద్ర గురించే దీనంగా ఆలోచిస్తూ అప్రయత్నంగా కళ్లనీళ్లు తుడ్చుకున్నాను.

★ ★ ★

నెత్తిమీద శని వున్నప్పుడు స్వర్ణాన్ని ముట్టుకున్నా ఇనుప ముక్కలా మారిపోతుంది అన్నట్లుగా నా పరిస్థితి అనూహ్యంగా మరో మలుపు తిరిగింది.

మద్దిలేటిగాడు నా గురించి ఊర్లో అందరికీ తనకు తోచినట్టుగా సాయంకాలం వరకు చెప్పేశాడు. అసలే వూర్లో అందరికీ నేనొక ప్రత్యేక వార్తగా మారివున్నాను. ఇక ఇప్పుడు సంచలన వార్తగా మారిపోయాను.

దొరబాబుగారు పిలిపించి డాక్టరు పరీక్షలు జరిపిస్తానని చెప్పగానే, నిజం ఒప్పుకోవడం చేతకాక ఆ పిల్ల ఆత్మహత్యకు పాల్పడింది అంటూ జనాలు మాట్లాడుకోవడం నేను ప్రత్యక్షంగా వినకపోయినా అంతా నాకు అర్థమౌతూనే వుంది.

నేను తవ్వుకున్న గోతిలో నేనే పడిపోయాను. కాబట్టి నా పరిస్థితి తుఫానులో చిక్కిన తూనీగలా మారింది. నిజమా? కాదా? అంటూ రామేశ్వరంగాడి మాటలకు అనుమానంగా వుండిపోయిన వాళ్లకు సైతం నిజమే అన్నట్లుగా అన్యాయంగా దొరికిపోయాను. ఈ దొరికిపోవడం బయటివాళ్లకే కాదు ఇంట్లో అమ్మానాన్నలకు

కూడా. కాని ఈమారు అమ్మానాన్నలతో నేను వాదించలేదు. రెండు వారాల తర్వాత నేను ఏమిటో శాస్త్రపరంగా నిరూపించబడ తాను కాబట్టి అదే విషయాన్ని అమ్మానాన్న లకు చెప్పి నామటుకు నేను మౌనంగా వుండిపోయాను.

ఇక ఆ మరునాటి నుండి నేను ఆటలకు కూడా వెళ్లలేదు. వెళ్లాలనే వుంది. వెళ్లి నన్ను ఇరకాటంలో పడవేసిన నా ప్రియ నేస్తాన్ని చూడాలనే వుంది. ఇష్టమైన వాళ్ల కోసం కష్టపడటంలో కూడా సుఖం వుంది కాబట్టే అతడిపై నాకు కోపం రాలేదు. మనసు ఒకింత నొచ్చుకున్నా అతగాడిమీది ప్రేమ పదిలంగా వుంది.

"ఇద్దరం కల్సే వెళ్లాలనుకున్నాంకదా? ఆత్మహత్య ఎందుకు చేసుకోవాలనుకుం టుంది? " అంటూ పద్మజ అమ్మానాన్నల ముందు మాట్లాడినప్పటికీ చాటుగా నా దగ్గర మాత్రం "ఏమే? నిజం చెప్పు? వాస్త వానికి ఇద్దరం కలిసి వెళ్లాలనుకోలేదు. నువ్వొకతివే ముందుగా వెళ్లాలనుకున్నావు. అంటే నీది సూసైడ్ ఉద్దేశ్యమేకదూ? నా దగ్గర ఏదీ దాచవద్దు. నాకు అంతా చెప్పే సేయ్" అని రామేశ్వరం గాడి మాటల ప్రకారం నిజంగానే నాకు ఏదో జరిగిందన్న ట్టుగా ఆ విషయాన్ని నా చేతే ఒప్పించాల న్నట్టుగా బలవంత పెడుతూ మాట్లాడింది.

పద్మజకు కూడా నేను చెప్పుకునే సమా ధానం సంతృప్తిగా లేదు. ఇలాగని నా ఎద లోతుల ప్రేమ నిజాన్ని, ఆ ప్రేమకోసం ఆడిన నాటకాన్ని ధైర్యం చేసి బయటపెట్టు కోలేను. ఇలాంటి పరిస్థితుల్లో ఇంట్లో మాత్రమే కాదు, బయటివాళ్లతో కూడా నేను ఎక్కువగా వాదించదలచుకోలేదు. కలల్ని నిజంచేసే కాలం కష్టపెట్టడం సహజమే అని నమ్ముతున్న ఆశావాదిని కాబట్టి మౌనంగా వుండిపోవడమే మహాప్రసాదం అని భావిస్తూ అపనిందల్ని భరిస్తున్న రేపటి అజేయురాలిగా వుండిపోదలుచుకు న్నాను. అందుకే మద్దిలేటి వాళ్ల ఇల్లు మా ఇంటికి దగ్గరే అయినప్పటికీ చిన్నప్పటి నుండి రేగుపళ్లకోసం, ఈతపళ్లకోసం వాళ్ల తాలూకు పొలాల చుట్టూ తిరిగి వాడితో కావల్సినదానికంటే ఎక్కువ పరిచయాన్నే పెంచుకున్నప్పటికీ ఇప్పుడు వాడి దగ్గరకు వెళ్లి మాత్రం "ఎందుకు ఇలా చెప్పావు? " అంటూ గట్టిగా నిలదీయలేకపోయాను కూడా! ఎందుకంటే నేనేంటో బయటపడేవ రకు ఇవన్నీ వ్యర్థప్రయత్నాలే అవుతాయని నాకు తెలుసు.

★ ★ ★

కొన్ని రోజుల తర్వాత ఓ రోజు ఉదయా న్నే...

"పొద్దెక్కింది. లేచి పరుపులు చుట్టి ముఖం కడుక్కోపో! చాయ్ వేడిపెట్టి ఇస్తాను" చెప్పింది అమ్మ.

అంతలో "అమ్మా అమ్మా" పెద్ద చెల్లెలు తల వాకిలి నుండే అరుస్తూ లోపలికి పరు గెట్టుకొచ్చింది. దాని గొంతులో కంగారు స్పష్టంగా కనిపిస్తోంది. అందుకే చప్పున బద్ధకం వీడి "ఏంటీ? " అడుగుతూనే లేచి ఎదురువెళ్లాను. దాని కంగారు చూస్తుంటే కారణం తెలియకుండానే నాలో కూడా కంగారు కలుగుతోంది.

"అక్కా... అక్కా! ఆ రామేశ్వరం గాడిని రాత్రి ఎవరో చంపేసి ఊరి బయట మైసమ్మ మర్రిచెట్టు దగ్గర పడవేసి వెళ్లిపో యారట" ఆయాసపడుతూ చెప్పి "వాడు చావడంవల్ల మన ఇంట్లో ఎవర్నీ పోలీసులు పట్టుకుపోరుకదా? " భయంగా అడిగింది చెల్లెలు.

"ఛ! మనల్ని ఎందుకు పోలీసులు పట్టు కుపోతారు? " అని "ఈ విషయం నీకు ఎవరు చెప్పారే? " వాడి మరణ వార్త విన్నా ననే ఆనందంకొద్దీ ఆత్రంగా అడిగాను.

"చేతి పంపు దగ్గర మాట్లాడుకుంటు న్నారు" చెప్పింది చెల్లెలు.

"అయ్యో! ఇదేం ఖర్మరా భగవంతుడా?

మన పంచాయతి ఎటూ గాకముందే వాడికి కాలం మూడింది" నా వెనకే నిల్చునివున్న అమ్మ అసహాయంగా తలబాదుకుంది.

"ఎదుటివాళ్ల పొయ్యి ఆర్పాలనుకుంటే తమ పొయ్యే ఆరిపోతుందని ఆ దేవుడు నిరూపించాడు" కసితో కూడిన ఆనందంతో అని "అమ్మా! నువ్వేం కంగారుపడొద్దు. ఆ దేవుడు వాడికి సరైన శిక్ష విధించాడు. ఇందువల్ల మన పంచాయతీకి ఎలాంటి ఆటంకం జరగదు. వాడువున్నా లేకపోయినా మనకు జరగాల్సిన న్యాయం మనకు జరుగుతుంది" అమ్మకు ధైర్యం చెప్పాను.

"కాదక్కా! చేతి పంపు దగ్గర అందరూ మనల్ని తిట్టుకుంటున్నారు. అందుకే మన ఇంటికి పోలీసులు వస్తారేమోనని భయంగా వుంది" చెల్లెలిలో భయం ఇంకా తగ్గనే లేదు.

"వాడి హత్యతో మనకు ఏం సంబంధముందని పోలీసులు మన ఇంటికి వస్తారు? అయినా వస్తే రానీలే! మనం నిర్దోషులుగా తెల్సిపోయాక మనల్ని ఆ పోలీసులు కాదుకదా వాళ్ల బాబు దిగి వచ్చి కూడా ఏం చేయలేడు. మనకు న్యాయం జరిపించడానికి దొరబాబుగారు వున్నారు. ఇదొక్క విషయం గుర్తుపెట్టుకుని ధైర్యంగా వుండు. అనవసరపు భయాలతో మనసు పాడుచేసుకోవద్దు" చెల్లెలి భుజాలపై చేయి వేసి అభయపూర్వకంగా చెప్పి "చేతి పంపు దగ్గర మన గురించి ఏం మాట్లాడుతున్నారు? ఎవరెవరు మాట్లాడుతున్నారు? " అడిగాను.

"నిన్ను ఎవరూ పాడు చేయలేదంట. కావాలని నీవే తప్పు చేశావంట. ఈ విషయం బయట పెట్టినందుకు నిన్ను ప్రేమించిన వాడు అదను చూసుకుని ఆ రామేశ్వరం గాడిని చంపేశాడంట. అలా మాట్లాడుకుంటున్నారు" అని మాట్లాడుకుంటున్న ఇరుగుపొరుగు అందరి పేర్లని చెప్పింది చెల్లెలు.

నా గుండె నా నుండి ఒక్కసారిగా జారి కిందపడి భళ్లున పగిలిపోయిన భావన నన్ను గజగజా వణికించింది. కొన్ని క్షణాల వరకు ఏం మాట్లాడాలో తెలియక స్తబ్ధుగా మారిపోయాను. ఆ పిమ్మట ఇహలోకంలోకి వచ్చి నా నొసటికి పట్టిన చిరుచెమటల్ని అప్రయత్నంగా తుడుచుకున్నాను.

ఏ జన్మలో ఏ వసంతాన్ని నాశనం చేశానో తెలియదు కాని ఈ జన్మలో అడుగడుగున ఎదురౌతున్న అపనిందలు, అవమానాలు, నన్ను అసహాయురాలిగా మార్చివేస్తూ నాతో విలాసంగా, వికృతంగా ఆడుకుంటున్నాయి. అయినప్పటికీ పడిన ప్రతిసారీ లేచి నిల్చోవాలనే సూక్తిని అడుగడుగున ఒంటబట్టించుకున్నదాన్ని కాబట్టి బాధను అదుపులో పెట్టుకుంటూ "ఈ ఉరుములూ మెరుపులూ మనల్ని ముంచెత్తలేవు. కేవలం వేసవి పొద్దులో మనల్ని భయపెడుతున్నాయంతే" గుండె ధైర్యంతో అన్నాను.

నా మాటలు అమ్మకు ధైర్యాన్ని అందివ్వలేదు. అందుకే ఒకవైపు ఏడుస్తూ మరోవైపు అసహాయంగా నన్ను తిట్టడం మొదలెట్టింది. గలగలా పారే సెలయేరు లాంటి నేను, నా జీవితం ఒక్కసారిగా సమస్యల సుడిగుండంలో చిక్కుకోగానే నేనొక గాయంగా మారిపోయాను. అయినప్పటికీ నాలో నేను అజేయురాలిననే ఆత్మవిశ్వాసం నిండుగా వుంది. కాబట్టే ఒకవైపు ఒకింత బాధనిపిస్తున్నా మరోవైపు నిర్భయాన్ని ప్రదర్శిస్తూ అమ్మ చివాట్లను మౌనంగా భరించసాగాను.

చూస్తుండగానే దొరబాబు ఇంటినుండి మనిషి వచ్చాడు. దాంతో అమ్మ చెల్లెళ్లలో కంగారు పెరిగిపోయింది. నేను మాత్రం మొండిదానిలా మారిపోయాను. ముఖ్యంగా అభియోగం ఆధారంగా ప్రశ్నల్ని ఎదుర్కొనే ముందు నిర్దోషి సైతం నిలువునా వణికిపోతాడు. కాని నాలో మాత్రం హఠాత్తుగా నాకే తెలియని తెగువ వచ్చేసింది. కాబట్టే దొరబాబు మనిషి వెళ్లిపోయాక అమ్మ

గుండెలు బాదుకుంటుంటే నేను రాయిలా నిలబడిపోయాను.

దొరబాబు ఇంటికి వెళ్లాక సైతం నాలో మార్పులేదు. భావ చలనంలేని మంత్రపుష్పంలా వుండిపోయాను. నా వెంట అమ్మ ఒక్కతే వచ్చింది. నేను నిద్ర లేవక మునుపే నాన్న నిద్రలేచి బీడీఆకు కోసం పక్క పల్లెకు వెళ్లాడు. కాబట్టి నాన్న రాలేక పోయాడు. ఒకవేళ నాన్న ఈలోపు తిరిగి వచ్చి వున్నా ఇక్కడకు రాకపోవడమే మంచిది. ఎందుకంటే నాన్న ఎట్టి పరిస్థితిల్లోనూ తాగకుండా ఇంటికి రాలేదు మరి.

"వసమ్మా!" వున్నట్టుండి పిలిచింది అమ్మ.

ఏంటన్నట్టుగా చూశాను అమ్మవైపు.

"ఎందుకే అట్లా మారిపోయావు?." నా మౌనాన్ని పసిగట్టిన అమ్మలో నేను ఏ అఘాయిత్యానికైనా పాల్పడతానేమో అనే గాభరా స్పష్టంగా కన్పించింది.

ఏం లేదన్నట్టుగా తలను అడ్డంగా ఆడించాను.

"మరి ఎందుకు ఇట్లా వున్నావే?" అదే గాభరాతో అడిగింది అమ్మ.

అందుకు కూడా నేను పెదవి విప్పలేదు. అంతేకాదు నా ధీరేంద్ర కోసమై కూడా నా కళ్లు ఎప్పట్లా వెదకట్లేదు. ఇలాగని పరిస్థితుల ప్రాబల్యంవల్ల అతగాడి మీది నా ప్రేమ గడ్డకట్టుకుపోలేదు. ఎదలోతుల్లో జీవనదిలా పొంగుతూనే వుంది.

"ఏమైందే? నోరు విప్పకుండా కొరివి దెయ్యంలా నిలబడ్డావు? మనసు విరుచుకున్నావా ఏమి? అట్లాంటిది ఏమీ వద్దు. ముందునుండి నాకు ఎంత ధైర్యం చెప్తూ వచ్చావో అదే ధైర్యంతో వుండు" నా చేయి పట్టుకుంది అమ్మ.

అంతలోనే దొరబాబు ఠీవిగా వెలుపలికి వచ్చారు. ఆయన రాగానే మేము ఎప్పట్లా సగౌరవంగా చేతులు జోడించాం. ముఖ్యంగా దొరబాబు మాకోసం వెలుపలికి వచ్చినట్టులేరు. ఏదో పనిమీద బయటికి వెళ్తున్నట్టున్నారు. ఎందుకంటే వెంటే ఐదారుగురు వ్యక్తులు వున్నారు. పైగా మమ్మల్ని పెద్దగా పట్టించుకోలేదు. మా నమస్కారానికి చిన్నగా తలపంకిస్తూ ముందుకు నడుస్తూనే ఎడంగా నిల్చునివున్న నౌకరుకి మాకు ఏదో చెప్పమన్నట్టుగా చేతుల్తో సైగ చేసి వెంటవున్న వ్యక్తులతో ఆంగ్లంలో ఏదో సీరియస్‌గా మాట్లాడుతూ మెట్లుదిగి, ఒక పక్కగా ఆపి వున్న కారువైపు నడిచాడు. నేను వెళ్లిపోతున్న దొరబాబు వైపే విస్తుపోయి చూడసాగాను.

చలనం లేనట్టుగా తయారైన నా మనసు ఎప్పుడు తేలిక పడుతుందా అని ఎదురుచూస్తున్న నాకు దొరబాబు అలా హడావిడిగా వెళ్లిపోవడం కూడా ఒక విఘాతమే. అందుకే "భగవంతుడా ఏమిటీ పరీక్ష?" అలాగే చూస్తూ నాలో నేనే బరువుగా అనుకున్నాను.

"ఏమ్మా! దొరబాబుగారికి టౌనులో మినట్ల మీద పనిబడింది. అందుకే వెళ్లిపోతున్నారు. తమరు ఇంక ఇంటికి వెళ్లండి. దొరబాబు వచ్చినాక మల్లా పిలిపిస్తారు. అప్పుడు వద్దురుగానీ" మా బాధ తనకేమీ పట్టదు కాబట్టి నిర్లక్ష్యంగా చెప్పి తన పనేదో తను చేసుకోసాగాడు నౌకరు.

దొరబాబు మమ్మల్ని పిలవడం, ఆ తర్వాత అనుకోకుండా దొరబాబు కోసం టౌన్ నుండి మనుషులు రావడం జరిగిపోయిందని అర్థమయ్యాక కూడా దొరబాబుపై నాకు తొలిసారిగా పిచ్చికోపం వచ్చింది. కాని ఆ కోపాన్ని బయటకు ఎంతమాత్రం కనబడనీయలేదు. కనబడనిచ్చే ధైర్యం నాకేకాదు, చాలా గొప్పగొప్ప వాళ్లకు కూడా లేదు.

"ప్చ్" నాలో నేనే నిట్టూరుస్తూ అమ్మతో కలిసి అక్కడ్నుంచి నెమ్మదిగా అడుగులు ముందుకు వేశాను.

అంతలో మా వెనుక నుండి ఎవరో హడావిడిగా వస్తున్నట్లుగా బూట్ల శబ్దం

వినిపించింది. అప్రయత్నంగా వెనుతిరిగి చూశాను.

ధీరేంద్ర!

ముదురుఆకుపచ్చ రంగు జీన్స్ సూటు, అదే రంగుటోపి, భుజానికి పొడవైన తుపాకి వేలాడదీసుకుని మోకాళ్లకు దిగువ వరకు వున్న జిప్ ఫారిన్‌బూట్లు ధరించి టార్జాన్ వీరుడిలా కనబడుతున్నాడు. అతడ్ని అలా చూడగానే అమ్మతో పాటుగా పక్కకు జరిగి దారి తొలగినట్టుగా నిల్చున్నాను. అతడు మాత్రం మమ్మల్ని ఎంత మాత్రం పట్టించుకోలేదు. నేరుగా ముందుకు వెళ్లిపోయాడు. అతడ్ని చూడగానే గేటు దగ్గర వేపచెట్టుకింద నిల్చుని వున్న డ్రైవర్, గబగబా కుడిపక్కగా వున్న రేకుల షెడ్డువైపు వెళ్లి టాప్ లేని జీపుని వెలుపలికి తీశాడు.

"ధీరేంద్రా! వేటకు వెళ్తున్నావా? వన్యప్రాణుల్ని చంపడం పాపం కాదూ? " అతడ్నే చూస్తూ మనసులో అనుకున్నాను.

అతడు వెళ్లి జీపు ఎక్కి కూర్చుని పక్కన వున్న డ్రైవర్‌తో ఏదో నవ్వుతూ మాట్లాడసాగాడు. అలాంటి నవ్వు తాత్కాలికంగా నాకు దూరమైంది కాబట్టి దిగాలు వదనంతో అమ్మతోపాటుగా తిరిగి అడుగులు ముందుకు వేయసాగాను. మేము జీపు పక్కనుండి వెళ్లినప్పుడు కూడా ధీరేంద్ర కనీసంగా మావైపు చూడలేదు.

"వూర్లో బాధ్యతగల కుటుంబానికి చెందిన వాడివి అయినప్పటికీ వూర్లోని చావుని లక్ష్యపెట్టకుండా విలాసంగా వేటకు వెళ్తున్నావు. ఇక పక్కనుండి వెళ్తున్న ఈ అల్పజీవుల్ని నువ్వేలా పట్టించుకుంటావు? అయినా నీలో ఈ గుణం ఎన్నాళ్లు వుంటుందో నేను చూస్తాను" రాయిలో సైతం నా ప్రేమ రాగాలు పలికించగలదనే ఆత్మవిశ్వాసంతో మళ్లీ మనసులోనే అనుకుంటూ గేటు దాటాక యథాలాపంగా అన్నట్టుగా ఒకసారి వెనుతిరిగి చూశాను.

ఈమారు నల్లని కళ్లద్దాలు ధరించి నేరుగా ముందుకే చూస్తూ కనిపించాడు ధీరేంద్ర. ఆ నల్లని కళ్లద్దాల వెనక అతడి చూపులు ఎక్కడ చూస్తున్నాయో తెలియదు కానీ నీ చూపులు నన్ను తాకివుండాలి అని కోరికగా నాలో నేనే అనుకున్నాను.

ఇంటికి వెళ్లేసరికి నేను అనుకున్నట్టుగానే నాన్న నిండుగా తాగి కనిపించాడు. పరిస్థితులు అసలే తుఫానులా వున్నాయి. ఆ తుపానులో భూకంపంలా వున్న నాన్న తీరుకు నాలో ఆవేశం ఒక్కసారిగా లావాలా ఎగజిమ్మగానే అమ్మవైపు చీకాకుగా చూస్తూ "ఈ మనిషిని పెళ్లి చేసుకున్నావు సరే! కాపురం చేసి ఇంత మంది పిల్లల్ని ఎలా కనగలిగావమ్మా? " విసురుగా అడిగాను.

నా మాట అలా పూర్తయ్యిందో లేదో కానుగ చెట్టు నీడలో నేలపైనే పడుకుని వున్న వాడల్లా ఒక ఉదుటున లేచి కూర్చుంటూ "తండ్రితో ఏం మాట్లాడాలో, ఎట్లా మాట్లాడాలో నీకు నీ సదువు కూడా నేర్పలేదు. అందుకే బజారుమనిషిగా జనాల నోర్లల్లో నానుతున్నావు. థూ... నీయమ్మా! ఇంటా వంటాలేని మచ్చ వచ్చి కొంపమీద పడింది. ఇంక మనమంతా బతకడం దేనికి? " తాగిన మత్తులో ఒంకరటింకరగా నోరును తిప్పడం మాత్రమే కాదు తన మనసును కూడా తిప్పాడు నాన్న.

నేను అందుకు ఏం మాట్లాడలేదు. కళ్లల్లో నీళ్లు గిర్రున తిరుగుతుంటే వేగంగా ఇంట్లోకి నడిచాను.

"ఆ పిల్ల మాట్లాడిన మాటలో ఎంతమాత్రం తప్పులేదు. నీ నోట్లో మన్నుబడ! పిల్లను మనసు విరగ్గొట్టి మాట్లాడుతున్నావు? " పరిస్థితులు అన్నివిధాలా పీడిస్తూ తనలోని సహనాన్ని సమూలంగా నాశనం చేస్తుంటే నాన్నకు తీవ్రంగా ఎదురుచెప్పిన అమ్మ ఆ వెంటనే నా వెనుక పరుగెట్టుకు వచ్చింది.

నేను ఏదైనా చేసుకుంటానేమోననే ఆత్మ

తతో లోపలికి పరుగెట్టుకు వచ్చిన అమ్మ నేను ఇంట్లో మంచంపై కూర్చుని వుండటం చూసి గుండెల నిండా ఊపిరి పీల్చుకుంటూ "మీ నాన్న మాటల్ని నీవేం పట్టించుకోవద్దు. మంచి అయినా చెడు అయినా నీకు నేను వున్నాను" వచ్చి నా పక్కగా కూర్చుని అభయపూర్వకంగా నా భుజాల చుట్టూ చేయివేసింది అమ్మ.

"నాన్ననేకాదు, ఈ సమస్యల్ని కూడా నేను పట్టించుకోవడం లేదమ్మా! ఎందుకంటే నేను ఏ తప్పు చేయలేదు కాబట్టి ఎప్పటికయినా నేను గెలుస్తాను" స్థిరంగా మాట్లాడాను. అయినప్పటికీ మరోసారి కళ్ల నీళ్లు ఉబికాయి.

"అంత ధైర్యం వున్నదానికి ఆ ఏడుపు ఎందుకు వస్తోంది? " నా కళ్లు తుడుస్తూ అడిగింది అమ్మ.

"ఎంతయినా చిన్నదాన్నికదా! అందుకే" అన్నాను.

అందుకు అమ్మ ఇంకేం మాట్లాడలేదు. కాని నా తలను లాలనగా నిమురుతూ తన ఒడిలోకి ఆప్యాయంగా తీసుకుంది. అమ్మ ఒడిలో ఏదో ఉపశమనం నిండుగా తోయగానే అలాగే అక్కడే పడుకుని హాయిగా కళ్లు మూసుకున్నాను.

అమ్మ నన్ను ఒకవేళ తిట్టినా కొట్టినా ఆ రెండు చర్యల్లో కన్నతల్లే వుంటుంది తప్ప నాన్నలా కర్కశం వుండదు. నిజంగా తాగినప్పుడు ఒకలా తాగనప్పుడు ఒకలా ప్రవర్తించే ఆ సెల్ఫ్‌కంట్రోల్ లేని వ్యక్తికి కూతురిగా పుట్టడం అనేది నా ఒక్కదానికే కాదు చెల్లెళ్లు, తమ్ముడు అందరికీ కూడా ఓ భరించరాని దురదృష్టం. కాకపోతే అనుబంధం అనే మమకారానికి ఎప్పటికప్పుడు అసహాయంగా రాజీపడిపోతూనే వున్నాను. వున్నాము!

కాసేపటి తర్వాత నాన్న లేచి కూలిపనికి వెళ్లాడు. మేము దొరబాబు ఇంటివద్ద నుండి వచ్చేసరికే తమ్ముడ్ని· నిద్రపుచ్చి చెల్లెళ్లు అందరూ స్కూలుకి వెళ్లారు. ఇక నేను మాత్రం స్కూల్ ముఖం చూడక ఎన్నో యుగాలు అయిపోయినట్లుగా అన్పిస్తుంది. అయినా గాని నేను పట్టించుకోవడంలేదు. కాలం నన్ను ఎంత కసిగా శిక్షించాలని ప్రయత్నించినా నేను ఓడిపోనని నాకు తెలుసు. అందుకే కూర్చున్న దాన్నల్లా అలాగే వెనక్కి జారగిలబడి పడుకుని ఆ పక్కగావున్న గూట్లోంచి నా ఓ పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాను.

అంతలో ఇంటికి పోలీసులు వచ్చారు. రామేశ్వరంగాడి విషయమై నన్ను స్టేషన్‌కి రమ్మన్నారు. అనూహ్యమైన సంఘటనకు ఒక్కసారిగా నివ్వెరపోయాను. అమ్మ మాత్రం ఇక ఏకంగా పెద్దపెట్టున ఏడుస్తూ ఏ ఉపద్రవమో ముంచుకొచ్చినట్టుగా ప్రవర్తించసాగింది. క్షణాల్లో ఇరుగు పొరుగు పోగయ్యారు. నేను పద్మవ్యూహంలో చిక్కుకుపోయిన సాధారణ జీవిని కాబట్టి అటు పోలీసులు, ఇటు జనాలు నన్ను ఒక నేరస్థురాలిగా తమ చూపుల్తోనే కాల్చి వేస్తుంటే కూడా నోరుమెదపలేని దీనురాలిగా నిలబడిపోయాను. తోడుగా మమ్మల్ని ఆదుకునే దొరబాబు వూర్లోలేరు.

"ఇంకా ఏం నిలబడ్డావ్? పద పదా" నా చేయి పట్టుకోడానికి వచ్చాడు ఒక కానిస్టేబుల్.

నేను చప్పున దూరం జరిగాను.

"ఓ సీతాకుమారీహై" వెక్కిరింతగా గుణుగుతూ నన్ను అపాదమస్తకం ఓమారు కలియజూశాడు ఆ కానిస్టేబుల్.

"ఇంకేం ఆలస్యం చేయొద్దు. ఏమైనా మాట్లాడాలనుకున్నా స్టేషన్‌లోనే. ఇక్కడ ఏం కుదర్దు" అంటూ ఇంకో కానిస్టేబుల్ మొదటి కానిస్టేబుల్‌ని దాటుకుని ముందుకు వచ్చి అనూహ్యంగా నా చేయి పట్టుకుని ముందుకు లాగాడు.

"వస్తాను వదలండి" ఒక్కసారిగా గట్టిగా అరిచాను.

"ముట్టుకుంటేనే అంత రోషమా?" చివాలున చూశాడు అతడు.

నేను అతడివైపు అసహాయమైన కోపంతో చూస్తూ "మర్యాదగా ప్రవర్తించండి" రెట్టింపుగా అన్నాను.

"అట్లాగే" వ్యంగ్యంగా అన్నాడు.

నేను ఇంకేం మాట్లాడలేదు. తెగువగా ముందుకు నడిచాను. వెనక నుండి అమ్మ గగ్గోలు పెడుతోంది. నేను కనీసంగా తిరిగి చూడలేదు. అమ్మకు ధైర్యం చెప్పి వెళ్దామనే ఆలోచన కూడా నాలోలేదు. వెళ్లి పోలీసు జీపు వెనక భాగంలో ఎక్కి కూర్చున్నాను. అమ్మ వున్నట్టుండి ఒక్కసారిగా జీపు వద్దకు పరుగెట్టుకు వచ్చి "బిడ్డా... ఎంత పాపం చేసుకున్నామే మనము? ఎవ్వరికీ లేని ఖర్మ మనకే వుంది కదమ్మా" నా వైపు దైన్యంగా చూస్తూ ఆకాశానికేసి చేతులు జోడించింది.

ఈమారు నాలో దుఃఖం ముంచుకొచ్చింది. కాని ఏడవలేదు. పళ్లు బిగువున వచ్చే దుఃఖాన్ని అణిచిపెట్టుకుని చప్పున లోపలివైపుకు తిప్పుకున్నాను.

"సారూ... నా బిడ్డ పెళ్లి కావాల్సిన పిల్ల. దాన్ని ఠాణాల వెంబడి తిప్పితే దానికి బతుకు వుండదు. మీ కాళ్లు మొక్కుతానయ్యా. నా బిడ్డను తీసుకు వెళ్లొద్దు. అడిగే ప్రశ్నలు ఏవైనా ఇక్కడే అడగండి. ఇక్కడే కొట్టండి." వచ్చిన పోలీసుల్ని ఆవిధంగా అమ్మ వేడుకోవడం ఎన్నవసారో గుర్తుకు లేదు కానీ ఈసారి మాత్రం ప్రాధేయపడుతున్న అమ్మలో తెలియని కసి పెల్లుబికింది. కాబట్టే ఒక్కసారిగా జీపులోంచి నా చేయిపట్టి కిందికి లాగబోయింది. ఆ తోపుకి నేను సగం వరకు కిందికి జారాను. అంతలో వేగంగా మా దగ్గరకి పరుగెట్టుకు వచ్చిన మరో కానిస్టేబుల్ నన్ను తన రెండు చేతుల్తో లోపలికి నెట్టి ఆ మరుక్షణం అమ్మ చెంపని చెళ్లుమనిపించాడు.

వాడు నన్ను తోసిన తోపుకి నా కణత పగిలిన సంగతిని నేను పట్టించుకోలేదు కాని వాడి చెంప దెబ్బకు అమ్మ ఎగిరి అల్లంత దూరం పడగానే

నేను నా విచక్షణని కోల్పోయానో లేక అనురాగానికి విలవిలలాడిపోయానో తెలియదు కాని నాకు తెలియకుండానే జీపులోంచి కిందకి దూకుతూ "ఒరేయ్ లంజాకొడకా" పరిసరాలు ప్రతిధ్వనించేలా అరిచాను.

నా ఆవేశం ఆ ముగ్గురి కానిస్టేబుళ్లల్లో తీవ్రమైన కోపాన్ని తెప్పించింది. ఫలితంగా ఆ మరుక్షణమే నన్ను మెరుపువేగంతో చుట్టుముట్టడం, నన్ను అమాంతంగా ఎత్తి జీపులోపలికి బలంగా విసిరినట్టుగా పడవేయడం, తర్వాత జీపువెనకున్న గుడ్డపరదాను కిందికి సరిచేయడం, ఆ తర్వాత ఆ ముగ్గురూ జీపు ఎక్కి కూర్చోవడం, జీపు ముందుకు జరగడం అంతా క్షణాల్లో జరిగిపోయింది.

ఆ వెధవలు విసిరిన విసురికి నా నడుములు బహుశా విరిగిపోయాయేమో నాకు తెలియడం లేదు కాని, లేచి సరిగ్గా కూర్చునేందుకు నాలో వున్న శక్తి సరిపోవడం లేదు. అందుకే రెక్కలు తెగిన పక్షిలా అలాగే ఒక మూలకు పడివున్నాను. నా పరిస్థితికి నాకు ఏడుపురావడంలేదు. అన్యాయంగా అనుభవిస్తున్న నా బాధకు ఫలితంగా అందరినీ బాధపెట్టాలనే ఉన్మాదం నాలో మహాసముద్రమై పొంగుతుంటే... ఆ ఉన్మాదాన్ని అణిచివేసే ప్రయత్నంగా పిడికిళ్లు బిగించుకుని బిగ్గరగా కళ్లు మూసుకుని కొంతసేపటివరకు అలాగే కదలకుండా పడివున్నాను.

"ఏయ్... ఉన్నావా? పోయినావా?" వున్నట్టుండి తన బూటు కాలితో నా వీపు భాగాన్ని తన్నుతూ అన్నాడు ఒకడు.

"ఏయ్ పోరీ" మరొకడు నా చేయి పట్టి పైకిలాగాడు.

నేను ఆ ఇద్దరివైపు నిశ్చలంగా చూస్తూ సీటుపై అలాగే జారగిలబడ్డాను. ఆ స్థితిలో

నా శరీరంలోని బాధ నాకు క్రమంగా తెలిసిరాసాగింది. ఆ బాధకు ప్రతిచర్యగా "అ...మ్మా..." శక్తిరహితంగా మూలిగాను. ఆ సమయంలో పెదవులు కదపడం కూడా భారంగా తోచి బాధను కలిగించగానే అప్రయత్నంగా చెంపల్ని తడుముకున్నాను.

కుడిపక్క పెదవి మూల చిట్లి రక్తం ధారగా కారివుంది. అలాగే కణత దగ్గర చర్మం చిట్లివుంది. ఇకా ఎక్కడెక్కడ ఏమేమి గాయాలున్నాయో? అదంతా ఇప్పుడు అనవసరం. ఆలోచించాల్సింది ఒక్కటే, అది ఏంటంటే... ప్రస్తుతం నా మీద పెరిగిన కోపం కొద్దీ ఈ పోలీసులు నన్ను స్టేషన్‌కి తీసుకువెళ్ళాక ఉద్దేశ్యపూర్వకంగా చిత్రహింసలు పెడతారేమో? తోడుగా ఆడపిల్లను ఒంటరిగా దక్కాను కాబట్టి ఏమైనా చేస్తారేమో? అసలే రోజులు బాగోలేవు. రక్షకభటులే భక్షకభటులుగా మారిపోయారంటూ కొందరి పోలీసుల పాశవిక ప్రవృత్తుల గురించి తరుచూ పేపర్లో టీవీల్లో చూస్తూనే వున్నాను. మరి ఇప్పుడు ఈ పోలీసులు కూడా ఆ కొందరిలో ఒకరు కారు కదా!?

అన్యాయంగా దగా పడిపోతానేమోననే భయంకొద్దీ క్రమంగా నా శరీరం గజగజా వణకడం ఆరంభమయ్యింది. ఆ వణుకు ఫలితంగా కాళ్లూ చేతులూ అచేతనంగా మారిపోయాయి. అందుకే స్టేషన్‌ని సమీపించాక నా అంతట నేను జీపు దిగలేకపోయాను. ఓ కానిస్టేబుల్ నన్ను తన అరచేతుల మీదుగా లాక్కుని జీపు దింపాడు. ఆ సమయంలో వాడు నన్ను తాకరాని చోట్లల్లా తగిలాడు. అది కావాలనే తగిలినట్టుగా వాడి వాలకమే చెబుతోంది. అర్థమైనా కూడా నేను కిమ్మనలేదు.

దారి తప్పిన పక్షి తిరిగి గూడును ఎలా చేరుకుంటుందో తెలియనట్టుగా, నేను మళ్ళీ ఇంటికి ఎలా చేరుకుంటానో కూడా ఆ స్టేషన్ పరిసరాల్ని చూడగానే నాకు తెలియకుండా పోయింది. ముఖ్యంగా పోలీస్‌స్టేషన్ మెట్టు ఎక్కడమంటేనే సగం ప్రాణం పోయినట్లుగా భావిస్తుంది ఈ సమాజం. అలాంటిది హత్యానేరం విషయమై నేను పోలీస్‌స్టేషన్‌కి వచ్చానంటే రేపటి నా పరిస్థితి నిజంగా ఏమిటి?

పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి వచ్చినదాన్నంటూ పెదబాబు దృష్టిలో నా స్థానం ఎలా వుంటుంది? హీనంగా వుంటుందా? జాలిగా వుంటుందా? అసలు ఏమిటీ విషమపరీక్ష? శతృవు మరణం సంతోషాన్ని కలిగిస్తున్నా, ఆ సంతోషాన్ని ఆమడదూరం నెట్టేస్తున్న పరిస్థితులు నన్ను ఇంకెంత దూరం తీసుకువెళ్తాయి?

ఆలోచిస్తూ ఒక్కో అడుగు నెమ్మదిగా ముందుకు వేస్తూ స్టేషన్‌లోపలికి నడిచాను. నన్ను తీసుకువచ్చిన ఆ ముగ్గురు కానిస్టేబుళ్లు కూడా నా వెంటే నడిచారు.

"సారు వచ్చేవరకు ఇక్కడే కూర్చో పక్కకు కదలొద్దు" లోపలికి వెళ్ళాక వెంటే వచ్చిన కానిస్టేబుళ్లలో ఒకడు చెప్పాడు.

సరే అన్నట్లుగా తలూపి వెళ్ళి ఒక మూలగా నేలపైనే దగ్గరగా ఒదిగి కూర్చున్నాను. శరీరమంతా బాధగా నీరసంగా వుండటంవల్ల అక్కడే పడుకోవాలనిపిస్తోంది. కాని ఏమంటారో అనే భయంకొద్దీ బిక్కుబిక్కుమంటూ అలాగే కూర్చుండిపోయాను.

"నీ లవ్వర్ పేరేంటీ? " వున్నట్టుండి అమ్మను చెంపదెబ్బకొట్టిన కానిస్టేబుల్ నావైపు వెకిలిగా చూస్తూ అడిగాడు.

నేను విస్తుపోయి చూస్తూ "ఊరి జనాలు తమ అనుమానాన్ని ఈ వెధవలతో చెప్పినట్లున్నారు. వీళ్లు అదే నమ్ముతున్నట్టున్నారు' ' మనసులోనే అనుకున్నాను.

"ఏం అట్లా చూస్తున్నావు? మింగుతావా? " ఇంకో కానిస్టేబుల్ గొంతులో వెక్కిరింత.

"పూలన్‌దేవిని అనుకుంటోంది కాబోలు" మరో కానిస్టేబుల్ గొంతులో వ్యంగ్యం.

నేను మాత్రం కిమ్మనలేదు. నాకూ రామే శ్వరంగాడికి మధ్యన గొడవలు వున్నాయి కాబట్టి, నన్ను ప్రశ్నిస్తే వాడి హత్య విష యానికి సంబంధించిన తగు సమాచారం దొరకవచ్చని భావిస్తూ, నన్ను ఇక్కడికి తీసు కువచ్చారని అనుకున్నాను. కాని వాడి హత్యతో నాకేదో సంబంధం వున్నట్టుగా వీళ్లు భావిస్తున్నారు. ఇదేం దురదృష్టం? ఇందాకటివరకు స్టేషన్‌కి రావడంలో తల వంపులేదు. హత్యానేరాన్ని మోయడంలోనే అన్నింటికి మించిన నరకం వుంటుందని నా మానసిక పరివేదనలో ప్రత్యక్షంగా అర్థమౌ తుంటే... "భగవంతుడా చివరికి నా జీవి తాన్ని ఏం చేస్తావు తండ్రీ?" దీనంగా నాలో నేనే ప్రశ్నించుకున్నాను.

"ఏ... ఏం మాట్లాడవు? నీ ప్రియుడికి చెప్పి మాక్కూడా స్పాట్ పెట్టించాలనుకుం టున్నావా?"

"సినిమా హీరోయిన్‌లా ఫోజు ఇవ్వొద్దు. నీకు అంత సీన్ లేదుగాని నిన్ను వుంచుకు న్నవాడి పేరు మర్యాదగా చెప్పేసేయ్. సార్ వచ్చాడంటే నిన్ను ఇలా మంచి మాట లతో అడగడు. ఆడపిల్లవి అని కూడా చూడకుండా ఎముకలు విరగొట్టి అడుగు తాడు"

"అందుకే వాడి పేరేంటో నక్రాలు చేయ కుండా చెప్పు"

ఒకరితర్వాత ఒకరు పొగరుగా, పచ్చిగా మాట్లాడుతూపోయారు. ఇక నేను ఈ మారు మౌనంగా వుండదలుచుకోలేదు.

"నాకు లవ్వరు ఎవ్వరూలేరు" స్థిరంగా చెప్పాను.

"మరి ఆ కోమటోళ్ల పిల్లవాడ్ని ఎవ్వరి చేత...?" అర్థాంతరంగా ప్రశ్నిస్తూ నావైపు మింగేసేలా కళ్ళింతచేసి చూశాడు. 'వుంచు కున్నవాడు' అంటూ బండబూతు మాట్లా డిన కానిస్టేబుల్.

అంతలో స్టేషన్‌లోపలికి వచ్చాడు సబ్ ఇ న్స్‌పెక్టర్ ఆఫ్ పోలీసు. అతడ్ని చూడగానే ఆ ముగ్గురు అప్రమత్తమయ్యారు. నేను మాత్రం చేతకాని పరిస్థితిలో వున్నందున కనీసంగా లేచి నిలబడలేకపోయాను కూడా!

"అమ్మాయిని తెచ్చాం సర్. ఇదిగో ఇక్కడే వుంది" తన కుర్చీలో ఉసూరుమంటూ కూర్చుంటున్న ఎస్సైకి నన్ను చూపించాడు ఇందాకటి కానిస్టేబుల్.

ఎస్సై నన్ను ఒకమారు పరిశీలనగా చూశాడు. అతడు ఇందాకటి వరకు ఎక్క డికి వెళ్ళొచ్చాడో తెలియదు కాని చూడ్డానికి మాత్రం కొంత అలసిపోయినట్టుగా కనిపి స్తున్నాడు. కాగా అతడి గంభీరత మాత్రం ఎదుటివాళ్ళను ఇట్టే భయపెట్టేదిగా కని పిస్తూంది...

"ఇంకెన్ని కష్టాలు వచ్చినా కూడా నేనూ ఎదుటివాళ్లకు అలాగే కనిపించాలి" ఎస్సైని అలాగే చూస్తూ మనసులోనే అనుకు న్నాను.

"మరి ఈ అమ్మాయిని ఇక్కడ కూర్చోబెట్టా రేంటి? లోపల లాకప్‌లో కూర్చోబెట్టండి. ఎందుకంటే... ఆ అబ్బాయి శవంతో పాటుగా వస్తున్న వాడి కుటుంబం బంధు వులు అందరూ ఇక్కడ ఈ అమ్మాయిని చూసి ఆవేశంకొద్దీ ఏమైనా చేసినా చేయొచ్చు" నన్ను అలాగే చూస్తూ ముందు జాగ్రత్తగా కానిస్టేబుళ్లకు ఆదేశించాడు ఎస్సై.

ఆ మాటలు వినగానే నా గుండెల్లో ఒక్క సారిగా భయాందోళనలు చెలరేగాయి. వాళ్లు నిజంగా నన్ను ఏమైనా చేయాలనే సంకల్పంతో వున్నారో లేక కేవలం జాగ్రత్త కోసమని ఎస్సై అలా చెప్పాడో నాకు ఎటూ అర్థంకాలేదు. కాని నాలో భయం మాత్రం తారాస్థాయికి చేరుకుంది. అయినప్పటికీ భయాన్ని కన్పించనీయకుండా స్థిరంగా వున్నాను.

కాసేపటి తర్వాత రామేశ్వరంగాడి శవాన్ని స్టేషన్‌కి తీసుకువచ్చారు. అప్పటికి నేను లాకప్‌లో వున్నాను. వాడి తాలూకు వాళ్ళంతా గుండెలు పగిలేలా రోదిస్తూ,

అన్యాయం చేసావంటూ భగవంతుడ్ని నిందిస్తున్నారు. నేను ఎవ్వరికీ కనిపించ కుండా ఓ పక్కగా నక్కి అంతా గమని స్తూనే వున్నాను. వాడి శవాన్ని సుమారుగా ఓ అర్ధగంట సేపు అక్కడే వుంచారు. ఆలోపు పత్రికా విలేకరులు ఫోటోగ్రాఫర్లు వచ్చి విషయాన్ని రాసుకుని, ఫోటోలు తీసు కున్నారు. ఆ సమయంలోనే వాళ్లకు నామీద అనుమానం వుందని తేటతెల్లమైపో యింది.

"నా కొడుకుని చంపించింది ఎవరో కాదు, మా వూరి ఆడదే! అది సామాన్యమైనది కాదు. అది తన ప్రియుడితో కలిసి వున్న ప్పుడు నా కొడుకు చూశాడని అది ఇంత పని చేయించింది" రామేశ్వరంగాడి తల్లి పెద్దపెట్టున ఏడుస్తూనే అరిచింది.

ఎందుకో మరి ఆ మాటలు వింటున్నా కూడా నాలో ఈ మారు ఎలాంటి బాధగాని, భయంగాని కలగలేదు. మనసు అమాను ష్యంగా అచేతనంగా మారిపోయింది. కాబట్టే వాడి శవాన్ని పంచనామా కోసం అట్నుంచి తీసుకువెళ్లాక సైతం నేను ఆ మాటల గురించి అస్సలు ఆలోచించలేదు.

సాయంకాలం కావొస్తుందనగా ఎస్సై జీపు వచ్చి స్టేషన్‌ముందు ఆగింది. ఆ వెనకే దొరబాబు కారు వచ్చి ఆగింది. దొర బాబు కారు చూడగానే నా కళ్లు మెరి సాయి. ఉదయం స్టేషన్‌కి వచ్చింది మొదలు ఇంతవరకూ ఏమీ తినని నాలో దొరబాబుని చూడగానే ఏదో తెలియని కొత్తశక్తి బయలుదేరిన భావన కూడా కలి గింది. అందుకే దొరబాబునే చూస్తూ అప్ర యత్నంగా మెల్లగా లేచినిలబడ్డాను.

"ఏమ్మా ఏమైనా తిన్నావా?" అడిగాడు ఎస్సై.

లేదన్నట్లుగా తల అడ్డంగా ఆడించాను. అర్థంచేసుకున్న ఎస్సై తన వెనకే వున్న కానిస్టేబుళ్లవైపు ప్రశ్నిస్తున్నట్లుగా చూశాడు.

"సారీ సర్" ముందుగా క్షమార్పణలు చెప్పుకుని "ఉదయంనుండి మీ వెంటే ఆ పల్లెలో వున్నాం. మధ్యలో కాసేపు ఈ అమ్మాయిని ఇక్కడికి తీసుకువచ్చేవరకే ఇక్కడున్నాం. ఆ తర్వాత మళ్ళీ మీ వెంటే వచ్చాం" భయం భయంగానే చెప్పుకుపో యాడు నాతో వీరలెవెల్లో ప్రవర్తించిన ఓ కానిస్టేబుల్ కాగా మిగతా ఇద్దరు పెద వులు విప్పకపోయినా వారి ముఖాల్లోనూ భయం స్పష్టంగా కనిపిస్తోంది.

"ఉదయంనుండి చచ్చినోడి వెంట వున్నంత మాత్రానా ఈ బతికి వున్నోళ్లను కూడా చంపుకోవాలా? షరంలేకపోతే సరి! ప్లేటు భోజనం తెప్పించండి. అట్లాగే సారొచ్చాడు కాబట్టి స్ట్రాంగ్ కాఫీ, స్నాక్స్ తెప్పించండి" కానిస్టేబుళ్లకు పురమాయించి "రండి సర్... రండి" అతి వినయం ప్రద ర్శిస్తూ వెనకే వచ్చిన దొరబాబుకు తన టేబుల్ ముందున్న కుర్చీ చూపించాడు ఎస్సై.

నేను అందరినీ గమనిస్తున్నాను. దొర బాబు వెళ్లి కుర్చీలో ఠీవిగా కూర్చున్నాడు. నామీద పీకలదాకా కోపం పెంచుకున్న ఆ కానిస్టేబుళ్లు నావైపు గుర్రుగా చూస్తూ బయటకి నడిచారు. వాళ్ళ చూపుల్లో దాగి వున్న "నీ కడుపును కావాలనే కాల్చామే" అన్న భావం నాకు చెప్పకనే అర్థమైంది. కాని అదేమీ నేను పట్టించుకోలేదు. తేలిగ్గా తీసిపారేస్తూ ఇటువైపు చూశాను.

టేబుల్‌మీద గ్లాస్ రాడ్‌ని గంభీరంగా తిప్పుతూ నిశ్శబ్దంగా కూర్చుని వున్నాడు దొరబాబు.

"ఆ... చెప్పండి సార్" అంటూ తన తల మీది క్యాప్ తీసి టేబుల్‌మీద పెట్టి, తన తాలూకు కుర్చీని కాస్త జరుపుకుని కూర్చుం టున్న ఎస్సైలో దొరబాబుమీది అపారమైన గౌరవం.

"ఈ అమ్మాయిని ఇక్కడికి ఎప్పుడు తీసు కువచ్చారు?" అదే గంభీరతతో అడిగాడు దొరబాబు.

"ఉదయం తీసుకువచ్చాం సార్" ఎస్సైలో కూడా అదే గౌరవం.

"ఉదయం? శభాష్!" అదో రెట్టింపుగా అని "సాయంకాలం కావొచ్చినా ఆ విష యాన్ని మీరు నాతో చెప్పలేదు. ఇక్కడికి వచ్చాక నేనే తెలుసుకోవాల్సి వచ్చింది" అధి కారికంగా అన్నాడు దొరబాబు.

"సారీ సార్" అంతకన్నా చెప్పుకోలేకపో యాడు ఎస్సై.

"ఇట్స్ ఓకే! బట్ షి ఈజ్ ఏ గాళ్, అండ్ స్టూడెంట్" గుర్తుచేస్తున్నట్టుగా అని "మెయిన్ థింగ్ అన్‌మ్యారీడ్. నో... అరెస్ట్ చేసేముందు కొద్దిగా ఆలోచించా ల్సింది" తీవ్రంగా అన్నాడు దొరబాబు.

"నేరారోపణ వున్నప్పుడు అందుకు పరిస్థి తులు కూడా అనుకూలంగా వున్నప్పుడు చట్టం ప్రకారం ఆడా మగా అంటూ ఆలో చించడం అవసరం లేద్సార్! సో సారీ..." దొరబాబుకి వ్యతిరేకంగా మాట్లాడినప్పటికీ, సలక్షణమైన గౌరవాన్ని సంపూర్ణంగా తన తీరులో పలికించాడు ఎస్సై.

"యూ మీన్?" ఆ తక్షణమే దొరబాబు భృకుటి తీక్షణంగా ముడిపడింది.

"ట్రైటూ అండర్‌స్టాండ్‌మీ సార్" తన కుర్చీలోంచి కాసింత ముందుకు వంగి దొర బాబుకి సర్దిచెప్పుకోబోయాడు ఎస్సై.

"ఓకే ఓకే!" అంటూ తల పంకించి "ఇప్పుడు నన్ను ఏం మాట్లాడుమంటారు? హత్య గురించి మాట్లాడమంటారా? అరెస్ట్ గురించి మాట్లాడమంటారా?" సూటిగా అడిగాడు దొరబాబు.

ఎస్సై వెంటనే ఏం చెప్పలేకపోయాడు. "సార్..." అంటూ కాస్త తడబడ్డాడు. అందుకు దొరబాబే మళ్ళీ కల్పించుకుంటూ "ఇద్దరూ నా వూరి వాళ్ళే, నా వాళ్ళే! అలాగని ఎటూ చెప్పలేక నేను తప్పుకోవడమంటే అది మర్యాదా అన్పించుకోదు, పెద్దరికం అన్పించుకోదు. విషయం ఎంత టఫ్‌గా వున్నా సరే నేను ఇప్పుడు న్యాయంగా ప్రవ ర్తించాలి. అటు నిండు ప్రాణం పోయింది. ఇటు నిండు భవిష్యత్తుకు ఆటంకం కలిగే ప్రమాదం వుంది. అఫ్‌కోర్స్!" అని కాసేపు ఆగి "పోయిన ప్రాణం ఎలాగూ తిరిగి రాదు. సో... వున్న ప్రాణాన్ని కాపాడుకో వాల్సిన బాధ్యత ఎంతయినా వుంది. ఇలా అంటున్నానని... న్యాయం మాట్లాడి అన్యా యంవైపు వెళ్తున్నాను అని మాత్రం అనుకో వద్దు. ఇప్పుడైనా మరెప్పుడైనా ఇద్దరి విష యంలో నాది ఈక్వల్ జడ్జిమెంట్" అన్నాడు దొరబాబు.

ఎస్సై దొరబాబు వైపు అర్థంకానట్టుగా చూస్తున్నాడు. ఎస్సైకే కాదు, నాక్కూడా దొరబాబు వరస అర్థంకాలేదు. ప్రత్యర్థులు ఇద్దరైనప్పుడు ఎవరో ఒకరు గెలవడం, మరొకరు ఓడిపోవడం, తప్పనిసరి. కాని దొరబాబు మాత్రం ప్రత్యర్థులు ఇద్దరినీ గెలి పిస్తానంటున్నాడు. ఇదెలా సాధ్యం? వాస్త వానికి నేను నిర్దోషిని. కాని లోకానికి ఆ వి షయాన్ని రుజువుచేసి చూపెట్టాలీ అంటే అందుకు కొంత సమయం కావాలి. ఆ లోపు సమయంలో నేను ఓటమిలాంటి బాధను అనుభవించాలి. కాని దొరబాబు ఆ మాత్రం బాధను కూడా నేను అనుభవిం చడానికి వీల్లేదన్నట్లుగా మాట్లాడుతున్నాడు. అందుకే దొరబాబు వైఖరి ముందు నేనొక ప్రశ్నగా మారి అలాగే నిలబడిపోయాను.

"మీకు ఏం అర్థంకాలేదు కదా?" అర్థం చేసుకున్నట్లుగా అని "మరేం లేదు. మీ వాళ్లు ఐమీన్ మీ పోలీసువాళ్లు ఈ అమ్మాయి విషయంలో పొరబడ్డట్లుగా ఈ అమ్మాయి నిర్దోషి అన్నట్లుగా ఇమ్మిడియట్లీ ఇంటికి పంపించేయాలి" నియంతలా అన్నాడు దొరబాబు.

"సా...ర్" ఒక్కసారిగా కళ్ళంత చేశాడు ఎస్సై.

"యా! మిస్టర్ ఎస్సైజీ! ఈ విషయంలో మీరు ఆలోచించాల్సింది నథింగ్" అన్నాడు దొరబాబు.

నేను ఒక్కసారిగా ఆకాశమంత ఆశ్చర్యపోయాను. ఎందుకంటే... ఒక క్రిమినల్ కేసు విషయంలో పోలీసుల జోక్యాన్ని అడ్డుకునే హక్కుగాని ధైర్యంగాని ఇతరులకు వుండకూడదు. కాని ఆ హక్కును, ధైర్యాన్ని దొరబాబు చాటుకుంటున్నాడు. వాస్తవం చెప్పాలంటే... పోలీసులు నన్ను తీసుకురావడంలో అర్థంవుంది. ఇలాంటప్పుడు ఒక్క డాక్టరు పరీక్ష మాత్రమే నన్ను నిర్దోషిని చేయలేదు. నేను నిర్దోషిని అనడానికి అదొక బలమైన ఆధారం మాత్రమే. ఆ తర్వాత కొన్ని ఎంక్వయిరీలు, కొన్ని ప్రశ్నలు, అవమానాలు, ఆ తర్వాతే నేను అగ్నిలో తడిసి అద్భుతంగా మలచబడిన స్వర్ణంలా నిరపరాధినై నిండుగా ఉపిరిపీల్చుకుంటాను. ఆలోపు ఒకవేళ నిజమైన హంతకులు ఎవరో దొరికితే కష్టపడకుండానే నేను కరుణింపబడతాను. కాని ఇవేమీ అవసరం లేదన్నట్టుగా మా దొరబాబు నా క్షేమంకోసం తాపత్రయపడుతుంటే అప్రమేయంగా నా కళ్లల్లో నీళ్లు గిర్రున తిరిగాయి.

"అంటే? ఈ కేసును మీరు ఏం చేయాలనుకుంటున్నారు సార్" అడిగాడు ఎస్సై.

"అందరూ కూడా ఈ హత్యలో ఈ అమ్మాయి ప్రమేయంవుందని ఏవేవో మాట్లాడేస్తున్నారు. ఆ మాటల్ని మీరు పట్టించుకోవడంలో తప్పులేదు. కాని ఈ అమ్మాయి ఎలాంటిది అనేది నాకు బాగా తెలుసు. నా మాట మీది నమ్మకంతో మీరు ఇక ఈ అమ్మాయి గురించి మరిచిపోండి" చెప్పాడు దొరబాబు.

"మీరు చెప్పాక ఇక కాదంటామా సార్" వెనకా ముందు ఆలోచించకుండా దొరబాబు మాటలకు ఎస్సై తలాడించడంతో దొరబాబు పరపతి ఎలాంటిదో ద్యోతకం కావడం తెలిసిన విషయమే అయినప్పటికీ, అందులో సునిశితంగా ఆలోచిస్తే న్యాయన్యాయాలు అనేవి కొంత హీనంగానే అగుపిస్తున్నాయి. ఎలా అంటే... ఒకవేళ వాడి హత్యతో నాకు నిజంగా ప్రమేయం వున్నా దొరబాబు పలుకుబడి నన్ను ఇలాగే రక్షించేది మరి!

నా మాటప్రకారం ఈ అమ్మాయిని వదిలిపెట్టడం పక్కకు పెట్టేస్తే, ఇక ఆ అబ్బాయి పోస్టుమార్టం రిపోర్ట్సు ప్రకారం చనిపోవడానికి ముందు అబ్బాయి సారా సేవించి వున్నాడు. సో... తాగే సమయంలో సారా దుకాణం వాడికీ వీడికీ ఏమైనా గొడవ జరిగిందా? జరిగితే ఎందుకు జరిగింది? ఒకవేళ జరగకపోతే ఆ సారా దుకాణం నుండి వీడు ఎవరెవరితో కలిసి బయటకు వచ్చాడు? అనే విషయాల ఆధారంగా కేసును టేకప్ చేయండి" ఎక్స్‌రే కన్నులతో సమాజాన్ని గాలించే పోలీసువ్యవస్థకే ఒక సవాల్ అన్నట్టుగా తనే సూచనలు అందించాడు దొరబాబు.

"కరక్టే సార్! మీరు చెప్పిన విధంగానూ తర్వాత ఈ అమ్మాయి ఆధారంగానూ కేసు టేకప్ చేయాలనుకున్నాను. బట్ మీరు అమ్మాయిని వద్దంటున్నారు కాబట్టి ఒకే లైన్‌లో వెళ్ళిపోతాను" అన్నాడు ఎస్సై.

అంతలో భోజనం పార్సిల్, ఫాస్క్‌తో లోపలికి వచ్చాడు ఓ కుర్రాడు. సామాన్యంగా హోటల్ భోజనం అంటే నాకు చాలా ఇష్టం. కాని ఆ సమయంలో మాత్రం ఆ భోజనం విషయమై నాలో ఏ స్పందనా లేదు. ఆ కుర్రాడు ఎస్సై చెప్పగానే నాకు భోజనం పార్సిల్ తెచ్చి అందించాడు. అది తింటున్న సమయంలో కూడా నాకు ఎంతమాత్రం రుచించలేదు. ఇలాగని వదిలిపెట్టే ధైర్యం లేదు కాబట్టి బలవంతంగా నోట్లో కుక్కుకుంటున్నాను.

"అదేంటండీ? అమ్మాయిని ఇంకా లాకప్‌లోనే వుంచారు" కాఫీ తాగుతూ నావైపు ఒకమారు చూసి అన్నాడు దొరబాబు.

"వన్‌నాట్‌త్రీ" వెంటనే బయటకు కేకేశాడు ఎస్సై.

"సార్..." అంటూ ఆ నంబర్ తాలూకు కానిస్టేబుల్ వెంటనే లోపలికి వచ్చాడు.

నేను వున్న గదిని తెరవమన్నట్టుగా అతడికి తన తలతోనే సైగ చేసి చెప్పాడు ఎస్సై.

నేను భోజనం పార్సిల్‌తో పాటుగా వెలుపలికి వచ్చి కూర్చున్నాను. నేను కూర్చున్నచోటునుండి చూస్తుంటే బయట హాల్లో అటూ ఇటూ తిరుగాడుతున్న అక్కడక్కడ కూర్చుని వున్న కానిస్టేబుల్స్ అందరూ కనిపిస్తున్నారు. అందరూ కూడా కాఫీలు తాగుతున్నారు. కాని ఎవ్వరినీ కూడా నేను పెద్దగా పట్టించుకోలేదు. దొరబాబు నాకు తన పూర్తి సహాయసహకారాలు అందిస్తున్నాడు అనే ధీమా, నాలోని మనిషిని అచేతనలోంచి క్రమంగా తప్పిస్తుంటే నాలో చిక్కబడివున్న బాధల్ని నానుండి తప్పించే ప్రయత్నం నాకు నేనుగా చేసుకుంటూ భోంచేసి ఎంగిలిని బయట పడవేసేందుకు ఎస్సైకి ఎడంగా వున్న ద్వారంలోంచి బయటకు వెళ్లాను.

కాఫీ వచ్చాక సంభాషణ మారినప్పటికీ మధ్యమధ్యలో మళ్ళీ నా గురించి ఆ రామేశ్వరంగాడి గురించి మాట్లాడారు. కాగా నేను ఇప్పుడు బయటకి వెళ్ళగానే ఎస్సై నుండి వచ్చిన నా తాలూకు ప్రశ్న ఇందాకటికిమల్లే నాకు అనుకూలంగా కాకుండా నన్ను అయోమయంలో పడవేసింది. అందుకే అలాగే అక్కడే ఆగిపోయి అప్రయత్నంగా కనుబొమ్మలు ముడిచాను.

"ఈ అమ్మాయి నిజంగా నిర్దోషి అంటారా సార్" అడిగాడు ఎస్సై.

"ఆ విషయాలన్నీ మనం తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు దొరబాబు.

నాకు ఏమీ అర్థంకాలేదు. 'దొరబాబు తర్వాత ఏం మాట్లాడ్తాడు? ' కొంతసేపటివరకు నాలో నేనే ప్రశ్నించుకుంటూ, సమాధానంగా సూచాయగానైనా మరేమైనా మాటలు వినిపిస్తాయేమోనని అక్కడే నిలబడిపోయాను. కాని లాభం లేకపోయింది. అందుకే నెమ్మదిగా తిరిగి లోపలికి వచ్చి ఎప్పటి చోట కూర్చున్నాను. అప్పుడు గుర్తుకు వచ్చారు , నాకు నా కుటుంబ సభ్యులు. అలా గుర్తుకు వచ్చిన వెంబడే నా మనసు అదోలా మారిపోయింది. ఎందుకంటే... ఇంతసేపయినా నాకోసం నావాళ్లు ఒక్కరుకూడా ఇక్కడికి రాలేకపోయారు మరి! ఇలాగని నా వాళ్లమీద నాకు కోపం రావడంలేదు. ఆ శెట్టీవాళ్లకు భయపడో లేకా శెట్టీవాళ్లచేత భయపెట్టబడో, నావాళ్ళ పరిస్థితి ఎలా మారివుందో ఏమో అని ఎడతెరిపిలేని వర్షపుజోరులా నాలో కలవరం మొదలయ్యింది. అయినప్పటికీ బయటకు కనబడనీయకుండా అలాగే నిశ్శబ్దంగా మరో అరగంటవరకు కూర్చున్నాను. ఆ తరువాత దొరబాబు వెంటే బయటకు నడిచాను.

దొరబాబు కార్లోనే వూరికి వెళ్ళాక ఇంటికి వెళ్లలేదు. దొరబాబు నన్ను తమ బంగళాలోనే వుండిపొమ్మని చెప్పడంతో నేను అక్కడే వుండిపోయాను. నేను వెళ్ళిన కాసేపటికి చెల్లెళ్లు, అమ్మ ఆదుర్దాగా నాకోసం పరుగెట్టుకు వచ్చారు. అందరిలోనూ కన్నీళ్లు మా దీనత్వానికి ప్రతీకల్లా కనబడుతున్నాయి. నా వాళ్లందరినీ అలా చూడగానే నాకు ఏడుపు ముంచుకొచ్చింది. కాని గుండె తేలికపడేలా దొరబాబు ఇంటిదగ్గర ఏడవలేను. అందుకే వస్తున్న ఏడుపును బలవంతంగా ఆపుకుంటూ, నా వాళ్లను ఏడవ్వద్దని కళ్లతోనే చెబుతూ "నాన్న...? " అడిగాను.

"నాన్న ఈ జన్మలో నీ ముఖం చూడడంట" ఆ వెంటనే చెప్పింది చిన్న చెల్లెలు.

"ఎందుకమ్మా? " వణుకుతున్న గొంతుతో అమ్మవైపు చూశాను.

"ఠాణాకు ఎక్కావు కదా" అమ్మకు బదులుగా రెండవ చెల్లెలు సమాధానం చెప్పింది.

"సరేగాని ఉదయంనుండి నన్ను చూడ్డా

నికి ఎవ్వరూ రాలేదు ఎందుకమ్మా?" వస్తున్న దుఃఖాన్ని గొంతులోనే పూడ్చేసుకోడానికి ప్రయత్నిస్తున్న అమ్మ భుజాన్ని పట్టి కుదిపాను.

"నాన్న వద్దన్నాడు" చెప్పింది పెద్ద చెల్లెలు.

"మరి ఇప్పుడు వెళ్లమన్నాడా?" నిలదీసినట్టుగా చప్పున అడిగాను.

"నాన్న తాగి మత్తుగా నిద్రబోయాడు. అందుకేవచ్చాం" చిన్నచెల్లెలు చెప్పింది.

అంత వేదనలోనూ నాకు రోషం ముంచుకొచ్చింది. అందుకే ఉక్రోషంగా కళ్ల నీళ్లు తుడ్చుకుంటూ "వెళ్లండమ్మా! వెళ్ళండి! నేను ఇంక చనిపోయాను అనుకోండి" చెప్పి ఆ తక్షణమే అక్కడ్నుండి వెనుతిరిగాను.

"అమ్మా... వసమ్మా"

"అక్కా... అక్కా"

వెనకనుండి అమ్మ, చెల్లెళ్ల గొంతులు నాకోసం గాభరాపడ్డాయి. అయినా నేను వెనుతిరగలేదు.

"బిడ్డా! ఠాణాలో ఎట్లెట్లా జరిగిందే? పోలీసోళ్లు... దొరబాబు... ఏమంటున్నారే?" నాకోసం అమ్మ ఆతృత పడుతోంది. అయినప్పటికీ నేను మనసు మార్చుకోలేదు.

"మీతో ఏమీ చెప్పాల్సిన అవసరం నాకు లేదు" నాలో నేనే అనుకుంటూ అక్కడ్నుండి పూర్తిగా లోపలికి వెళ్ళిపోయాను. మధ్యహాలు పక్కగా వున్న గదిలో దొరబాబు నన్ను పడుకోమని చెప్పినప్పటికీ, బాత్‌రూం కోసమని ఆ గదిని దాటి కొంచెం ముందుకు నడిచి, అట్నుంచి ఎడంగా వున్న పెరటి ద్వారంవైపు అడుగులు వేశాను.

"ఏమండీ ఇంతకూ ఈ అమ్మాయి విషయం ఏంటంటారు?" నేను వెళ్తున్న దారికి కుడిపక్కగా వున్న పుస్తకాల గది లోంచి అమ్మగారి గొంతు వినిపించింది.

నాకున్న సందేహానికి ఇక్కడైనా సమాధానం దొరుకుతుందేమోనని, అప్రయత్నంగా ఆగిపోతూ రెండడుగులు వెనక్కి వేసి, అక్కడున్న చెక్క బీర్వా చాటుకి నక్కి నిల్చున్నాను.

"నీతో చెప్పలేదు కదూ! ఆరోజు అమ్మాయి సూసైడ్ చేసుకోబోయింది అన్నారు చూడూ... అదే రోజు రాత్రికి ఆశప్ప మన ఇంటికి వచ్చాడు. ఆరోజు వాడు తాగలేదు. అందుకే వాడి మాటల్లో నాకు నిజం కనిపించింది. ఏంటంటే... ఈ అమ్మాయికి నిజంగానే ఎవడితోనో ఎఫైర్ వుందట. వాడితో కలిసి వున్నప్పుడు ఈ చనిపోయిన అబ్బాయి చూశాడంట. అందుకే నేను డాక్టర్ చెకప్ అనగానే భయపడి ప్రాణం తీసుకోబోయిందట! నిజంగా వెరీ పిటీ! ఎందుకంటే... అమ్మాయి తప్పు చేసింది. కాని మనముందు ఒప్పుకోలేక చావుకి సిద్ధపడింది. ఒక అన్‌మ్యారీడ్‌గా తనతో పరాయి మగవాడి లింక్స్‌ని బయట పెట్టుకోలేని ఆత్మాభిమానం, నిండు ప్రాణం తీసుకోడానికి వెనకడుగువేయలేదు" అని కాసేపు ఆగి "అంత అభిమానం వుండీ కూడా, తప్పుచేసేముందు మానాభిమానం గురించి ఆలోచించలేకపోయిన ఆ పిల్లమీద నాకు నిజంగా జాలేస్తోంది స్వర్ణా" అన్నాడు దొరబాబు. ఆ తీరులో వ్యంగ్యంగాని, నన్ను అసహ్యించుకోవడంగాని లేవు. కేవలం పెద్దరికం తాలూకు గంభీరత మాత్రమే వుంది.

"ఛఛ! అలాగా! ఈ వయసులో అవేం పాడు బుద్ధులు? అయినా చిల్లర మనుషులు... చిల్లర బుద్ధులు..." అంటున్న అమ్మగారి తీరులో మాత్రం నా మీద అసహ్యత అనేది స్పష్టంగా ఎగిసిపడింది.

ఆ మరుక్షణమే నా తల తెగిపడినంత పనయ్యింది. అయినా నిబ్బరించుకుంటూ అలాగే మౌనంగా నిలబడిపోయాను.

ముఖ్యంగా అమ్మగారి మాటలు నా గుండెను పగలగొట్టలేదు. నాన్న వైఖరికే నా ప్రాణం పోయినంత పనయ్యింది. ఏం ఆశించి నాన్న అబద్ధాన్ని నిజమన్నట్లుగా

చెప్పుకున్నాడో తెలియదు కాని, ఆ క్షణాన నా కన్నతండ్రి నా పాలిటి కాలాంతకుడిగా తోస్తుంటే "నా...న్నా..." మనసులోనే కసిగా అనుకున్నాను.

"మరి ఆ అబ్బాయి హత్యలో ఈ అమ్మాయి ప్రమేయం అనేది ఎంతవరకు నిజం అంటారు? " మళ్ళీ తనే కల్పించుకుంది అమ్మగారు.

"ఆ విషయం గురించి ఎటూ ఖచ్చితంగా చెప్పలేం" అని కాసేపు ఆగి "అవునూ మన నౌకర్లు ఎవ్వరూ కనిపించడంలేదు. ఎక్కడికి వెళ్ళారు? " అడిగాడు దొరబాబు.

"అందరూ పొలం దగ్గరకి వెళ్ళారు? " చెప్పింది అమ్మగారు.

"అదేంటీ? " ఆశ్చర్యపోయాడు దొరబాబు.

"వెళ్ళేప్పుడు పిల్లలు డబ్బులిచ్చారు. ఆ డబ్బుల్తో పొలం దగ్గర విందుచేసుకుంటామని వెళ్లారు" చెప్పింది అమ్మగారు.

"అలాగా" చిన్నగా నవ్వాడు దొరబాబు.

"అవునండీ! అమ్మాయిని ఇలా తీసుకురావడం వల్ల మిమ్మల్ని ఆ అబ్బాయి వాళ్లు ఏమనుకుంటారు? దొరబాబు మా ఎడల పక్షపాతం చూపిస్తున్నారేమో అనుకోరూ? " మళ్ళీ నా విషయానికి వస్తూ అడిగింది అమ్మగారు.

"అలాంటిది ఏమీ జరుగదు. ఎందుకంటే... ఒక హత్య విషయంలో అరెస్ట్ చేయబడిన వాళ్లంతా హంతకులు కాకపోవచ్చు ఈ అమ్మాయి విషయం కూడా అంతే" చెప్పాడు దొరబాబు.

"అంటే? అందరూ అనుకుంటున్నట్లుగా ఈ పిల్లకు ఎలాంటి సంబంధంలేదు అనేగా అర్థం? మరి ఇందాకా ఎటూ ఖచ్చితంగా చెప్పలేం అన్నారేంటి? " అడిగింది అమ్మగారు.

"అది కాదు స్వర్ణా! ఆ పిల్ల తెలిసో తెలియకో ఎవడినో ప్రేమించింది. దటీజ్ ఇన్ఫాచ్యుయేషన్! అలాగే తనని బజారుకి ఈడ్చిన వ్యక్తి గురించి లవర్‌తో ఏదో చెప్పుకుని వుంటుంది. దటీజ్ కామన్! యాక్చువల్‌గా చెప్పాలంటే... ఒక ఆడపిల్ల గురించిన అలాంటి విషయాన్ని ఎవ్వరూ కూడా బట్టబయలు చేయకూడదు. దటీజ్ వెరీ రాంగ్. బట్ ఈ చనిపోయిన అబ్బాయి ఊరంతా మరీ చెప్పేశాడు. ఆ తర్వాత పంచాయితీలు... ఆత్మహత్యాప్రయత్నం... అంతా ఆ పిల్లకు ఒక డిప్రెషన్. ఇది ఓర్చుకోలేకే ఆ పిల్ల లవ్వరు ఈ అబ్బాయిని హత్యచేసి వుంటాడు లేదా చేయించివుంటాడు. అయితే ఈ హత్య విషయం అనేది ఈ అమ్మాయికి ముందుగానే తెలిసి వుండొచ్చు వుండకపోవచ్చు ఇది ఏది ఏమైనా అమ్మాయి కాబట్టి, ఫ్యూచర్‌వుంది కాబట్టి, ఒకవేళ విషయం అమ్మాయికి ముందే తెలుసని తేలినప్పటికీ... తెలియదు అన్నట్టుగా వుండాలని చెప్పి రేపు వెళ్ళి ఆ పోలీసోళ్లతో అంతా మాట్లాడాలి. అడిగినంత ముట్టచెప్పుకోవాలి. ఏం చేస్తాం? మన వూరి పిల్ల పైగా మన ఇంట్లో పనిచేసేపిల్ల, ఖర్చు మనకు తప్పింది కాదు" దొరబాబులో నా విషయమై "మంచితనం" ప్రస్ఫుటం అవుతున్నప్పటికీ... అతడి దృష్టిలో నా స్థానానికి నా గుండె వేయి ముక్కలయ్యింది.

"అవునూ... డాక్టర్ రిపోర్ట్సు ఏం చెప్పాయండీ? " అడిగింది అమ్మగారు.

"గొంతు నులిమి చంపినట్టుగా చెబుతున్నాయి" అని కాసేపు ఆగి "చనిపోవడానికి ముందు ఆ అబ్బాయి నిండుగా సారా సేవించివున్నాడు. కాబట్టి వాడిని హత్య చేసింది ఈ పిల్ల లవ్వరూ కావొచ్చు లేదా తాగుబోతుల్లో మరెవ్వరైనా కావొచ్చు అనే అనుమానాలు కూడా వున్నాయి. సో... కేసును రెండు వైపులనుండి దర్యాప్తు చేస్తారు కాపోతే ముందు అటువైపునుండే రమ్మని చెప్పాను" చెప్పుకుపోయాడు దొరబాబు.

"ఎందుకు? " అడిగింది అమ్మగారు.

"ఈ అమ్మాయి అంత సులువుగా పెదవి విప్పేది కాదు. కాబట్టి ముందుగా కన్విన్స్ చేసి ఆ తర్వాత అసలు విషయం రాబట్టాలి. ఇందుకుగానూ ఈ పిల్ల పోలీసులచేతుల్లో పడితే గనుక భవిష్యత్తును మరిచిపోవాల్సి వుంటుంది. సో... అంతా నేను చూసుకుంటాను" చెప్పాడు దొరబాబు.

"ఇది సరేగాని, ఈ పిల్లకోసం ఊర్లో మీ మంచిపేరును చెడగొట్టుకోవద్దండీ" గుర్తుచేసింది అమ్మగారు.

"అలాంటిది ఏమీ జరగదు అన్నాను కదా"

"అని మీరనుకుంటున్నారు"

"అనుకోవడంకాదు, అనుకున్నది నేను చేస్తాను. ఎలా అంటే" అని కాసేపు ఆగి "అది ఏంటో రేపు నీకే తెలుస్తుంది" అన్నాడు దొరబాబు.

ఆ తర్వాత కాసేపటివరకు మరే మాటలు వినిపించలేదు. అయినప్పటికీ నిశ్శబ్ద సముద్రఘోషలా అక్కడే నిలబడిపోయాను. ఇప్పుడు నా మనసులో నా ధీరేంద్ర గురించిన ప్రేమతత్వపు ఛాయలు సుప్తావస్తను చేరుకున్నాయి. కాబట్టే అతగాడు 'తన తమ్ముళ్లతో కలిసి పట్నం వెళ్ళిపోయాడని అర్థమౌతున్నా ఆ విషయమై నాలో చలనంలేదు. ఇదే వేరే సమయంలో అయ్యుంటే "ఉదయమైతే వేటకు వెళ్లావు. నేను వచ్చేలోపే వూరెళ్లావు. ఎందుకు అలా వెళ్ళావు? అలసిపోయానని చెప్పి ఈ ఒక్క రోజు ఇక్కడ వుండకపోయావా? " అంటూ మురిపెంగా అనుకునేదాన్ని. ఆ మురిపాలు చిందించే మనసు ఇప్పుడు ముద్దలా తయారై నన్ను నిలువునా సాధిస్తుంటే, ఆ గదిలోకి చూద్దామని నెమ్మదిగా అడుగు ముందుకు వేయబోయాను.

"వేటకు వెళ్ళి మనవాడు ఏమేమి తీసుకు వచ్చాడు? " అడుగుతూ అదే క్షణంలో ఆ గదినుండి వెలుపలికి వచ్చాడు దొరబాబు.

"వన్ డీర్ అండ్ ర్యాబిట్" చెప్తూ ఆ వెనకే వచ్చింది అమ్మగారు.

"వాడికి ర్యాబిట్ అంటే మహా ఇష్టం. వండించుకున్నాడా లేదా? " అడిగాడు దొరబాబు.

"వండించుకోకుండా ఎలా వదులుతాడు బుజ్జికొండా! వేటకు వెళ్ళి వచ్చేసరికి మధ్యాహ్నం రెండయ్యింది. అయినా గాని మీల్స్ చేయలేదు. ర్యాబిట్‌ని వండించుకున్నాకే తిన్నాడు. తర్వాత సాయంత్రం వూరెళ్లేప్పుడు ఏమంటున్నాడో తెలుసా? " అంటూ దొరబాబు భుజాలపై తన రెండు చేతులు వేసింది అమ్మగారు.

"ఏమన్నాడు? " ఆమెను అలాగే దగ్గరగా లాక్కుంటూ అడిగాడు దొరబాబు.

వాళ్లల్లో పెద్దరికాన్నే తప్ప చిలిపి సరసాల్ని ఏనాడూ చూడని నాకు తొలిసారిగా ఆ జంటలో మురిపాల సందడి కనిపిస్తున్నా కూడా నాలో ప్రతిచర్య కలగలేదు. ఇదే వేరే సమయంలో అయ్యుంటే కళ్ళప్పగించి ఆశ్చర్యంగా చూసేదాన్ని.

"సెండాఫ్ చెప్పే సమయానికి డాడీ లేరు కాబట్టి నెక్స్ట్‌మంత్ డాడీ సింగపూర్ వెళ్ళేటప్పుడు కూడా నేను ఎయిర్‌పోర్ట్‌కి రానూ... అని తెగేసి చెప్పాడు. కాని మన చిన్న బుజ్జికొండలు ఇద్దరూ మాత్రం మీకు ఫుల్ సపోర్ట్ ఇచ్చారు. పనిమీద బయటకి వెళ్ళిన డాడీని అర్థం చేసుకోవాలన్నారు. కాని వాడు వింటేనా? మొండిరకం..." కొడుకుల గురించి మురిపెంగా చెప్పుకుంటూ మురిపాల మొగుడి గుండెలపై మృదువుగా వాలిపోయింది అమ్మగారు.

అందుకు దొరబాబు ప్రేమతత్వపు నిండిన ఓ చిరునవ్వుతో అమ్మగారి వీపు నిమిరి "నీ పెద్దకొడుక్కి ఇప్పుడే ఫోన్‌చేసి మాట్లాడాను" అన్నాడు.

"ఫోన్ తర్వాత. ముందు భోంచేయండి" దొరబాబు ముఖంలోకి చూసింది అమ్మగారు.

"ఏం వండావు? " అడిగాడు దొరబాబు.

"మీ కొడుకు వండించుకున్న ర్యాబిట్‌ని మీ కోసం అలాగే వుంచాను" చెప్పింది అమ్మగారు.

"అలా!గా!" అని ఓ రెండుక్షణాలు ఆగి- "అవునూ డీర్‌ని ఏం చేశాడు వాడు? " అడిగాడు దొరబాబు.

"ఊరెళ్ళేప్పుడు నౌకర్లకు డబ్బులివ్వడం సహజమేకదా! ఆ సహజత్వానికి తోడుగా... తను బుల్లక్ ఫైట్‌లో గెలిచినందుకు ఏదో ఒక స్పెషాలిటి వుండాలికదా! అందుకు సుమారు ఇరవైకిలోల డీర్‌ని వాళ్ళకు కానుకగా ఇచ్చేశాడు" దొరబాబు నుండి దూరం జరుగుతూ చెప్పింది అమ్మగారు.

"ఏయ్... ఎక్కడికి? " దూరం జరిగిన అమ్మగారిని తిరిగి దగ్గరగా లాక్కున్నాడు దొరబాబు.

"అబ్బా... భోంచేద్దురుగానీ రండి" భర్త అల్లరి సరసానికి మురిసిపోతూ గోముగా అంది అమ్మగారు.

"ఈరోజు ఇంట్లో నౌకర్లు ఎవ్వరూ లేరు. సో... మన రొమాన్స్‌కి ఎనీప్లేస్ అవైలబుల్. కాదనవద్దు..." అదోమత్తుగా అంటూ భార్యను పూర్తిగా దగ్గరగా లాక్కుని ఆమె పెదవుల్ని తన పెదవులతో ఒక్కసారిగా కప్పేయగానే, అసంకల్పితంగా చప్పున నా కళ్లు బిగ్గరగా మూసుకున్నాయి.

అసలు అమ్మానాన్నల వయసులో వుండే దొరబాబు దంపతులు, ఇంకా అలా పడుచు జంటలా వుంటారని ఏనాడూ అనుకోలేదు. ఎందుకంటే... అమ్మా నాన్నల మధ్య అలాంటిది ఏమీలేదు. ఎప్పుడూ కూడా కుటుంబ సమస్యలు, చీకాకులు, గొడవలు. అంటే... చీకూ చింతలేని పరిస్థితులు మనుషుల్ని శారీరకంగా, మానసికంగా బలపరచడం మాత్రమే కాదు, శృంగారపరంగా కూడా బలపరుస్తాయన్నమాట.

"కాసేపటి తర్వాత దొరబాబు దంపతులు అక్కడ్నుంచి వెళ్ళిపోతున్న అలికిడి కలిగింది. వెంటనే కళ్లు తెరిచిచూశాను.

సిల్కులుంగీ మాత్రమే కట్టుకుని తన దృఢమైన శరీరాన్ని అరభాగం బహిర్గతం చేస్తున్న దొరబాబు, కాటన్‌చీర కట్టుకుని మరింత మందంగా కనబడుతున్న ఆమెగారి నడుం చుట్టూ చేయివేసి వుండగా, ఇద్దరూ కలిసి భోజనాల గదివైపు నెమ్మదిగా వెళ్తున్నారు.

వాళ్ళు ఆ గదిలోకి పూర్తిగా వెళ్ళేవరకు అక్కడే నిల్చుని, ఆ తర్వాత మెల్లగా బాత్‌రూమ్‌వైపు అడుగులు వేశాను.

"దొరబాబు నా జీవితాన్ని ఏం చేయబోతున్నాడు? అతడి ఆలోచన నా జీవితాన్ని అన్యాయంగా నాశనం చేయట్లేదుకదా!? పోలీస్‌స్టేషన్‌లో నా గురించి, నాకు లేని ఆ ప్రియుడి గురించి ఏదేదో మాట్లాడ్తానంటున్నాడు. అదే నన్ను వేధిస్తోంది... పీడిస్తోంది. పైగా రేపు మరేదో కొత్త విషయం తెలుస్తోందట. ఏంటది? " నాలో నేనే కుమిలిపోతూ బాధతో బాత్‌రూమ్‌లోకెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చాను. ఆ ఏడుపులోనే "నేను ఓడిపోతున్నానేమో" అనే ప్రశ్న ప్రళయంలా ఉద్భవించింది. అందుకు నేను మరింతగా అదిరిపోలేదు. నాకు తెలియకుండానే నాలో 'గెలవాలనే పట్టుదల' ఉదయించింది.



"ఆ పిల్ల గర్భవతి. అందుకే పోలీస్‌స్టే

షన్‌లో వుండటం మంచిది కాదని, దొరబాబు తన ఆధీనంలో ఉంచుకున్నాడు. మరసటిరోజు సాయంకాలానికల్లా వూరంతా తెలిసిపోయింది వార్త.

పవిత్రమైన నా కన్నెరికాన్ని అపహాస్యం చేస్తున్న ఆ మాట నా మనసును ఒక్కసారిగా నిర్వీర్యం చేయగానే ఒక మూలగా కూలబడిపోయాను.

"బాబుగారూ! నేను అమాయకురాలిని. నా మాట నమ్మండి" అంటూ గొంతు చించుకు అరవాలనివుంది. కాని అసహాయత నీడలో నా మనసే కాదు, నా మెదడు కూడా మొద్దుబారిపోగా చాలాసేపటివరకు అలాగే కూలబడివున్నాను.

"వసమ్మా! దొరబాబుగారు పిలుస్తున్నారు" వున్నట్టుండి ఓ నౌకరు నా వద్దకు వచ్చి చెప్పాడు.

"భూలోక ప్రళయాలు ఎన్నయినా సూర్యుడు ఉదయించక తప్పదు" అన్నట్టుగా నా మనసులోని గాయాలు ఎన్నయినా నౌకరు రాయబారానికి నేను ప్రతిచర్య చూపించక తప్పలేదు.

"ఏం పాపా ఆరోగ్యం బాగోలేదా నీరసించి వున్నావు" నేను వెళ్ళగానే మధ్య హాల్లో చెక్క ఊయలపై కూర్చుని సిగారు తాగుతున్న దొరబాబు నిండుగా అడిగాడు.

"బాగుంది దొరా" చేతులు జోడిస్తూ మెల్లగా చెప్పాను.

అందుకు దొరబాబు "ఆ!" అంటూ చిన్నగా తల పంకించి, "చూడమ్మా! నేను ఇప్పుడు ఒక దొరగా కాదు, ఒక స్నేహితుడిగా, ఒక ఆత్మీయుడిగా అడుగుతున్నాను. కాలం వెచ్చించకుండా వెంటనే సమాధానం చెప్పు" అని మరి కాసేపు ఆగి "నీవు ప్రేమించిన అబ్బాయి ఎవరమ్మా? " అడిగాడు.

ఎవరని చెప్పాలి? ఏమని చెప్పాలి? అందుకే సమాధానం లేని ప్రశ్నని చిన్నగా కదిలాను. అది దొరబాబు గమనించాడో లేదో తెలియదుగాని, ఆ వెంటనే మళ్ళీ తనే కల్పించుకుంటూ, "ఆ అబ్బాయి పేరు చెప్పడానికి నీవు ఎంతమాత్రం భయపడవద్దు. అతడిని ఎవ్వరూ ఏమీ చేయలేరు. ఎవరు అడ్డుతగిలినా మీ ఇద్దరి పెళ్ళి నేను జరిపిస్తాను" అన్నాడు దొరబాబు.

"హంతకుడ్ని రాబడుదామని ప్రయత్నిస్తున్నారా బాబుగారూ? అది మీ వృధా ప్రయాస. నేను అన్నివిధాలా నిరపరాధిని! నన్ను దయచేసి నమ్మండి" మనసులో అనుకోబోయిన మాట నాకు తెలియకుండానే పైకి అనేశాను. ఆ వెంటనే దొరబాబుకి భయపడినదాన్నయి వణికిపోతూ చూశాను. దొరబాబు నావైపు విస్మయంగా చూస్తున్నాడు. ఆ చూపులు నాకు మరింత భయాన్ని కలిగించాయి. అందుకే గుటకలు మింగుతూ నిలబడిపోయాను. దొరబాబు ఇక నాతో మాట్లాడలేదు.

నెమ్మదిగా వెనుతిరిగి చూస్తూ, "స్వర్ణా" అమ్మగారిని పిలిచాడు.

"ఏంటండీ!" కాసేపటితర్వాత వెలుపలికి వచ్చింది అమ్మగారు. సమాధానంగా దొరబాబు నన్ను చూపించాడు. అది అర్థం చేసుకున్నట్లుగా అమ్మగారు నన్ను సూటిగా చూస్తూ, "ఇట్రా" పిలుస్తూ లోపలికి వెళ్ళింది.

"ఎందుకు? " నాలో నేనే భయంగా ప్రశ్నించుకుంటూ అమ్మగారి వెనకే నడిచాను.

"బాబుగారిని విసిగించకుండా అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పమ్మంటే దాగుడు మూతలు ఆడుతున్నావెందుకు? " లోపలి గదిలోకి వెళ్ళాక చికాగ్గా అడిగింది అమ్మగారు.

"అమ్మగారూ..." నా బాధను నిజాయితీగా మరోమారు నివేదించుకోబోయాను. "నువ్వేం అనవసరంగా మాట్లాడొద్దు..." నన్ను వారిస్తూ చెప్పి- "మీ నాన్నేమో... 'నా కూతురు చేయిదాటిపోయింది బాబుగారూ! దానికి పెళ్ళి చేస్తేగాని ఒక మార్గం

లోకి రాదు, ఆ పుణ్యమేదో మీరే కట్టుకోండి' అని కన్నీళ్ళతో వేడుకుంటూ మా కాళ్ళు పట్టుకున్నాడు. నువ్వేమో ఇష్టమైన వాడితో పెళ్లి జరిపిస్తా అంటున్నా కూడా పెదవి విప్పవు. ఏంటమ్మా ఇది? " గొంతు తగ్గించి మాట్లాడినప్పటికీ తీక్షణంగానే మాట్లాడింది అమ్మగారు.

అప్పుడు అర్థమైంది నాకు నాన్న ఉద్దేశం. "కూతురి పెళ్ళికి కట్నం ఇవ్వాల్సివస్తుందని అందుకు తను కష్టపడాల్సివస్తుందని, నన్ను చెడిపోయినదానిగా చిత్రీకరించి... నిజంగా నాన్న ఎంత అందంగా నటించాడు? అలాంటివాడికి కూతురిగా జన్మించినందుకు బాధపడాలా? ఆత్మహత్య చేసుకుని "నీ కూతురిగా బతకలేనురా" అంటూ జీవితాన్ని ఇక చాలించుకోవాలా? ఎటూ అర్థం కాని పరిస్థితి నన్ను చిత్రవధ చేస్తూ అంతర్గతంగా సంగ్రామాన్ని మొదలెట్టింది.

"ఛీ" నాన్నని తలుచుకున్న నా మనసు ఒక్కసారిగా లోలోపలే అసహ్యపడింది.

"ఏమ్మా? ఏం మాట్లాడవు? " నన్ను కుదిపినట్లుగా అంది అమ్మగారు.

"ఆ..." ఏం చెప్పి అమ్మగారిని నమ్మించాలో తెలియక చిన్నగా తడబడ్డాను. అమ్మగారు నా నుండి సమాధానం కోసం అన్నట్టుగా నావైపు అలాగే కొన్నిక్షణాలవరకు చూసింది. నేను భయంగా తడబడుతూ అలాగే నిలబడిపోయాను.

"చూడు పిల్లా! బాబుగారు నీకు మేలు చేయాలనుకుంటున్నారు. ఆ రామేశ్వరాన్ని చంపింది లేదా చంపించింది నీవు ప్రేమించిన అబ్బాయే అయినప్పటికీ, అతడికి ఏ శిక్షా పడకుండా బాబుగారు కాపాడాలనుకుంటున్నారు. కాబట్టి విసిగించకుండా అబ్బాయి ఎవరో చెప్పు. ఇప్పుడు నీవు ప్రెగ్నెంటు అని ఎలాగూ ప్రపంచానికి తెల్సిపోయింది. అది అబద్ధమైనా నిజమైనా నీకు ఎలాంటి నష్టం లేదు. ఎందుకంటే... నీవు ఇష్టపడ్డవాడితో నీ పెళ్ళి జరిపించే బాధ్యత మాది" నేను ఏ సమాధానం చెప్పకపోయేసరికి అమ్మగారే తిరిగి కల్పించుకున్నారు. కాని ఈమారు ఆమెలో ఇందాకటి తీక్షణత లేదు. సౌమ్యత స్పష్టంగా వుంది.

"...."

"ఇంకో విషయం! ఈ హత్యలో వేరొకరి ప్రమేయం వుంటే అది వేరే సంగతి. కాని ప్రత్యేకించి నీవు ఇష్టపడ్డ అబ్బాయి ప్రమేయమే వుంటే గనుక అందులో పెద్ద తప్పు లేదు కూడా. ఎందుకంటే... ఏ విషయాన్నయితే రహస్యంగా వుంచుకోవాలో ఆ విషయాన్నే పనిగట్టుకుని బహిర్గతం చేసినవాళ్ళపై ఎవ్వరికైనా కోపం వస్తుంది మరి! అందుకే నీవు ధైర్యంగా వుండు. ఇలాగని చనిపోయినవాడి కుటుంబం అన్యాయమైపోవడానికి వీల్లేదు కాబట్టి, అందుకు నష్టపరిహారాన్ని బాబుగారు ప్రభుత్వంచేత ఎలాగూ ఇప్పిస్తారు. ఈ సమయంలో కూడా నీకు సంబంధించిన వ్యక్తి పేరు బయటపడదు. అంతా సవ్యంగా జరిగేలా బాబుగారు, చూసుకుంటారు" అనే సౌమ్యతతో మాటమాటని సర్దిచెప్పింది అమ్మగారు.

"..." నేను అలాగే మౌనంగా వుండిపోయాను.

"ఏమంటావు? " అంది అమ్మగారు.

అందుకు సమాధానంగా నెమ్మదిగా తల వంచుకుని, నేలను చూస్తూ- "నాకు డాక్టరు పరీక్ష జరిపించండి అమ్మగారూ" దీనంగా చెప్పాను.

★ ★ ★

మరుసటిరోజు ఉదయం ఆరుగంటలు కావొస్తుంది. అప్పటికి నేను నిద్రలేచి చాలా సేపు అయింది. నేను దొరబాబు ఇంట్లోనే వున్నాను కాబట్టి అప్పటికే స్నానం కూడా చేసి వంటపాత్రల్ని కడుగుతూ పెరట్లో బావి దగ్గర కూర్చుని వున్నాను.

"వాసమ్మా..." పిలుస్తూ వచ్చాడు ఒక నౌకరు.

"ఆ? " ఏంటన్నట్లుగా తిరిగి చూశాను.

"ఒక్తి పుణ్యానికి నిన్ను ఠానకు ఎక్కిచ్చిండు. ఆ కోంటోళ్ళ పిల్లగాణ్ని చంపింది ఆ మద్దిలేటిగాడంట. ఇద్దరు నిండగ తాగి ఆ గుట్టకాడ గుడిసెలకాడికి పోయి నీవూ నేనని కొట్లాట పెట్టుకున్నారంట. ఆ కొట్లాట జూసి గుడిసెల్లోలంతా ఎల్లిపొమ్మని చెప్పింగ్రంట. మరి ఇంగ ఇద్దరు తిరిగి వచ్చుకుంట ఇంకా ఏమేమి కొట్లాడింగ్రో ఏమో? తెల్లారేసరికి ఓడు సెవం అయ్యిండు. ఈడు పరారయ్యిండు" ఉత్కంఠభరితమైన వార్తను ఈ ఉదయపు కానుకగా చెప్పుకుపోయాడు ఆ నౌకరు.

"దొరబాబుకి ఈ విషయం తెల్సిందా? " తక్షణమే అడిగాను.

"ఆ" తెల్సు అన్నట్టుగా అన్నాడు అతడు.

"హమ్మయ్య!" గుండెలనిండా ఊపిరి పీల్చుకుని "ఇంతకు ఈ విషయం ఎలా బయటపడింది? " ఆసక్తిగా అడిగాను.

"ఆ మద్దిలేటిగాడు సూడ్డానికి పులిలెక్కన వున్నాడుగాని, ఒక్తి పిల్లి ధైర్యము, అందుకే ఆ కోంటోళ్ళ పిల్లగానితో తను కొట్లాట పెట్టుకున్నట్టుగా ఎవ్వరితో చెప్పొద్దని నిన్ను ఇక్కడ ఠానకు పట్టుకుపోయినప్పుడు, అక్కడ గుడిసెలకాడికి ఎల్లి సెప్పుకున్నాడంట. అట్లా సెప్పుకోవడంలో అర్థం ఏముంది? వీడికి ఆ చావుతో సంబంధం వున్నోడయితేనే అట్లా చెప్పుకుంటాడు. అట్ల పారిపోతడు. వోడు సెప్పుకునేది ఏదో సెప్పుకుని పారిపోయినా, ఆ కోంటోళ్ల పిల్లగాడ్ని నమ్ముకున్న ఆడమనిసి ఈ విషయాన్ని అంతా ఇప్పుడొచ్చి ఈ బాబుగారికి సెప్పుకుంటోంది. ఆరోజే వొచ్చి సెప్పుకుందామనుకుందటగాని, వోడి సావు కబురు తెల్వగానే జెరం ఇడ్వకుండా పట్టి మనిసిని కదలనిచ్చిలేదంట..." చెప్పుకుపోయాడు నౌకరు.

"నన్ను పుకారు చేసినవాడు, ఆ పుకారుని బలపరిచినవాడు ఇద్దరూ శిక్షింపబడ్డారు. ఒకడు హతుడిగా... ఇంకొకడు హంతకుడిగా! ఓ భగవంతుడా నా ప్రయత్నం లేకుండానే నా కష్టల్ని నెరవేరుస్తున్నావు. నా జీవితాన్ని కూడా నా ప్రయత్నం లేకుండానే నేను అనుకున్న లోగిలిలోకి పంపించు!" ఆనందంగానే మనసులోనే అనుకుని, ఆ నౌకరువైపు చూస్తూ "రంగన్నా! మంచి వార్త చెప్పావు" కృతజ్ఞతాపూర్వకంగా అన్నాను.

అంతలో మరొక నౌకరునుండి పిలుపు వినిపించింది. ఆ తక్షణమే అతడు "ఓ... వొస్తున్నా" అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

నా మనసు తేలికపడింది. కానీ తేలికపడ్డ నా మనసును మళ్ళీ గందరగోళపరుస్తూ అల్పాహార సమయానికి దొరబాబు నన్ను పిలిచి తిరిగి మునుపటి పాట పాడాడు.

"హత్య విషయంలో నీవు ఇంక కంగారు పడాల్సిన అవసరంలేదు. కాని సమాజానికి నీవు గర్భవతిగా తెల్సిపోయింది. కాబట్టి నీవు పెళ్ళి చేసుకోవాలి. లేదంటే ఈ సమాజాన్ని నీవు భరించలేవు..." చెప్పాడు దొరబాబు.

"అంటే? నేను నా పెదబాబుకి దూరం కావల్సిందేనా? " భారమైన ప్రశ్న నన్ను బలంగా బాధపెట్టగానే తట్టుకోలేకపోతూ- "నాకు ఇప్పుడే పెళ్ళి ఇష్టంలేదు బాబుగారూ! నేను చదువుకోవాలి. చదువుకుని ఉద్యోగం తెచ్చుకోవాలి" నా కోరికను నివేదించుకున్నాను.

"వెరీగుడ్ ఆలోచన. కాని, పాపా! ఈ సమాజం భయంకరమైనది..." చెప్పాడు దొరబాబు.

"డాక్టరు..." మళ్ళీ నాదైన మాటను చెప్పబోయాను.

"అవన్నీ అనవసరం! అలాంటి పరీక్షలు ఈ సమాజం నోరు మూయించలేవు. ముఖ్యంగా నీవు పేద ఇంటి ఆడపిల్లవి. నీలాంటివాళ్ళను ఈ సమాజం పీక్కుతింటుంది. నీలో చైతన్యం వున్నా దాన్ని ఈ

సమాజం తన మాటలతో నాశనం చేస్తుంది. కాబట్టి నీకు ఇష్టమైన వాడిని నీవు పెళ్ళి చేసుకుని, ఆ తర్వాత నీవు అనుకున్నది సాధించు" ఒక్క మాటతో నన్ను అర్థం చేసుకున్న దొరబాబు నన్ను పూర్తిగా మాట్లాడనివ్వకుండా తనదైన అభిప్రాయాన్ని పదిలంగా నా ముందు వుంచాడు.

"నన్ను కాపాడ్డానికి తమరు సృష్టించిన అబద్ధం, నా జీవితాన్ని అన్యాయం చేసేస్తోందేమో బాబుగారూ? " నాలో నేనే ధైర్యంగా ప్రశ్నించుకుని బయటికి మాత్రం "వొద్దు బాబుగారూ! నేను చదువుకుంటాను' ' దొరబాబు చెప్పిన మాటలకే తలాడించే నా వైఖరి, పెళ్ళి విషయంలో మాత్రం నాకు తెలియకుండానే ధైర్యపడుకుంటూ నాకు నేనే ఆశ్చర్యంగా అగుపించాను. పెదబాబు మీది నా ప్రేమ, నన్ను అలా ధైర్యపరుస్తోందని నాకు తెలుసు. కాని ఆ విషయాన్ని మాత్రం ధైర్యం చేసి కనీసంగా నా ప్రాణ స్నేహితులతో కూడా చెప్పుకోలేదు. చిత్రం అంటే ఇదేమరి!

"చదువుకోవాలనే నీ ఆలోచన సంతోషించదగ్గదే. కాని ఈ చదువుకునే వయసులో నీవు ప్రేమలో పడటం అనేది మాత్రం నాట్ యాక్సెప్టెడ్! అది ఆమోదించే విషయం కాదు. ఏది ఏమైనా నీ పెళ్ళి జరిపిస్తామంటున్నది ముక్కూమొహం తెలియని వాడితో కాదు కాబట్టి, నీవు ఇంకేం ఎక్కువ మాట్లాడకుండా ఆ అబ్బాయి ఎవరో చెప్పు. వచ్చే నెలలోనే నీ పెళ్ళి జరిపిస్తాం" ఈమారు అమ్మగారు కల్పించుకున్నారు.

"సమాజం నోరు మూయించడం ఏంటో గాని, మీరు అనుకుంటున్న నా ప్రేమ విషయంలో మిమ్మల్ని నమ్మించడం మాత్రం అంతకుమించిన భారమే" అమ్మగారిని చూస్తూ మనసులోనే అనుకున్నాను.

"నీవు మౌనంగా వున్నంత మాత్రాన నీ పెళ్ళి జరగకుండా వుండదు. నీకు ఇష్టమైన వాడి పేరు నీవు చెప్పకపోయినా, మాకు ఇష్టమైన వాడితో నీ పెళ్ళి జరిపిస్తాం" మళ్ళీ అమ్మగారే అంది. ఈమారు ఆమె కంఠంలో నా జీవితంమీద అధికారం కనిపించింది.

"..."

"అవునూ! ఇంత చెప్పినా నీవు మౌనంగా వున్నావంటే... వాడు ఎవడో నిన్ను మోసం చేశాడుకదూ? "

"ఆ..." నాకేం తోచడంలేదు. కంగారుగా కదులుతున్నాను.

"మోసం చేసినవాడినయినా మెడలు వంచి లాక్కునిరావచ్చు కాని రెండు జీవితాలు ముడిపడేముందు ఇరువురికీ అంటే... అమ్మాయికీ అబ్బాయికీ ఇద్దరికీ ఇష్టం వుండివుండాలి. ఈ విషయంలో నీవు నిన్ను మోసం చేసినవాడిని మరిచిపో! మాకు తెలిసిన ఒక అబ్బాయి వున్నాడు. అన్నివిధాలా యోగ్యుడు. నీకు అన్నివిధాలా సరిపోతాడు. అతడి కోసం నీ మనసును నీవు మళ్ళీ పునర్నిర్మించుకో" చెప్పుకుపోయింది అమ్మగారు.

ఈమారు ఒక్కసారిగా అవాక్కయిపోయాను. ఆ తర్వాత అతలాకుతలం అయిపోయాను. ఎందుకంటే... "నా ప్రతి ప్రవర్తన మొదట్నుండి నన్ను మహాసముద్రమై ముంచేస్తుంటే, అందులోంచి తప్పించుకుందామని ప్రయత్నిస్తున్నా నేను మళ్ళీ మునిగిపోయాను. 'మౌనం'గా వుండటం అనేది నన్ను దారుణంగా మోసం చేసింది. మెతకగా కాకుండా గట్టిగా వాదించే తెగింపే నాలో వుంటే ఈ అపవాదులు నన్ను దరి చేరకపోవచ్చు కాని మొదటనుండి నేను 'అభిమానం'గా భయపడుతున్న 'బానిసత్వం' అనేది నాదైన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని ఎప్పటికప్పుడు చంపివేస్తూనే వుంది. కాబట్టే... ఆధునికంగా వుండే ఈ దొరబాబు దంపతుల దృష్టిలో కూడా నేను 'ఆడపిల్ల'గానే వున్నాను తప్ప "ఆశలదీప్తి"గా కనిపించలేదు. ఇదే నేను ఓ మోతుబరి

కూతురిని అయ్యుంటే వీళ్ళ మాటలు మరోలా వుండివుండొచ్చు..." అనుకుంటున్న నా ఆలోచన ఒక్కసారిగా నాకు ఎదురుతిరిగింది.

"గర్భవతిగా ముద్రపడిన నా జీవితం గురించి మా ఆర్థిక పరిస్థితి దృష్ట్యా దొరబాబు దంపతులు వాస్తవంగా ఆలోచిస్తున్నారు. నిజమే మరి! ఇంతటి అపవాదు వచ్చిన నన్ను, భవిష్యత్‌కాలంలో కూడా అంత సులువుగా ఎవ్వరూ పెళ్ళి చేసుకోరు. నాలాంటిదానికి పెళ్ళిచేయడం అమ్మానాన్నల తరం కాదు! ముఖ్యంగా నా పెళ్ళిని దొరబాబు దంపతుల ఆధ్వర్యంలో సామూహిక వివాహాల ఘట్టంలో భాగంగా జరిపించే ఆలోచన నాన్నలో మొదటినుండీ వున్నదే. అయితే ఈ విషయాన్ని నేను మొదటినుండి ఖండిస్తున్నాను కూడా! నా పెళ్ళి నేను అనుకున్నవాడితో జరుగుతుందని ఓవైపు నేను విశ్వసిస్తున్నప్పటికీ, మరో వైపు "ఆడపిల్లల్ని కన్నావు కాబట్టి ముందుగా డబ్బు సంపాదించడం నేర్చుకో! పిల్లల పెళ్ళిళ్ల కోసం ఎదుటివారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడటం బాధ్యత అన్పించుకోదు. చేతకాని ఆలోచనలు నీకు తృప్తిని స్తాయేమో కాని చదువుకుంటున్నవాళ్ళం కాబట్టి నీ ఆలోచనలు మా విలువల్ని నాశనం చేస్తాయి" అంటూ నాన్నతో ప్రతిసారీ గొడవ పెట్టుకోవడం అలవర్చుకున్నాను.

ఈ నా వ్యతిరేకధోరణి నాన్నలో విషబీజాల్ని నాటింది. కాబట్టే నేను చదువుకోరాదని, చదువుకుంటే తన మాటను అసలు విననని, నిజంగా నాన్న ఎంతపని చేశాడు?

నాన్న ప్రవర్తన ఎలాంటిదైనా ఒక సాధారణ ఆడపిల్లగా నా భవిష్యత్తును దృష్టిలో వుంచుకుని నా పెళ్ళి కోసం దొరబాబు దంపతులు తాపత్రయపడుతున్నారు. ఇదంతా సరే! కాని నా ప్రేమ?

"ఏ పిల్లా! జిగురు అతికించిన కాగితంలా అలా నిలబడిపోయావేం? " కుదిపినట్లుగా వినిపించింది అమ్మగారి గొంతు.

"ఆ..." అంటూ ఆలోచనలోంచి తేరుకుని "సరే అమ్మగారూ" అంటూ అనుకూలంగా తలాడించాను. కాని నా మనసు మాత్రం నాన్న దుర్మార్గాన్ని గురించి క్షణక్షణం రగులుతూ... కుములుతూ... ఆ దుర్మార్గంలోని ఆంతర్యాన్ని పరిపరివిధాలా అంచనా వేస్తూ... నన్ను నిలువునా పీడిస్తుంటే తట్టుకోలేకపోతూ, ఆ గదిలోంచి వెలుపలికి వచ్చాక నాలో నేనే ఒక శపథం చేసుకున్నాను.

"మీరు తలపెట్టిన నా పెళ్లిని నేనే ఆపివేస్తాను"



శ్రావణమాసం ఆరంభమయ్యింది! మా పల్లె అనే ఇంటికి ఈ మాసం ఓ పచ్చతోరణం! ఎందుకంటే... సామూహిక వివాహాలకు ఈ మాసమే ఒక వేదిక. అందుకే... గ్రామంలో నిరుపేద వధూవరుల కలల సుధానిధికి ద్వారాలు తెరుచుకున్నాయి. కాగా నాలో మాత్రం భయాందోళన తుఫానుగాలులు ఎడతెరిపి లేకుండా మొదలయ్యాయి.

పెళ్ళిని ఆపేందుకు పటిష్ఠంగా ఆలోచించాను. కాని ఆచరణ కోసం నేను తడబడుతున్నాను. ఇలాగని నా మనసులోని 'నిజమైన ప్రేమబాధ'ను గురించి రెండవ వ్యక్తితో చెప్పుకోలేను. ధైర్యపడి ఒంటరిపోరాటం సాగించాల్సిందే!

"వసూ..." పిలుస్తూ వచ్చింది పద్మజ.

"ఆ..." పరధ్యానంగా పలికాను.

"వుడ్‌బీ ఎవ్వరో తెలీయకుండానే ఊహల్లోకి వెళ్ళిపోయావా?" అడుగుతూ వచ్చి పక్కలో కూర్చుంది పద్మజ.

"ప్చ..." కాదన్నట్టుగానూ, నా నిర్లిప్తతను వ్యక్తం చేసినట్టుగానూ పెదవులు చిట్లించాను.

"మరేంటే? అందరూ ఎగ్జామ్స్ రాసి పాసై కాలేజీకి వెళ్తున్నారు. నీవేమో ఎగ్జామ్స్ రాయకుండా ఇంట్లో కూర్చుని..." తనదైన ధోరణిలో మాట్లాడుతూ పోతున్న పద్మజని మధ్యలోనే వారిస్తూ, "ప్చ్! ఆపవే" విసుగ్గా అన్నాను.

"ఏంటే ఏమయింది? అలా వున్నావు?" నాకు మరింత చేరువగా జరిగింది పద్మజ.

"తోటి పిల్లలు నన్ను అవమానంగా చూస్తారని ఒకవైపు, పరిస్థితుల పుణ్యమా అని చదువులో వెనకబడిపోయాను కాబట్టి పరీక్షలు రాసినా పాస్ కాలేనని మరోవైపు బాగా ఆలోచించుకునే ఈ సంవత్సరం వృథా చేసుకున్న మాట వాస్తవమే. ఇలాగని ఎప్పటికీ ఇలాగే వుండిపోతానా. చదువుకుని, అనుకున్నట్టుగా ఉద్యోగం తెచ్చుకుని, జీవితంలో స్థిరపడాలని వుంది. అందుకే ఇప్పుడే పెళ్ళిచేసుకోకూడదు అనుకుంటున్నాను" నా బాధను సంగ్రహంగా చెప్పుకున్నాను.

"నువ్వు అనుకుంటున్నావని నిన్ను ఆ దొరబాబు అర్థంచేసుకుంటాడా? తను అనుకున్నదే చేసి తీరుతాడుగానీ" నాబాధను మరింత పెంచి పెద్దచేస్తున్నట్టుగా అంది పద్మజ.

"అదికాదే" నెమ్మదిగా అన్నాను.

"మరేంటే?" కనుబొమలు ముడిచి నాముఖంలోకి సూటిగా చూసింది పద్మజ.

నేను కొన్ని క్షణాలు అలాగే మౌనం వహించి, ఆ తరువాత తన చేతిని నా చేతుల్లోకి తీసుకుంటూ "పద్దూ! నీవు నాకో సహాయం చేయాలి" వేడుకుంటున్నట్టుగా అన్నాను.

ఏంటన్నట్టుగా చూసింది పద్మజ.

"మరేం లేదే! నాకు ఈపెళ్ళి ఇష్టంలేదు కాబట్టి నీవు వెళ్ళి ఆ నరసింహన్నతో చెప్పాలి. ఏంటంటే... నాకు ఇంకా మైనారిటీ తీరలేదు. ఈ వయసులో పెళ్ళికావడమంటే అది చట్టరీత్యా నేరం. ఒకవిధంగా చెప్పాలంటే ఈ వయసులో నాకు పెళ్ళి జరిపించడమంటే అది నా తల్లిదండ్రులు చేస్తున్న నేరం మాత్రమేకాదు, దొరబాబుగారు చేస్తున్న నేరం కూడా. కాబట్టి ఎలాగైనా ఈ పెళ్ళిని అడ్డుకోవాలి. ఈ విషయమై నేనే ఆ నరసింహన్నను కలిసేదాన్ని. కాని ఈ పెళ్ళి విషయమై నేను ఎలాంటి జోక్యం చేసుకోనన్నట్టుగా వుండాలి. ప్లీజ్..." అంతకంటే దారిలేదు అన్నట్టుగా పద్మజ గదవపుచ్చుకున్నాను.

"ఐడియా ఈజ్ ఓకే! బట్ నేను వెళ్ళి నరసింహన్నకు చెప్పడంకంటే స్వయంగా నీవే వచ్చి చెప్పుకుంటేనే నీబాధ ఏంటనేది అన్నకు తెలుస్తుంది" అంది పద్మజ.

"అలా అనొద్దే! దొరబాబుగారి మోచేతి నీళ్ళు తాగేవాళ్లం! ఇలాంటపుడు నేను నరసింహన్న ఇంటికి వెళ్లడం, ఆ వెంటనే దొరబాబుగారికి వ్యతిరేకత ఎదురుకావడం, ఇది సామాన్యమైన విషయంకాదు. మా కుటుంబానికి నష్టం కలిగే విషయం. దయచేసి నన్ను అర్థంచేసుకో" ప్రాధేయపూర్వకంగా పద్మజ రెండు చేతుల్ని బిగ్గరగా పట్టుకున్నాను.

"ఓకే ఓకే" నన్ను అర్థంచేసుకున్నట్టుగా నా వీపుమీద చిన్నగా కొట్టింది తను.

అది నా గుండెలోని బరువును ముప్పావుభాగం వరకు తొలగించింది.

★ ★ ★

"అబ్బాయి అన్నివిధాలా యోగ్యుడు. ఏడవతరగతివరకే చదువుకున్నప్పటికీ మంచి తెలివితేటలు గలవాడు. పైగా ఎలాంటి దుర్వ్యసనాలు కూడాలేవు. ఉదయం లేచింది మొదలు రాత్రి నిద్రబోయేవరకు నమ్మకంగా ఇంటిపట్టునే వుంటాడు. ఏదైనా అవసరమై పిల్లలు బయటకు పంపిస్తేనే తప్ప, గేటుదాటడం తెలీదు. అలాంటి బుద్ధిమంతుడు దొరకడం నిజంగా మీ అమ్మాయి అదృష్టమే అనుకోవాలి" అంటూ అమ్మానాన్నలతో అబ్బాయి గురించి అంతా చెప్పుకుపోయింది అమ్మగారు.

"అంతా మీ దయ అమ్మగారూ" చేతులు జోడిస్తూ అన్నాడు నాన్న.

"మీ అమ్మాయి చదువు అబ్బాయికంటే ఎక్కువయ్యుండొచ్చు కాని ఈ విషయం పెద్దగా పట్టించుకునేదికాదు. ఎందుకంటే మాలాంటి పెద్దవాళ్ళల్లో కూడా అబ్బాయి బుద్ధిమంతుడైతే చాలు, ఎక్కువ చదివిన అమ్మాయిల్ని ఆనందంగా ఇస్తున్నారు" చెప్పి నావైపు చూస్తూ "ఏం పాపా? చదువు గురించి పట్టించుకోవుకదా? " అంది అమ్మగారు.

'పట్టించుకోను' అన్నట్టుగా తల అడ్డంగా వూపాను. కాని మనసులో మాత్రం 'పరిస్థితుల కోసం నా ఇష్టాన్ని త్యాగం చేసుకోలేను అమ్మగారూ!' భారంగా అనుకున్నాను. ఇలాగని నాలో అసహాయత రాలేదు. గెలుస్తాననే ధీమా నా అంతరంగాన్ని బలంగా చుట్టేసుకునే వుంది.

అమ్మగారు ఆ అనవసరపు పెళ్ళి కొడుకు గురించి ఇంకా చెప్పుకుపోతూనే వుంది. నాకు కంపరమెత్తినట్టుగా వున్నా నిశ్శబ్దంగా వుండిపోయాను. అప్పుడే కాదు, .వారంరోజుల తర్వాత నన్ను పెళ్ళికూతురుగా ముస్తాబు చేసి, పెళ్ళికూతుళ్ల వరసలో ఒకచోట కూర్చోబెట్టినప్పుడు కూడా బెంబేలు ఎత్తిపోకుండా నిశ్శబ్దంగా వున్నాను. ఎందుకంటే పెళ్ళి సమయానికి నరసింహ అన్న పోలీసులతో కలిసి ఇక్కడికి వస్తాడని, వచ్చి నన్ను ఆదుకుంటాడని నాలో ధైర్యం నిండుగా వుంది. అందుకే మధ్యమధ్యలో తల ఎత్తి దారివైపు ఆత్రంగా ఎదురుచూస్తూనే వున్నాను.

మా పెళ్లికూతుళ్లకు ఎదురు వరసలో పెళ్ళికొడుకులు కూర్చుని వున్నారు. ఒక్కో జంటకు ఒక్కొక్కరుగా విచ్చేసిన పురోహితులు వేదమంత్రాల్ని చదువుతూ, ఆచారం ప్రకారం ముందుగా పెళ్లికొడుకులచేత తీర్థపూజ... చెంబుపూజ... యజ్ఞపూజ... వంటి వరకార్యాన్ని చేయిస్తున్నారు.

"ఏంటే? ఇంకాసేపట్లో జీలకర్రబెల్లం పెట్టిస్తారు. అప్పుడిక సగం పెళ్ళయిపోయినట్టే లెక్క. మరి నరసింహ్మాన్న ఆచూకీ ఇంకా కనబడదేం? " నా పక్కగానే కూర్చునివున్న పద్మజతో కాసేపటితర్వాత గుసగుసగా అన్నాను.

"వస్తాడు. టెన్షన్ పడొద్దు" గుసగుసగానే అంటూ నాచేయి నొక్కింది పద్మజ. తన గొంతులో 'హామీ' బలంగా వినిపిస్తోంది కాబట్టి నాలో ధైర్యం కూడా సడలలేదు. కాని చూస్తుండగానే సమయం జీలకర్ర, బెల్లం వరకు వచ్చేసింది.

"ఏంటే? " అప్రయత్నంగా ఈమారు నా గొంతు వణికింది. "డోంట్ వర్రీ" అంటూనే దారివైపు కంగారుగా చూడసాగింది పద్మజ.

ఆమెలోని కంగారు నా గుండె ధైర్యాన్ని క్రమంగా నశింపజేస్తుంటే నాకు తెలీకుండానే నా శరీరంలో సన్నని ప్రకంపన ఆందోళనగా మొదలయ్యింది.

"నేను ఓడిపోతున్నానా? " నా ఊహాప్రపంచాన్ని ఛిద్రం చేసినట్టుగా నా అంతరంగం అప్రమేయంగా సందేహపడింది. నేను తట్టుకోలేకపోయాను. ఆలోచనకే తల్ల డిల్లిపోతూ, పద్మవ్యూహంలో చిక్కిన దీను

రాలన్నై ఎటూ తోచక పెదవులు కొరుక్కోసాగాను.

అన్న ఎక్కడికి వెళ్ళినట్టు? దొరబాబుకి వ్యతిరేకంగా పోరాడటమంటే అతడికి అమృతం దొరికినంత ఆనందం. అలాంటిది ఇప్పుడు తన ప్రతాపాన్ని చూపించుకునే సమయం వచ్చినప్పటికీ, కనిపించకుండా ఏమై పోయినట్టు? కాపాడతానని పద్మజతో మాట కూడా ఇచ్చాడు. కాబట్టే ఇంతసేపటి వరకూ నేను భయం తెలియక వుండిపోయాను. కాని ఇప్పుడు నాలో తుపానుకు ముందు చెలరేగే ప్రకృతిలోని భయవిహ్వలమైన అలజడి మొదలయ్యింది. మరి నేను ఇప్పుడు ఏం కావాలి? అసలు ఎక్కడికి వెళ్ళాలి? ఏం చేయాలి? ఈ పరిస్థితిని ముందే ఊహించివున్నా పెళ్లిపీటలవరకు వచ్చేదాన్ని కాదు. నాకు నేనుగా ఎటైనా పారిపోయేదాన్ని. లేదంటే... నన్ను కాపాడమని నాకు నేనుగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్లక పోయినా పద్మజచేత ప్రయత్నించేదాన్ని.

"వసూ..." నా కలవరాన్ని గుర్తించినట్టుగా నా చెవి దగ్గర పద్మజ గొంతు వున్నట్టుండి వినిపించింది.

"ఆఁ? " ఆత్రంగా పలికి ఆ వెంటనే దారి వైపు చూశాను. ఎదురుచూస్తున్నవాళ్ళు ఎవ్వరూ కనిపించలేదు. మరి పద్మజ నన్ను ఎందుకు పిలిచినట్టు?

"ఏంటీ? " అడిగాను.

"భయపడొద్దే! పరిస్థితి ఏంటీ అనేది నాకూ అర్థం కావడంలేదు" తన గొంతులోనూ అలజడి ధ్వనించింది.

మునిగిపోతున్న నావను చిన్నదుంగ అడ్డుతగిలి కాపాడగలదా? కాపాడుతుంది అనుకుంటే అది అమాయకత్వమే అవుతుంది. అంటే? నేను... నా జీవితం... నా ప్రేమ...?

ఒక్కసారిగా నాకు ఏడుపు ముంచుకువచ్చింది. అదేక్షణంలో నేను ఓడిపోతున్నానేమో అనే ఇందాకటి ఊహ, నిజం కాబోతున్న పరిస్థితులు నెలకొంటూ... సంప్రదాయం ప్రకారం కొబ్బరిగిన్నెల్లో వుంచిన మంగళసూత్రాల్ని జనులందరికీ కూర్చున్న చోటునుంచే చూపించసాగారు పురోహితులు. ఇలాగని నేను పూర్తిగా నీరుగారిపోలేదు. నా నరనారాల్లో గెలవాలనే పట్టుదల పెరుగుతుంటే చప్పున లేచి నిల్చోబోయాను.

అంతలోనే నరసింహం అన్న తాలూకు మనిషి ఒకడు పందిట్లోకి ఆదుర్దాగా వస్తూ కనిపించాడు. అతన్ని చూడగానే పోతుందనుకున్న ప్రాణం చప్పున నిలదొక్కుకుందేమో అన్నట్టుగా గుండెలనిండా ధైర్యం వచ్చి చేరింది.

"అన్న ఏడీ? " నాలో నేనే అనుకుంటూ ఆ వెనక వచ్చే నరసింహన్న కోసం ఆత్రంగా గాలించాను. ఎవ్వరూ కనిపించలేదు. అంతలోనే మళ్ళీ నీరుగారిపోయాను.

నరసింహన్నకు దొరబాబుతో వైరుధ్యం వున్నప్పటికీ దొరబాబు బలగంతో నరసింహన్న సాటిరాలేదు. అలాగే శతృత్వాన్ని వ్యక్తపరుచుకుంటూ ఒకరు వున్న చోటుకి మరొకరు రాకపోవడంలాంటి చర్యలు కూడా లేవు. కోపం గట్రా ఏమైనా వున్నా అది ఎక్కడ వుండాలో అక్కడే వుంటుంది. కాబట్టే ఇప్పుడు నరసింహన్న తాలూకు వ్యక్తి పెళ్లి పందిట్లోకి రావడంతో ఎవ్వరికీ ఎలాంటి అనుమానాలు రాలేదు. రావు కూడా! ఈ ధైర్యంతోనే వచ్చిన వ్యక్తి దగ్గరకు వెంటనే లేచివెళ్లింది పద్మజ.

నేను ఆత్రంగా, ఆందోళనగా అటువైపే చూస్తున్నాను. వచ్చిన వ్యక్తి పద్మజతో ఏదో చెప్తున్నాడు. పద్మజ ముఖంలో రంగులు మారుతున్నాయి. ఆ దృశ్యం నా ప్రేమకు సమాధి కడుతున్న భావన కలుగుతుంటే నా మెడలో మూ..డు...ము..ళ్లు పడ్డాయి.

అచేతనంగా, అసహాయంగా క్రమంగా తలవంచిన నా దీనత్వానికి నా మనసు కునారిల్లిపోతుంటే అందుకు సాక్ష్యంగా నా

కళ్లు జాలిగా చెమర్చాయి.

"సారీ వసూ! నరసింహన్న టౌన్‌కి వెళ్లాడో లేదో యాక్సిడెంట్ జరిగిందట. విషయాన్ని పోలీసులకు ముందే ఫోన్ చేసి వెళ్లినా బాగుండేదికాని మన వూర్లో కేబుల్ ప్రాబ్లం! ఇప్పుడు నరసింహన్నకు డేంజర్ ఏమీ లేదుకాని నిన్ను తలుచుకుంటేనే నాకు ఏడుపొస్తోంది" ఓడిన నా బతుక్కి ఒక సంజాయిషీ ఇచ్చుకుంటూ ఎప్పట్లా నా పక్కన వచ్చి కూర్చుంది పద్మజ.

మనసు రెక్కలు తెగి... వలపు వంతెన విరిగి... భానూదయం అనుకున్న బతుకులో భయంకర బడబానల స్వప్నాలు రగిలి నా నిండు ప్రేమ నా పేదరికం ప్రమాణంగా జీవచ్ఛవమై కుమిలి... నేను నాకే అబద్ధమై పోతుంటే... నేను ఇంకేం మాట్లాడను? అందుకే తల కూడా పైకెత్తకుండా స్తబ్దుగా అలాగే కూర్చుండిపోయాను.

★ ★ ★

మరుసటిరోజు...

మా కుటుంబ ఆనవాయితీ ప్రకారం దొరబాబు దంపతుల ఆశీర్వాదం మరోమారు తీసుకుని ఆ ఇంటి గడపను కళ్లకు అద్దుకుని నా భర్త అనే ఒక వ్యక్తి వెంట అత్తవారింటికి బయలుదేరాను.

అమ్మానాన్న, చెల్లెళ్లు, వచ్చిన బంధువులు నేను వెళ్తుంటే కళ్లనీళ్లు పెట్టుకున్నారు. అప్పటికే నేను బండరాయిలా మారిపోయాను కాబట్టి ఎవ్వరి కన్నీళ్లకూ నేను చలించలేకపోయాను. కాకపోతే పాద నమస్కారం చేసినప్పుడు దొరబాబు దంపతులు ఇచ్చిన నూటపదహార్లని నాన్న కంట్లో పడకుండా పెద్ద చెల్లెలి చేతిలో పెడ్తూ "నీవూ చెల్లెళ్లు ఏమైనా తెచ్చుకోండి" చెప్పాను.

ఆమాత్రానికే దాని కళ్లు మెరిసాయి. ఇలా కాకుండా నేను అనుకున్న వాడిని పెళ్లి చేసుకుని వాళ్ల జీవితాలకు అన్నీ సమకూరుస్తుంటే ఇంకెలా వుండేది?

'గతాన్ని ఇక తలుచుకోవద్దు' నిర్వీర్యమైన మనసుని నా గుప్పిట్లో బంధించుకునే ప్రయత్నం చేస్తూ నాలో నేనే అనుకున్నాను. అనుకున్నానేగాని నా ప్రయత్నం ముందు నా ప్రేమ అదేపనిగా ఓడిపోతూనే వుంది. ఫలితంగా నా అంతరంగాన బద్దలౌతున్న వేనవేల అగ్నిపర్వతాలు.

నిన్న పెళ్లయ్యింది మొదలు నాతో మాట్లాడాలని తెగప్రయత్నిస్తున్న నా మొగుడనే అతగాడిని నేను ఎప్పటికప్పుడు తప్పించుకుంటున్నా అది ఎంతో కాలం సాగని పని అని నాకు ప్రతిసారీ అర్థమౌతుంటే నాలో కంపరపవనాలు కూడా వీయసాగాయి. అవి క్షణక్షణానికి ఉధృతమౌతూ జీవితంపై అనాసక్తిని పెంచసాగాయి. అవునుమరి... ఇష్టంలేని వాడితో పెళ్లి అనేది చావుతో సమానం.

ప్రయాణికుల్ని చేరవేసే ఏడుసీట్ల ఆటోలో టౌన్ వరకు వెళ్లాక, హైదరాబాదు వెళ్లే ఆర్డినరీ బస్సు సిద్ధంగా కనిపించింది. ఆలస్యం చేయకుండా బస్సు ఎక్కి కూర్చున్నాం. అతడికి ఆటోలో నా పక్కగా సీటు దొరకకపోయినా బస్సులో దొరికింది. ఇక అదే అదనుగా అతడు నన్ను పూర్తిగా తగులుతూ కూర్చుని నాతో మాటల్ని ఎలా కలపాలా అన్నట్లుగా ఉద్వేగపడసాగాడు. ఆ తీరు నాకు అసహ్యాన్ని కలిగించసాగింది. అయినప్పటికీ నా భావాల్ని బయట పడనీయకుండా కిటికీలోంచి బయటకి చూస్తూ కూర్చున్నాను. మేము కూర్చున్నది ఇద్దరి వ్యక్తుల సీటు కాబట్టి, పక్కన మరొకరు వున్నారనే ఇబ్బందిలేదు కాబట్టి, పైగా నేను తన పెళ్లాన్ని అనే అధికారం వుంది కాబట్టి నేను పట్టించుకోనట్టుగా కూర్చున్నప్పటికీ నా భుజంపై అనూహ్యంగా చేయి వేసి మృదువుగా, ప్రేమగా పిలిచాడు.

"వసుంధరా"

ఆ పిలుపు నాలో చీకాకు కల్పించింది. అందుకే వెంటనే ప్రతిచర్య చూపుతూ ఏంటన్నట్టుగా చూస్తూనే అతడి చేతిని నా

భుజంపైనుండి తీసివేశాను.

"ఒంటరిగా వున్నాం. ఏమైనా మాట్లాడుకుందాం" నా కళ్లల్లోకి గుచ్చి చూస్తూ చెప్పాడు. ఆ చూపులో భావావేశపు గురుతులేకాదు, ప్రేమ చైతన్యపు ఝురులు కూడా వున్నాయి. కాని అవి నాకు అక్కర్లేదు. కాబట్టే వెంటనే అతడ్ని తప్పించుకునే ప్రయత్నంగా "బస్సులో కూర్చుని వున్నాం" ఇబ్బందిగా చెప్పాను.

నా సమాధానం అతడిలో నిరాశను కలిగించింది. ఆ తాలూకు భావాలు అతడి తీరులో స్పష్టంగా కనిపిస్తుంటే అతడు ఇక మారు మాట్లాడలేదు. చప్పున బుద్ధిమంతుడైపోయాడు.

"హమ్మయ్య" మనసులోనే హాయిగా ఊపిరిపీల్చుకున్నాను. కాసేపటి తర్వాత బస్సు కదిలింది. బస్సుతోపాటుగా నాలో ఆలోచనలకు కూడా చలనం వచ్చేసింది. నా ఆలోచనలో నిండుగా పెదబాబు నిండి వున్నాడు. అంతక్రితం వరకు నా పెదబాబు గురించి ఇక ఆలోచించకూడదు అనుకున్న నేను ఇప్పుడు మాత్రం నిరాటంకంగా ఆలోచిస్తున్నాను. ఆలోచిస్తూ సముద్రాన్ని అవుతున్నాను. మహా సముద్రాన్నయి పొంగుతున్నాను.

ఎప్పుడైతే గతాన్ని విస్మరించాలనుకుంటామో అప్పుడే వర్తమానంతో రాజీకి సిద్ధపడతాం. నిజమే కాని నేను ఇప్పుడు గతాన్ని మరిచిపోలేకపోయినా చేసేది ఏమీ లేదు. ఒయాసిస్సుల్ని కలలుగన్న ఎండమావిని కాబట్టి తొలకరి జాడలు లేకపోయినా తొండిగా బతకాల్సిందే!

మరి కాసేపటికి బస్సు ఒక వూర్లో ఆగింది. బస్సు ఆగిపోగానే నా ఆలోచనలకు కూడా తెరపడింది.

"పది నిముషాలు టైంవుంది. టిఫిన్లు చేయండి" చెప్తూనే బస్సు దిగిన కండక్టర్‌తో పాటుగా చాలామంది ప్రయాణికులు కిందికి దిగసాగారు.

"ఏమైనా తింటావా? " నాతో మాట్లాడ్డానికి అతడికి మళ్లీ అవకాశం దొరికింది.

"ప్చ్" వద్దన్నట్టుగా అన్నాను.

అతడు నాతో ఇంకేం మాట్లాడలేదు. వెంటనే లేచి కిందికి వెళ్లాడు.

"తనొక్కడే మింగి వస్తాడు కాబోలు" మనసులోనే తిట్టుకుంటూ వెళ్తున్న అతగాడిని వెనకనుండి కొరకొరా చూశాను.

నా ఆలోచనను తారుమారు చేస్తూ ఓ ఐదు నిముషాల్లో అతడు తిరిగి వచ్చేశాడు. అతడి చేతిలో రెండు ప్యాకేజీలు వున్న ఓ పాలిథీన్ కవరు వుంది.

'ఏంటో పంచభక్ష్యపరమాన్నాలు' మనసులో వ్యంగ్యంగా అనుకుంటూ అతడు అందించిన కవర్‌లోని ప్యాకేజీలను వెలుపలికి తీసి చూశాను. ఒక ప్యాకేజీలో సమోసాలు వున్నాయి. మరో ప్యాకేజీలో మల్లెపూలు వున్నాయి. పువ్వులంటే నాకు సహజంగా ఇష్టం కాబట్టి వెంటనే తలలో తురుముకున్నాను. అవి తను తెచ్చిన పువ్వులు కాబట్టి నా ఇష్టం గురించి తెలియని అతగాడి పెదవులపై నిండుగా ఓ చిరునవ్వు మెరిసింది. ఆ నవ్వు నాకు చీకాకు తెప్పించింది. కాని బయటపడలేను.

"ఇవి నాకొద్దు" కావాలనే సమోసాల్ని అతడికి తిరిగి ఇచ్చేసి కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నాను.

"నాకోసం తిను" అనూహ్యంగా అన్నాడతడు.

"నీకోసమా? " లోలోపలే పరిహసించుకుంటూ అతడి ముఖంలోకి చూశాను.

పెదబాబును చేసుకుంటే నీవు నా కాళ్ల దగ్గర పడివుండాల్సిన వాడివి. కాలానికి తలవంచినా మనసులో నీకు చోటు ఇస్తాననుకోవద్దు. నా మనసును రగిలించిన కాలం నన్ను చూసి భయపడేలా మారిపోతాను.

అతడ్ని చూస్తున్న కొద్దీ నాలో ఆవేశం, అసహ్యం ఒక్కుమ్మడిగా పెరిగిపోసాగాయి.

అందుకే ఎక్కువసేపు ఇక అతడివైపు చూడలేక చప్పున తల తిప్పుకున్నాను.

"వసుంధరా" నాలోని భావాల్ని చదవగలిగాడో లేక తన ప్రేమను చాటుతున్నాడో తెలీదుకాని కాసింత ఉద్విగ్నంగానే పిలిచాడు.

"ఏంటీ? " నన్ను నేను అదుపులో పెట్టుకోలేని స్థితిలో విసురుగా అతనివైపు తిరిగాను.

అతడు ఒక్కసారిగా బిత్తరపోయాడు.

"నాకు తలనొప్పిగా వుంది అర్థం చేసుకోండి" పరిస్థితుల్ని పిడికిళ్లలో బిగించుకుంటూ అనారోగ్యాన్ని కళ్లల్లోంచి పలికించాను.

"అదా? మాత్రలు తీసుకురానా? " బిత్తరపోయిన వాడల్లా కుదుటపడుతూనే ఆత్రంగా అడిగాడు.

"ప్రయాణంలో నాకు సహజంగానే తలనొప్పి పుడుతుంది" చెప్పి సీటులో వెనక్కి జారగిలబడి కళ్లు మూసుకున్నాను.

మూసిన నా కనురెప్పల చాటు చీకటి నా జీవితాన్ని నిర్వచిస్తుంటే నాలో నేను కసిగా అనుకున్నాను.

నన్ను కన్నీళ్లు పెట్టించిన దైవమా! సర్దుకుపోవడమో చావడమో చేస్తాననుకోవద్దు. నీవు నన్ను శాసిస్తే నేను నీవు పంపిన వాడిని శాసిస్తాను.

సాయంకాలానికల్లా నగరం చేరుకున్నాం. గౌలిగూడలో బస్సు దిగి, అక్కడ్నుండి రిక్షాలో బయలుదేరి వెళ్లాం. నా బతుకు లాగే బరువుగా కదులుతోంది రిక్షా.

"అదిగో అక్కడ దూరంగా కనిపిస్తోంది చూడూ! అదే మన దొరగారి అపార్టుమెంటు" కాసేపటి తరువాత చూపించాడు అతడు.

మనసు స్తబ్దుగా వుంది కాబట్టి అతడు చూపించిన దిశగా జీవంలేని కళ్లతో దీనంగా చూశాను. వాస్తవానికి నేను పుట్టింది మొదలు పట్నం ముఖం చూడలేదు. సినిమాల్లో, టీవీల్లో నగరవాతావరణాన్ని చూస్తూ ఆ వాతావరణాన్ని నిజంగా చూసి తరించాలని ఎన్నో కలలు కనేదాన్ని. అవన్నీ ఇప్పుడు మాయమైపోయాయి. కాబట్టే నగర పరిసరాల్ని ఏమాత్రం పట్టించుకోలేని దాన్నయి మౌనంగా కూర్చుండిపోయాను. నా పరిస్థితి అంచనా వేయని అతగాడు మాత్రం ఇంకా ఏదేదో చెప్పుకుపోయే ప్రయత్నంగా మళ్లీ కల్పించుకున్నాడు.

"నీకు తెలుసా? ఆ అపార్టుమెంటులో సినిమావాళ్ల ఆఫీసు ఒకటి వుంది. అక్కడికి పెద్దపెద్ద హీరోలు హీరోయిన్లు వస్తుంటారు. ఓ మారు చిరంజీవిగారు అక్కడికి వస్తే నేను వెళ్లి ఫొటో తీసుకున్నానుకూడా! ఆ ఫొటోను ఇంటికి వెళ్లాక చూపిస్తాను"

నాకు ఇష్టమైన దొరబాబు బంగళానే నేను ఆసక్తిగా చూడలేకపోయాను. నా మనసు పడుతున్న వేదనలో నేను సమిధలా కాలిపోతూ నిలువెత్తు స్మశానాన్ని అవుతున్నాను. అలాంటిది ఇప్పుడు ఇతగాడు తన ఆనందాన్ని నాతో పంచుకోవాలని ప్రయత్నిస్తే నేను ఎలా ఓర్చుకోగలను? అందుకే వెంటనే కల్పించుకుంటూ "అసలే ప్రయాణంలో అలసిపోయాను. వెళ్లగానే అలాంటి పనులేం చేయొద్దు" పెడసరంగా చెప్పాను.

నా మాట అతడ్ని చిన్నబుచ్చింది. అయినప్పటికీ మళ్లీ పెదవి విప్పాడు "సరేలే! రేపు చూపిస్తాను"

అందుకు నేనేం మాట్లాడలేదు. తనే నన్ను మాట్లాడించే ప్రయత్నం చేశాడు.

"వసూ... నిన్ను చూస్తుంటే నీకు ముక్కుమీద కోపం అని నాకు అర్థమౌతోంది. కొత్తగా పెళ్లయిన వాళ్లం కాబట్టి ఈ కోపతాపాల్ని పక్కకుపెడితే బాగుంటుంది! అవునంటావా? "

'నాది ముక్కుమీద కోపం కాదు, నీమీద అయిష్టత' మనసులోనే అనుకుని పైకి మాత్రం "ఆ! అవును" అన్నట్టుగా అన్నాను.

"మరి ఎంచక్కా ఏమైనా మాట్లాడ రాదూ? " ఆ వెంటనే చిరునవ్వుగా అడిగాడు.

'నీతో అనవసరంగా మాటలెందుకని. నీకు అనుగుణంగా తలాడించగానే నెత్తి నెక్కి కూర్చుంటావు. ఇక నుండి నీతో జాగ్రత్త అవసరం' మనసులోనే అనుకుని "నాకేం మాట్లాడాలనిపించడంలేదు" చప్పున చెప్పేశాను. ,

"పోనీలే నేనే మాట్లాడ్తాను విను" అన్నాడతడు.

'వదిలేట్టులేదు' లోలోపలే విసుక్కున్నాను. కాని నా మనసు అతడికి తెలిసి ఛస్తేకదా! అందుకే తనకు తోచిందల్లా చెప్పుకుపోసాగాడు.

అతడి వాగుడు వినలేక నా తల ఇక వేయి ముక్కలైపోతుందేమో అన్నట్టుగా క్షణక్షణానికి నాలో విసుగు మోసులెత్తసాగింది. అది గమనించిన ఆ కాలం నన్ను నంగనాచిలా కాపాడినట్టుగా బంగళావద్దకు చేరుకుంది రిక్షా! దాంతో అతడి నోటికి మూతబడింది.

"హమ్మయ్య" ఆ సమయానికి అతడి పీడ విరగడైపోయినందుకు లోలోపలే ఊపిరిపీల్చుకున్నాను. కాని జీవితాంతం అతడి పీడను భరించాల్సిందేనని మరోవైపు హడిలిపోతున్నాను కూడా.

పల్లెలోని తను పాతకాలపు బంగళాకు ధీటుగా ఈ పట్నంలోనూ అధునాతన బంగళాను నిర్మించుకున్న దొరబాబుగారి రాజసాన్ని చూడ్డానికి నిజంగా ఎవ్వరికైనా రెండు కనులు సరిపడవు. కాని నాలో మాత్రం పెద్దగా ప్రతిచర్య కనబడలేదు. మనసు, జీవితం రెండూ నిర్వీర్యం అయిపోయాయి కాబట్టి నిశ్శబ్దంగా రగిలిపోతూ నిస్సత్తువగా అతడి వెనకాల నడిచాను.

సమయానికి కరెంటు లేదు కాబట్టి లిఫ్టు కోసం వేచి చూడకుండా నెమ్మదిగా అతడితోపాటుగా మెట్లెక్కసాగాను. అక్కడ మళ్లీ మొదలయ్యింది అతడి కబుర్ల ఖాతా! కాకపోతే ఈమారు అతడు నాకు ఇష్టమైన వ్యక్తుల గురించి మాట్లాడ్తున్నాడు కాబట్టి ఊకొడుతూ వినసాగాను.

"వసూ... ఈ అపార్ట్‌మెంట్‌లో మొత్తం ఐదు అంతస్థులు వున్నాయి. ఒక్కో అంతస్థుకి ఆరేసి పోర్షన్‌లు వున్నాయి. ఈ ఐదు అంతస్థులకు పైన విశాలమైన ఆరుగదుల ఇల్లు వుంది. ఆ ఇంట్లోనే దొరబాబు వాళ్లు వుంటారు. ఆ ఇంటి ముందు వున్న రెండు అంకునాల రేకుల ఇంట్లో మనం వుంటాం.

దొరబాబుగారి అదృష్టం ఏందోగాని కొడుకులు ముగ్గురూ ముగ్గురే! అందంలో చూసినా గుణంలో చూసినా శ్రీరామచంద్రులు! నేను పనోడ్ని అయినప్పటికీ నన్ను ఎంత బాగా చూసుకుంటారని? నా చిన్నతనం నుండి ఇక్కడ వుంటున్నాను. ఎప్పుడూ కూడా నన్ను గిల్లలేదు గిచ్చలేదు, పల్లెత్తు మాట అనలేదు. అన్నింటికి మించి ఇప్పుడు నిన్ను నాదాన్ని చేశారు. అంతా నా అదృష్టం" అని సుదీర్ఘంగా చెప్పుకుపోయాడు.

చివరి మాటలు చెప్పేటప్పుడు మాత్రం అతడి ముఖంలో అతీతమైన ఆనందం కనిపించింది.

'నన్ను పొందినందుకు నీ జీవితం ధన్యం అనుకుంటున్నావు. కాని నిన్ను పొందినందుకు మాత్రం నా జీవితం వ్యర్థమైపోయింది...' మనసులోనే వాపోయాను.

"వసూ... నీకు ఇంకో విషయం తెలుసా? నా తిండీతిప్పలు అంతా అబ్బాయిగార్ల దగ్గరే! పైగా సంవత్సరానికి రెండు జతల మంచి బట్టలు కూడా కుట్టిస్తారు. ఇలాంటపుడు నాకు జీతం ఇవ్వాల్సింది లేదు. కాని నా ఖర్చుల కోసమని నెలకు వెయ్యి రూపాయలు జీతం కింద ఇస్తారు. కూడు, గూడు, తోడుగా డబ్బులు... నిజంగా ఇట్లాంటి యజమానులు నాలాంటి ఏ ఒక్కరికో దొరుకుతారు. అసలు చెప్పాలంటే నా స్థానంలో వేరే ఇంకెవరైనా వుంటే ఇష్టం వచ్చినంత

సంపాదించుకోవచ్చు అవునుమరి! అబ్బాయిగార్లు ముగ్గురూ బయటకి వెళ్లినా ఇంటికి తాళం వేయరు. అంతా నా మీద వదిలేస్తారు. ఇంతేకాదు సరుకులు తీసుకు వచ్చినప్పుడు, ఏమైనా వస్తువులు తీసుకు వచ్చినప్పుడు, తమ అవసరాలకు బయటకు పంపించినప్పుడు ఇంకా చాలాసార్లు ఎక్కువ డబ్బులు ఇస్తారుగాని ఖచ్చితంగా లెక్కలు అడగరు. కానీ నేను మాత్రం అబ్బాయిగార్ల అనుమతి లేకుండా ఐదు పైసలు కూడా తీసుకోను. ఎందుకంటే నేను ఈ రోజు ప్రాణాలతో వున్నానూ అంటే ఆ దొరబాబే కారణం. అలాంటి వ్యక్తులకు కలలో కూడా మోసం చేయకూడదు. చేస్తే ఆ దేవుడు కూడా నన్ను క్షమించడు. నా చిన్నతనం నుండి వాళ్లు నన్ను ఎంత నమ్మకంగా చూశారో వాళ్లతో కూడా నేను అంత నమ్మకంగా పని చేస్తూ వస్తున్నాను. కాబట్టేకదా ఈ రోజు దేవతలాంటి నిన్ను నా జీవితంలోకి తీసుకువచ్చారు" చెప్తూ వెళ్లి ఒక చోట ఆగాడు అతడు.

నేను కూడా అతడితోపాటుగా ఆగిపోయాను.

"ఆయాసం అన్పిస్తోంది కదూ? " అంటూ నొసలుకు పట్టిన చెమటను తుడ్చుకుని తన భుజాలకు తగిలించుకుని వున్న కుట్టుడు సంచుల్ని కిందికి దించాడు.

"ఆ..." అవును అన్నట్టుగా అంటూ నేను కూడా నా చేతిలోని పెట్టెను కింద పెట్టేశాను.

"కాసేపు కూర్చుందాం" అంటూ అక్కడే మెట్ల మీద ఒక పక్కగా విశ్రాంతిగా కూర్చున్నాడతడు. నేను అతడ్ని దాటుకుని వెళ్లి మూడు మెట్లకు పైన కూర్చున్నాను. అందుకు అతడు నావైపు 'మనమధ్య అంత దూరం ఎందుకు?' అన్నట్టుగా చూసి ఆ వెంటనే ఓ మెట్టుపైకి జరిగి కూర్చున్నాడు. అది చూసి నా మనసు రుసరుసలాడింది. అతడు మాత్రం నేను నా మనసు తెలియనివాడై తిరిగి ఎప్పట్లా కబుర్లలోకి దిగుతూ

"నీకు తెలీదు. అబ్బాయిగార్ల వంటోడ్ని కూడా నేనే! నన్ను చూస్తే వీడికి వంటొస్తుందని ఎవరూ అనుకోరు. వీడికేం వస్తుంది సంకటికూడు అని ఎగతాళి చేస్తారు. కానీ నేను వంటలో నలుడికంటే ఎక్కువ. అందుకేకదా! నేను వంటోడిగా మారింది మొదలు అబ్బాయిగార్లు హోటల్ ముఖం చూడలేదు. అంతకుముందు అయితే రోజూ హోటల్ నుండే క్యారియర్ వచ్చేది. ఆ హోటల్ తిండిని ఒక పూట తిన్నట్టు, మరోపూట తిననట్టు కుప్పలు కుప్పలు అట్లాగే మిగిల్చేవాళ్లు. అది చూసే నేను మెల్లగా వంట నేర్చుకున్నాను. ఇప్పుడు చూసుకో నా సామిరంగా" అంటూ తన గొప్పతనానికి తనే లొట్టలువేసి "నా వంట తినడం కోసం అబ్బాయిగార్ల స్నేహితులు కూడా ఎగబడుతుంటారు అంటే నమ్ము" కళ్లింత చేసి అన్నాడు.

అంత గొప్ప వంటవాడివా? లోలోపలే వెటకారంగా అనుకుని పైకి మాత్రం మౌనంగా వుండిపోయాను.

"ఇప్పుడు నువ్వొచ్చావు కదాని వంట పని నీ వంతుకు వస్తుందేమో అనుకోవద్దు. ఆ వంతు మాత్రం ఎప్పటికీ నాదే! కాకపోతే కస్సుకొట్టడం, అంట్లు తోమడం, నీళ్లు చల్లి ముగ్గుపెట్టడం వంటి చితక పనులకు మాత్రం నేను ఇంక దూరమౌతాను. సరేనంటావా? " అడిగాడు.

"హూ" సరే నన్నట్లుగా తలాడిస్తూ అన్నానేగాని ఆ మాట నాలో కల్లోలం రేపింది. అతడి భార్యగా నేనూ ఆ ఇంటికి పనిమనిషిగా మారిపోవడం అనేది ఎప్పుడో తెల్సిన మాట. కానీ ఆ మాటను అతడి నోటి నుండి వింటుంటే మాత్రం కొత్తగా వింటున్నట్టుగా ఎదలోతుల్లో అలజడి ఉవ్వెత్తున ఎగిసిపడింది. పనివాళ్ల కడుపున పుట్టాను, పనిపిల్లగా బతికాను కానీ పనిపిల్లగానే ఎప్పటికీ జీవించాలని మాత్రం అను

కోలేదుకదా! అందుకేనేమో నాకు తెలీకుండానే అకస్మాత్తుగా దుఃఖం కూడా పొంగుకు వచ్చింది. కాని దుఃఖాన్ని బలవంతంగా గొంతులోనే పూడ్చేసుకున్నాను.

"పెళ్లి కాగానే జీతంకింద ఇచ్చే వెయ్యి రూపాయల్ని రెండు వేలకు పెంచుతామన్నారు కూడా!" ప్రపంచాన్ని సాధించినట్టుగా మెరిసే కళ్లతో చెప్పి ఆ తర్వాత లేచి నిల్చుంటూనే సంచుల్ని ఎప్పట్లా భుజాలకు తగిలించుకున్నాడు. అతడితో పాటుగా నేనూ లేచి నిల్చుని పెట్టెను చేతిలోకి తీసుకున్నాను.

"ప్చ్! ఈ కరెంటు ఇప్పట్లో వచ్చేట్టులేదు" తమతోపాటుగా మెట్లు ఎక్కుతూ దిగుతున్న వాళ్లను చూస్తూ తనంతట తను అనుకుని "వసూ... ఎంతసేపని మోస్తావు? ఆ పెట్టె కూడా ఇటివ్వు!" తిరిగి మెట్లెక్కబోతూ పెద్ద మనసుతో అడిగాడు.

ఇప్పటికే బరువైన రెండు సంచుల్ని మోస్తున్నాడతడు. ఇక నా చేతిలోని పెట్టెను కూడా అతడికే ఇవ్వడం ఎంతయినా కూడా బాగుండదు. ఇలాగని అతడి భారాన్ని చూసి నాకు బాధ కలుగుతుంది అనుకుంటే పొరపాటు. కేవలం చూసే జనాల్లకైనా బాగుండాలి. అందుకే "ఫరవాలేదు" వద్దన్నట్టుగా అన్నాను.

అయినాగాని అతడు వినిపించుకోలేదు. "అసలే మెట్లు ఎక్కుతున్నాం. ఈ బరువును నీవు ఇంతసేపు మోయడమే గొప్ప" అంటూనే నా చేతిలోని పెట్టెను బలవంతంగా తీసుకున్నాడు.

"నా పెట్టె బరువును మోయడం కాదురా! నన్ను పెళ్లి చేసుకున్నావు కాబట్టి ఇక మీదట నీ జీవితమే నీకు బరువుగా తోయడం ఖాయం" వెనకనుండి అతగాడిని కొరకొరా చూస్తూ లోలోపలే పళ్లు నూరాను.

తర్వాత కొంతదూరం వరకు అతడేం మాట్లాడలేదు. ఆ తర్వాత మళ్లీ కల్పించుకుంటూ "వసూ! ఇంతకుముందు నా పనిలో నిన్ను భాగం పంచుకోమన్నాను చూడు! అందుకు భయపడిపోయావా ఏం? " నా వేదన నాకైతే తన ధోరణి తనదైనట్టుగా అడిగాడు.

"ఆహా! దొరబాబువికదా! నేను భయపడితే నన్ను ఏడంతస్థుల మేడలో వున్న వరహాల ఊయలలో కూర్చోబెట్టి ఊపుతావు" అలాగే పళ్లు నూరుతూ వెటకారంగా నాలో నేనే అనుకున్నాను.

"భయపడ్డావా? " నేను ఏమీ అనకపోయేసరికి చప్పున ఓ మారు తిరిగి చూశాడు అతడు.

"అలాంటిది ఏం లేదు" ముభావంగా చెప్పాను.

"అది సరేకాని నేను అలా అన్నానని నిజంగానే పనిలో భాగం పంచి ఇస్తానని అనుకోవద్దు. నేను ఏదైనా నీ ఇష్టానికే వదిలేయాలనుకుంటున్నాను" తనేదో ఉద్ధరించేవాడిలా అన్నాడు.

అందుకు నేను ఏమీ అనలేదు. మళ్లీ తనే కల్పించుకుంటూ "నీలో నేను కొత్త వసుంధరను చూడాలి" అనూహ్యంగా అన్నాడు.

"కొ...త్తా? " నా కనుబొమ్మలు ముడిపడ్డాయి. అయినప్పటికీ నా సందేహాన్ని నివృత్తి చేసుకునే ప్రయత్నం మాత్రం చేయలేదు. అతడు మాత్రం ఇంకా ఇంకా మాట్లాడుతూ పోతున్నాడు. అతడి మాటలు ఈసారి బంగళాలో నివసిస్తున్న కుటుంబాల చుట్టూ తిరుగుతున్నాయి.

అందరి గొప్పతనాల్ని బాగానే కంఠస్థం చేశావు. నీ గొప్పతనం మాత్రం గుండుసున్న. క్షణక్షణానికి అతడి ఉనికి నన్ను ఉన్మాదిలా మారుస్తుంటే అతడ్ని ఇక భరించలేకపోతూ మనసులోనే ఆవేశపడిపోయాను.

అతడి మాటలు, నాలోని కోపం రెండింటిమధ్య ఎలా ముందుకు వెళ్లిపోయానో తెలీదుకాని వసూ అని అతడు పిలిచే వర

కుగాని చేరుకోవాల్సిన చోటు వచ్చేసిందనే సంగతే నాకు తెలీకుండాపోయింది.

"అదిగో! అది మనం వుండే ఇల్లు" ఎడంగా వున్న రేకు కప్పు ఇల్లును చూపించి ఆ తర్వాత "ఆ ఇంటికి వెళ్లేముందు ఈ ఇంటికి వెళ్లి అబ్బాయిగార్ల ఆశీర్వాదం తీసుకుంటే బాగుంటుంది" చెప్తూనే ఎదురుగా వున్న అధునాతన ఇంటివైపు నెమ్మదిగా అడుగులు వేశాడు అతడు.

నేను అతణ్ని అనుసరించాను. కాగా నాలో ఇప్పుడు ఇంత క్రితంలా ఏ స్తబ్ధతో, ఏ గందరగోళమో, ఏ బాధనో లేదు. వాటి అన్నింటినీ మినహాయిస్తూ ఓ అలజడి వచ్చి చేరింది. దీంతో నాకు తెలీకుండానే నా శరీరం కంపించడం మొదలెట్టింది.

పెదబాబు ముందుకు వెళ్తున్నాను అనే ఒకే ఒక భావన నన్ను అలా నిలువెత్తున సాధిస్తూ వేధిస్తుంటే ప్రేమ జ్వాలల్లో నుసిగా మారిన మానసినై అతడితో పాటుగా ఆ ఇంట్లోకి అడుగుపెట్టాను.

మొదటి హాల్లో ఎవరూ కనబడలేదు. కానీ పల్లెలోని బంగళాలో కంటే ధీటుగా ఖరీదైన వస్తువులు పొందికగా అమర్చబడి మా బోటి బతుకుల్ని నిండుగా పోషించే ఉదారత్వం మాత్రం స్పష్టంగా కనబడింది.

"బాబుగారూ" బయటినుండే వినయంగా పిలుస్తూ లోపలికి చూశాడు అతడు.

అప్పుడే లోపల్నుంచి బయటకు వస్తున్న చినబాబు, మమ్మల్ని అలా చూసీచూడగానే ఆత్మీయంగా నవ్వుతూ "వాహ్! మేడ్ ఫర్ ఈచ్ అదర్" గుండెల నిండుగా అన్నాడు.

అందుకు నేను చిరునవ్వు నటిస్తూ అతడితోపాటుగా చినబాబుకి చేతులు జోడించాను.

"ఇప్పుడేనా రావడం? " అడుగుతూ అతడికి చేరువగా వచ్చి అతణ్ని సాదరంగా కావలించుకుని "మల్లేశం! ఒక ఇంటివాడివి అయిపోయావు. మరి ఇందుకు నీవే మాకు పార్టీ ఇస్తావా? లేక మేమే మీ ఇద్దరికీ పార్టీ ఇవ్వాలా? " సరదాగా అడుగుతూ అంతకంటే సరదాగా అతడి జుట్టుని కదిపాడు చినబాబు.

అందుకు అతడు ఇబ్బంది పడిపోతూ తల గోక్కోసాగాడు. నేను మాత్రం కృత్రిమమైన చిరునవ్వుని పెదిమలపై అలాగే నిలుపుకుని నా పెదబాబు కోసమని మాటిమాటికీ లోపలికి చూస్తూ లోలోనే చస్తూ జీవన్మృతినై చితికిపోతున్నాను.

"ఏమ్మా! అంతా కులాసానా? మా మల్లేశం అసలే అమాయకుడు. మరి వీణ్ని అసాధ్యుడిగా మార్చాల్సిన బాధ్యత నీదే" వయసులో నా కంటే బాగా చిన్నవాడయినప్పటికీ పెద్దరికంతో ప్రవర్తిస్తూ అతడి భుజాన్ని చిరునవ్వుగా తట్టాడు చినబాబు.

అంతలోనే నడిపిబాబు వెలుపలికి వచ్చాడు. రాగానే మమ్మల్ని ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ "మిస్టర్ అండ్ మిసెస్ మల్లేశం! ఇద్దర్నీ చూస్తుంటే పాత సినిమాలో నాగేశ్వరరావు, జమున గుర్తొస్తున్నారు" గడగడా అనేశాడు. మరి ఆ బాబుగారి మాటల్లోని మర్మం నిజమైన పొగడ్తో లేక వ్యంగ్యమో నాకు అంతుబట్టలేదు కాని ఆ బాబుగారు నేరుగా వచ్చి మా మల్లేశాన్ని చినబాబుకి మల్లే కావలించుకుంటున్నప్పుడు మాత్రం వాళ్ల యాజమాన్యం స్వంత ఇంటిలాంటిది అని మాత్రం స్పష్టంగా అర్థమైంది.

"అన్నయ్యా! మల్లేశం మనకు భాస్కర ప్యాలెస్‌లో పార్టీ ఇస్తాడంట. ఇందాకే చెప్పాడు. కదమ్మా? " అతడిపై హాస్యాన్ని సృష్టించే ప్రయత్నంగా తన అన్నతో ఆ మాట చెబుతూనే ఋజువుకోసం అన్నట్టుగా నావైపు ఓ మారు చూశాడు చినబాబు.

"అవునా మల్లేశం" అతడి భుజాన్ని తడుతూ చిన్నగా శబ్దం చేస్తూ నవ్వాడు నడిపిబాబు.

"ఏం లేదు బాబుగారూ" అతడు ఇబ్బందిగా మెలికలు తిరిగిపోయాడు.

"సర్లేగాని హనీమూన్ ఎక్కడికి వెళ్తున్నారు? " అతడి ముఖంలోకి గుచ్చిచూస్తూ అడిగాడు నడిపిబాబు.

"ఊరుకోండి బాబుగారూ" అతడిలో అదే ఇబ్బంది.

"ఏమ్మా? హనీమూన్ వెళ్లట్లేదా? " నా వైపు చూశాడు నడిపిబాబు.

నాదనే అవస్థ నన్ను చిత్రవధ చేస్తుంటే చిరునవ్వు అనే ఆభరణాన్ని పైపూతగా పులుముకుని మొదట్నుండి ఎలా వున్నానో ఇప్పుడు ఆ బాబుగారి ప్రశ్నకు సమాధానంగా కూడా అలాగే వుండిపోయాను. వాస్తవం చెప్పాలంటే నా పెదబాబు కోసం వేచిచూస్తున్న నా ప్రేమ హృదయానికి రెక్కలు తెగిపోగా నేననే మనిషికి మాట పెగలడంలేదు.

"ఓకే ఓకే! మీ హనీమూన్‌కి ఒక మంచి స్పాట్ సెలెక్ట్ చేస్తాను" అంటూనే ఆలోచనగా ఒకసారి పైకిచూసి ఆ తర్వాత చిటికేస్తూ "ఆ రూమే బెటర్‌గా వుంటుందేమో? " మేము వుండే రేకుల ఇంటివైపు చూపిస్తూ చప్పున అనేసాడు నడిపిబాబు.

అందుకు చినబాబు గలగలా నవ్వాడు. కాగా ఈమారు మాత్రం నాలోని అబద్ధపు చిరునవ్వు సైతం మాయమైపోయింది. ఎందుకంటే ఆ కాసేపటిలోనే అబ్బాయిగార్ల దృష్టిలో మల్లేశం ఒక విదూషకుడు అని తెలిసిపోయింది. అంటే అతడి భార్యగా క్రమంగా నా స్థానం కూడా అంతే అవుతుందా? బడిలోగాని ఇంటిదగ్గరగాని నాపై ఒకరు హాస్యం సృష్టిస్తే సహజంగానే ఒప్పుకోలేని నా మనసు ఇక ఇక్కడ ఏమైపోవాలి? అసలే అంధకారం అనుకుంటే అందులో మళ్లీ కంటకదారి అన్నట్లుగా ఊహించని ఈ పరిస్థితి ఏమిటి?

ఊర్లో నౌకర్ల దగ్గర కూడా ఇలాగే సరదాగానే కనిపించే అబ్బాయిగార్ల తీరును అప్పట్లో నేను ఇలా ప్రత్యేకించి పట్టించుకోలేదు. చెప్పాలంటే ఆ తీరులో నాకు మంచి వాళ్లు అనే భావన స్ఫురించేది. ఇప్పుడు కూడా ఆ భావన వుంది. కాకపోతే పరిస్థితి నా వరకు వచ్చింది కాబట్టి రహస్య ప్రేమికురాలిని ప్రత్యక్ష హాస్యాన్ని అయిపోతానేమో అనేది ఒక భయం. అయినా నా గుంభనం నా వద్దే వున్నంతవరకు నాకు అలాంటి భయాలు అవసరంలేదు.

అసలు ఊర్లో ఎలా వుండేదాన్నో ఇక్కడ కూడా అలాగే వుండాలంటే కుదరకపోవచ్చు. తప్పనిసరిగా పరిచయం పెరుగుతుంది. నా పెదబాబుతో పరిచయం నాకు సంతోషమే అయినా ఇప్పుడా పరిచయంతో ఒరిగేది ఏమీ వుండదు. ఇది ఏమైనప్పటికీ వాళ్ళ దృష్టిలో నా స్థానం తక్కువే అయినా నా వ్యక్తిత్వం మాత్రం వాళ్ళకు ఉన్నతంగా కనబడాలి. అవును! పుట్టింట్లోనూ, మెట్టినింట్లోనూ నాది బానిసవంశమే! ఇలాగని నేను ఆరాధించే పెదబాబుకు సైతం నేను చనువు కాకూడదు.

"ఏమ్మా? ఏదో ఆలోచనలో పడిపోయావు? " నన్ను గమనించిన చినబాబు గొంతులో కాసింత ఆశ్చర్యం.

"ఆ... ఏంలేదు" చప్పున తేరుకున్నాను నేను.

"చూడు మల్లేశా! వచ్చీరాగానే పెళ్ళాన్ని ఆలోచనలో పడవేశావు. నువ్వు ఇలావుంటే మేం ఒప్పుకోం! సినిమాల్లో అజయ్‌దేవగన్‌లా వుండాలి. అప్పుడే తను కాజోల్ అవుతుంది. లేదంటే తను హ్యాండు ఇస్తుంది. నీ సైకిల్ హ్యాండ్ తప్పుతుంది. జాగ్రత్త" నన్నూ, అతడిని తుంటరిగా చూస్తూ అన్నాడు నడిపిబాబు. ఆ బాబు మాట అలా పూర్తయిందో లేదో ఇలా చినబాబు అందుకుంటూ, "నీ ఫీలింగ్స్ ఇప్పటికే ఎక్కువైపోయాయి. ఇక వాటిని చాలిస్తూ లోపలికి వెళ్తే డైనింగ్ టేబుల్‌పై పార్శిల్స్ వుంటాయి. వాటిలో రెండు తీసుకుని ఇద్దరూ కలిపి హాయిగా భోంచేయండి" అతడి చొక్కా కాలర్‌ని కావాలని పైకెత్తిపె

డుతూ అన్నాడు.

నిజం చెప్పాలంటే ఎదుటివ్యక్తి ఎంత అమాయకుడైనప్పటికీ వాడిని కొత్త పెళ్ళాం ఎదురుగా ఆటపట్టించడం అంత బాగుండదు. కాని అబ్బాయిగార్లు అదేమీ ఆలోచించకుండా ప్రవర్తించడం అనేది ఒకరకంగా బాధపడాల్సిన విషయమే అయినా, అందు గురించి నా మనసు పెద్దగా ఖాతరు చేయడంలేదు. అతడిపై నాకు భర్త అనే గౌరవంగాని, ప్రేమగాని లేవు కాబట్టే ఆ విషయమై నా మనసు ప్రతిచర్య చూపడం లేదు.

"పెదబాబుగారు ఎక్కడికి వెళ్ళారు బాబూ?" చినబాబు ఎత్తివుంచిన కాలర్‌ని ఎప్పటిలా సరిచేసుకుంటూ అడిగాడు అతడు.

"నిన్ను వెదుక్కుంటూ వచ్చాడు. కనిపించలేదా?" గొంతులో ఆదుర్దాను పలికించి, ఆ తర్వాత "బాబుగారు వస్తారుగాని, ముందు లోపలికి వెళ్ళు! అవతల ఆమెకు ఆకలి మండుతున్నట్టుగా వుంది" మృదువుగానే అయినప్పటికీ మందలింపుగా అన్నాడు చినబాబు.

అతడు ఇంకేం మాట్లాడలేదు. రమ్మన్నట్టుగా నావైపు ఒకమారు చూసి, ఆ తర్వాత లోపలికి నడిచాడు. నేను వెంటే నడిచాను.

"వసూ! నీవు ఒకవైపు చదువుకుంటూనే, మరోవైపు అమ్మగారి దగ్గర ఒక పూట పని చేసేదానివటకదా!" లోపలికి వెళ్ళాక అడిగాడు అతడు

"నీకు ఎవరు చెప్పారు?" అడిగాను.

"అమ్మగారే చెప్పారు" అన్నాడతడు.

"అబ్బాయిగార్లు కూడా నీ గురించి చెప్పారు. పెదబాబుగారు మరీ ప్రత్యేకించి చెప్పారు" డైనింగ్‌రూంలో ఒక పక్కగా వున్న సింక్ వద్దకు వెళ్ళి చేతులు కడుక్కుంటూ చెప్పాడు అతడు.

"ఏం... చె...ప్పా...రు...?". పెదబాబును ప్రత్యేకంగా సూచించేసరికి నాకు తెలీకుండానే నాలో ఏదో ఉద్వేగం.

"నీవు మంచి అమ్మాయివని చెప్పారు" అతడి సమాధానం విచిత్రంగా నాలో తీయని స్పందనగా ఎగిసిపడింది.

"పెదబాబుగారు ఇంకోమాట కూడా చెప్పారు" డైనింగ్ టేబుల్‌మీది పార్శిల్సు తీసుకుని, ఒక పక్కగా వెళ్లి కూర్చుంటూ మరోమాటగా చెప్పాడు అతడు.

"ఏంటీ?" కనుబొమ్మలు ముడిచాను.

"నీవు అందంగా వుంటావని" నా అందం తన గొప్పతనం అయినట్లుగా అదో గర్వంగా చెప్పాడు అతడు.

ఆ మాట వినగానే నాలో ఒక్కసారిగా కోటి ఆనందాల కెరటాలు ఎగిసిపడ్డాయి. అయినప్పటికీ బయటపడకుండా గుంభనంగా వెళ్లి అతడికి ఎదురుగా కూర్చున్నాను.

"ఒకే దగ్గర తిందామా?" నేను వెళ్ళి కూర్చోగానే రెండు పార్శిల్సుని విప్పి వాటిని ఒకచోటుకి చేర్చబోయాడు.

"వద్దు! విడివిడిగా తిందాం" వారించాను.

"నీ ఇష్టం" నా మాటకు విలువిచ్చాడు.

తర్వాత ఇద్దరి మధ్యా మౌనం. ఆ మౌనాన్ని కాసేపటి తర్వాత ఛేదిస్తూ "వసూ" పిలిచాడు అతడు.

"ఊ" ఏంటన్నట్లుగా పలికాను.

"నీకు ఇట్లా కింద కూర్చుని తింటే ఇష్టమా? లేక ఆ టేబుల్‌మీద కూర్చుని తినాలంటే ఇష్టమా?" అడిగాడు అతడు.

"కడుపునిండా తినాలంటే ఇష్టం" వ్యంగ్యంగా సమాధానం ఇచ్చాను.

అందుకు అతడు కిసుక్కున నవ్వి- "నీవు సరదా మనిషివి" అన్నాడు.

'నా అయిష్టత నీకు సరదాగా కనిపిస్తుండడం నిజంగా నీపై జాలి పడాల్సిన విషయం' మనసులోనే అనుకున్నాను.

"వసూ" మళ్ళీ పిలిచాడు.

ఏంటన్నట్లుగా చూశాను.

"అమ్మగారు నీ గురించి అంతా చెప్పారు.

నీ కథ విన్నాక నీపై నాకు బోలెడంత జాలేసింది..." అనూహ్యంగా అన్నాడతడు. అందుకు అతడివైపు భృకుటి ముడిచి విస్మయంగా చూశాను.

"ఈ సంగతులన్నీ రాత్రికి మాట్లాడ్దామనుకున్నాను. కాని ఈవాళ మనకు తొలిరాత్రి కదా! అట్లాంటప్పుడు ఇట్లాంటి విషయాలు మాట్లాడటం బాగుండదేమో!? అందుకే ఇప్పుడు మాట్లాడ్తున్నాను" తన పార్శిల్స్‌లోని చికెన్ ముక్కల్ని నా పార్శిల్స్‌లో తీసి పెడుతూ అన్నాడు.

నేను అలాగే చూస్తున్నాను. అతడు చెప్పుకుపోతూనే వున్నాడు- "లేనిపోని అపవాదులు రావడం నీలాంటి సామాన్యమైన ఆడపిల్లలకు సహజమే! వాటిని గురించి పెద్దగా పట్టించుకోకూడదు. కాని నీవు పట్టించుకున్నట్లున్నావు. కాబట్టే నేను మాట్లాడించినా మాట్లాడలేకపోతున్నావు. చీటికి మాటికి చికాకుపడుతున్నావు. మొదట్లోనే భార్యాభర్తలు ఇలా వుండకూడదు. వుంటే కనుక అది సంసారం కాదు, సముద్రం! నన్ను అర్థం చేసుకో"

నేను ఈమారు కూడా పెదవి విప్పలేదు. అదర్శపురుషుడిలా మాట్లాడుతున్న అతడి మీద ఆవేశం ఒక్కసారిగా పెరిగిపోయి, పెదబాబు తాలూకు తియ్యని స్పందనలు చిరునామా లేకుండా చెదిరిపోగానే నేను ఒక ఉద్ధృతిలా మారిపోయాను. ఈ స్థితిలో నన్ను నేను తమాయించుకోలేనిదాన్నయిపోతూ, "గొప్ప మనసున్నది నీకే కాదు, నా క్కూడా! నీవు నన్ను అర్థం చేసుకున్నట్టుగా, నేసు నిన్ను భరించడానికి సిద్ధం చేసుకున్నాను. లేదంటే పదవతరగతి వరకు చదివిన నేను ఏడోతరగతి... అదీ వానాకాలం చదువు చదివిన నిన్ను పెళ్ళి చేసుకోరాదు" చప్పున అనేశాను.

అందుకు అతడు ఏమనుకున్నాడో ఏమో! నావైపు అపనమ్మకంగా అయోమయంగా చూశాడు. నేను మాత్రం అతడివైపు ఎక్కువసేపు చూడలేదు. చూసేకొద్దీ కోపం పెరుగుతుంటుంది. కాబట్టి కిందికి చూస్తూ అన్నాన్ని ముద్దలు ముద్దలుగా గబగబా మింగేసి ఎంగిలి కవర్లను అక్కడే వున్న చెత్తబుట్టలో పడవేసి, సింకు దగ్గరకు వెళ్ళి శుభ్రంగా చేతులు, నోరు కడుక్కున్నాను.

అతడు అప్పటికీ అలాగే కూర్చుని వున్నాడు. "ఏమయ్యింది వీడికి? " మనసులోనే అనుకుంటూ అంతసేపటికిగానూ అప్పుడు చూశాను అతడివైపు. అతడి భోజనం అలాగే వుంది. దాని ముందు అతడు తలవాల్చేసి దిగాలుగా కూర్చునివున్నాడు.

"వీడిని ఈ పరిస్థితిలో చూస్తే అబ్బాయిగార్లు నన్ను తిట్టిపోసుకుంటారు" లోలోపల గునుక్కుని "తినండి" దగ్గరగా వెళ్తూ అన్నాను.

అతడు నెమ్మదిగా తలెత్తి నావైపు చూశాడు.

"తినండి" మళ్ళీ చెప్పాను.

"సరే!" ఆ మాత్రానికే అతడి పెదవులపై సన్నని చిరునవ్వు ఒకటి మెరిసింది.

అంతలో ఎవరో వస్తున్నట్టుగా అలికిడి వినిపించింది. ఎవరో అన్నట్టుగా వెంటనే తిరిగి చూశాను.

"పె...ద...బా...బు..."

క్రికెట్ ఆడి వస్తున్నట్లున్నాడు. తెల్లని సూటు, చేతిలో బ్యాటు, చూడ్డానికి రెండు కనులు చాలవేమో అన్నట్టుగా వున్నాడు.

నీవనే బంగారు గనికోసం.
బతుకంతా శ్రమించాలనుకున్నాను.
నిను గెలిచే యజ్ఞంలో.
యుగాల్ని భరించాలనుకున్నాను.
కాని ఏం జరిగింది నేస్తం?
పరీక్షిస్తుందేమో అనుకున్న కాలం
పగబట్టి శిక్షించింది...

నా ధీరేంద్ర ఉనికి నాలో ఏ అలజడుల్నో రేపుతూ అంతర్గత వరదల్ని సృష్టిస్తుంటే నాకు తెలీకుండానే నేను అప్రయ

త్నంగా చేతులు జోడించాను.

"నమస్కారం పెదబాబూ" నాతో పాటు గానే పెదబాబు రాకను గమనించిన అత గాడు ఎప్పుడో లేచి నిల్చుని, తన విన యాన్ని ప్రకటించుకున్నాడు.

ప్రతిగా పెదబాబు చిరునవ్వు నవ్వుతూ- "విష్ యూ హ్యాపీ మ్యారీడ్ లైఫ్" ఇరు వుర్నీ చూస్తూ అని- "ఏం హీరో? ఒక్కడివే భోంచేస్తున్నావు? వైపు నైపు లాంటిది. నిర్లక్ష్యం చేస్తే నిల్చోబెట్టి నిలదీస్తుంది" అతడ్ని ఉద్దేశించాడు.

"నా భోజనం ఇప్పుడే పూర్తయింది" కావా లని కల్పించుకున్నాను.

"ఐసీ!" అని తలపంకించి- "కూర్చుని తిను" ఇంకా నిల్చునే వున్న అతడికి చెప్తూ తను నేరుగా లోపలికి వెళ్ళిపోయాడు పెద బాబు.

నేను మైకం కమ్మినట్టుగా అలాగే నిలబ డిపోయాను.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలు కావొస్తోంది. నేను, అతడు మాకు కేటాయించిన గదిలో వున్నాం. నేను ఒకపక్కగా తిరిగి పడుకుని పెదబాబు గురించి ఆలోచిస్తున్నాను. అతడు మాత్రం పెళ్ళికానుకగా అబ్బాయి గార్లు ఇచ్చిన వెయ్యినూటపదహార్లతో నాకు ఏమేమి ఇప్పించి, నన్ను నగరంలో ఎక్కడె క్కడ తిప్పాలో తీరిగ్గా లిస్టు తయారుచేసు కుంటున్నాడు.

"వసూ" కాసేపటి తర్వాత పిలిచాడు అతడు.

"ఊ" అలాగే పడుకుని పలికాను.

"అబ్బాయిగార్లకు క్యారియర్ తెచ్చి ఇచ్చి వస్తాను" చెప్తూనే లేచి బయటకు నడి చాడు.

అతడు వెళ్ళిపోగానే నేను లేచి కూర్చు న్నాను. నా మనసంతా ఓర్చుకోలేని ప్రకం పనలతో సతమతమైపోతూ అందుకు కార ణమైన పెదబాబును తపిస్తూ, జపిస్తూ ఇక ఓరిమి లేనిదై కృశిస్తూ వుంటే ఆ చీకటివేళ నేను ఒక శవాన్నై నన్ను నేనే దహించుకో సాగాను.

తొమ్మిది కావొస్తోంది అనగా అతడు వచ్చాడు. వెంటనే మళ్ళీ రెండు భోజనం పార్శిల్సు, వాటితో పాటుగా మల్లెపువ్వులు తీసుకువచ్చాడు. సాయంకాలమే భోంచేసి వున్నందున, తోడుగా మనసు అచేతనాస్థితి వలన నేను ఎక్కువగా భోంచేయలేకపో యాను. అతడు మాత్రం కొంతవరకు బాగానే తిని మిగిలిన అన్నాన్ని, కూరల్ని జాగ్రత్తగా పాత్రల్లో సర్ది పెట్టాడు.

అప్పటికి సమయం తొమ్మిదిన్నర దాటింది. తొలిరాత్రి తాలూకు తహతహలు తొందర పెడుతున్నాయి కాబోలు, తలు పులు గడియ పెట్టడం, పక్క సర్దడం వంటి పనుల్ని చకచకా పూర్తిచేయడంతో పాటుగా ట్యూబ్‌లైట్ ఆర్పేసి బెడ్‌లైటు వేసి వచ్చి నాకు ఎదురుగా కూర్చున్నాడు అతడు.

నాలోనేమో చావు ముంచుకొస్తున్న భావన భయంకరంగా మొదలైంది. లోలో పలే దుఃఖం సుడులు తిరగడం మొదలె ట్టింది. నా బాధ, నా వేదన, రోదన ప్రస్తుతం పరిష్కారం కాలేనివి. బలవం తంగా ఒకవేళ తప్పించుకోవాలని చూస్తూ అందుకు విడిపోవడానికైనా సిద్ధపడాలి. లేదా చావడానికైనా సిద్ధపడాలి. కాని నా జీవన పరిస్థితులు విడిపోయే ధైర్యాన్ని నాకు అందివ్వలేవు. చావాలి అనుకుంటే మాత్రం ధైర్యంగా చావగలను.

"వసూ..." నాకు చేరువగా జరుగుతూ పిలిచాడు అతడు.

వినిపించినా కూడా ప్రతిగా పలకలేదు నేను.

"అమ్మగారు నీ గురించి నాతో చెప్పారు కదా, మరి నా గురించి నీతో చెప్పారో లేదో అడగడం మర్చిపోయాను. ఆ విషయం ఇప్పుడే గుర్తొస్తోంది" నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు.

నేను పెదవి విప్పలేదు. సరికదా, అతడి వైపు కూడా కనీసంగా చూడలేదు.

"చెప్పేవుంటుంది. నేను ఒక అనాథని! నాకు తల్లీ తండ్రీ ఎవ్వరూ లేరు. నాన్న తరపున పెదనాన్న, పెద్దమ్మ నన్ను కొంత కాలం పోషించారు. కాని రాక్షసుల్లాంటి ఆ మనుషుల వద్ద నేను ఎక్కువకాలం వుండ లేకపోయాను. ముఖ్యంగా నా తల్లిదండ్రులు కూలిపని చేసి పూట గడుపుకునే వాళ్ళే తప్ప దమ్మిడి సంపాదించుకోలేకపోయారు. ఈ కారణంగానే నాకు అన్నం పెట్టేందుకు పెద్దమ్మ పెదనాన్నలకు మనసొప్పుకోలేదు. అందుకే నన్ను సంక్షేమగృహంలో చేర్పించారు. అప్పుడు నా వయసు ఏడేళ్ళు! అక్కడికి వెళ్ళిన ఆరునెలలకే దొరబాబుగారు అక్కడికి వచ్చారు. పైవాడు పెద్దవాడు కాబట్టి తన స్నేహితుడైన మా వార్డెన్‌గారి వద్దకు, పనిపిల్లాడ్ని వెదుక్కుంటూ దొరబాబు రావడం, వార్డెన్ నన్ను దొరబాబు వెంట పంపించడం, అంతా నా అదృష్టంగా జరిగిపోయింది. లేదంటే ఆ వసతిగృహంలో పెద్ద పిల్లలు నన్ను కొట్టే దెబ్బలకు నేను ఎప్పుడో చనిపోయివుండేవాడ్ని. అలాకాకుండా ఇప్పుడు ఇంత వయసొచ్చి ఒక ఇంటివాడ్ని కూడా అయ్యానంటే అది నిజంగా అదృష్టమే మరి" అమ్మగారు ఏనాడో చెప్పిన తన కథను మళ్ళీ చెప్పుకుపోయాడు అతడు.

"..."

"ఇలాంటి కబుర్లకు ఇది సమయం కాదని నీకు చెప్పి కూడా మళ్ళీ ఈ కబుర్లు చెప్తున్నాను కదూ?" నా గదవ పుచ్చుకుని సుకుమారంగా అడిగాడు అతడు.

ఇక ఎంతోసేపు నేను ఓపిక పట్టుకుని వుండలేకపోతూ, ఆ తక్షణమే అతడి చేతిని నానుండి నెట్టేయడంతోపాటుగా అతడికి పూర్తిగా దూరంగా జరిగి కూర్చున్నాను.

"ఆ... అదేం వసూ?" అతడు మళ్ళీ నాకు దగ్గరగా జరగబోయాడు.

"ఒద్దు" చప్పున అతడ్ని వారించాను. నా వారింపులోని తీవ్రతకు నా మనసే బెదిరిపోయింది అన్నట్టుగా, నా శరీరంలో వణుకు ఉవ్వెత్తున ఆరంభమైంది.

అతడు నావైపు అర్థం కానట్టుగా చూస్తుండిపోయాడు.

"నువ్వంటే నాకు ఇష్టంలేదు. కాబట్టి దయచేసి నా దగ్గరకు రావద్దు" ముసుగులో తన్నులాటలా కాకుండా సూటిగా చెప్పేసి, ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా దిండు తీసుకుని అక్కడ్నుంచి లేచి వెళ్ళి ఒక మూలగా పడుకున్నాను.

ఇప్పుడు అతడి పరిస్థితి నేను ఊహించగలను. కానీ పట్టించుకోలేదు. కాబట్టే మళ్ళీ అతడివైపు తిరిగి చూడలేదు.



వారంరోజులు గడిచిపోయాయి. అప్పటి వరకూ కూడా నేనూ, అతనూ దూరంగానే వున్నాం. అతడికి నామీద వున్న ప్రేమ, అభిమానం గొప్పవి కాబోలు... నాలో మార్పుకోసం అతడు సంయమనంతో ప్రయత్నిస్తూనే వున్నాడు. నేనుమాత్రం చావుబతుకులమధ్య కొట్టుమిట్టాడుతున్న పరిస్థితిలో కూరుకుపోయి జీవితమనే శూన్యాన్ని శుష్కమనసుతో భారంగా అను

భవిస్తున్నాను.

భార్యగా అతడితో జీవితాన్ని పరిపూర్ణంగా పంచుకోలేకపోయినా, పనిలోమాత్రం భాగం పంచుకున్నాను. అతడు ముందే చెప్పినట్టుగా ఈ పని విషయంలో నా ఇష్ట ప్రకారం ఉన్నాను. ఖాళీగా కూర్చుని తినడం నాకు ఇష్టం ఉండదు. కాగా ఇప్పుడు నేను మానసిక అసంతృప్తితో రగిలిపోతూ ఒక మనిషిగా బతకడంలేదు. కాబట్టే గెలిచిన నా సహజత్వపు పరిధిలో నా చావును అన్వేషించుకుంటున్నాను.

★ ★ ★

ఒకరోజు...

ఇంట్లో నేనూ పెదబాబు మాత్రమే ఉన్నాం. మిగతా ఇద్దరు అబ్బాయిగార్లు ఏవో పరీక్షలు అంటూ ముంబాయి వెళ్లారు. ఇక మా మల్లేశం నగర శివార్లలో ఉన్న దొరబాబుగారి ద్రాక్షతోటలో పనిచేసే కూలి మనుషుల్ని చూసుకోడానికి ఉదయమనగా వెళ్ళాడు.

కన్నుకొడుతూ కాలుజారిన చందాన మేడ మీదనుండి దూకాలా? పొరపాటున షాకు తగిలినట్టుగా విద్యుత్ తీగల్ని పట్టుకోవాలా? మంటలో కొంగువేసి గమనించనట్లుగా వుండిపోవాలా? అంటూ రకరకాలుగా ఆలోచించే మనసు ఇప్పటివరకూ ఓడిపోతూవే నన్ను బతికిస్తూ వచ్చింది. అయితే ఎన్నాళ్ళని ఇలా బతకాలి? మరెన్నాళ్ళని భార్యగా అతడ్ని అసహ్యించుకోవాలి? చస్తే తొందరగా చావాలి. లేదంటే బలవంతంగా రాజీపడాలి. అవును... ఏదో ఒకటి చేయాలి.

"వసుంధరా" నా ఆలోచనల్ని చెదరగొడుతూ పెదబాబు గొంతు బయటినుండి వినిపించింది.

ఆ పిలుపు నా పెళ్ళికిముందు అయి వుంటే ఈ ప్రపంచాన్ని జయించినట్టుగా సంతోషించేదాన్ని. ఇప్పటికీ పెదబాబుమీద అపారమైన అభిమానం వున్నా అదంతా మరిచిపోవాల్సిన పరిస్థితి. కాబట్టే ఇప్పుడు ఇంట్లో ఇద్దరమే వున్నప్పటికీ నా ప్రేమ అతడికి తెలియాలి, అతడు నన్ను గుర్తించాలి. అతడి దృష్టి నన్ను ఆకర్షించాలి అనే నా పూర్వపు ఆలోచనలకు చైతన్యం రావడంలేదు. ఆరాధన మాసిపోలేనప్పటికీ స్తబ్ధత మోసులెత్తిపోయింది.

ముఖ్యంగా వారంరోజుల్నుండీ గమనిస్తున్నాను. అబ్బాయిగార్లు ఇంట్లో గడిపే సమయంకంటే బయట గడిపే సమయమే ఎక్కువగా వుంటోంది. ఉదయం ఏడుగంటలకు బయలుదేరితే మధ్యాహ్నం ఏ ఒంటిగంటకో వస్తే వస్తారు. ఆ తర్వాత మళ్ళీ బయలుదేరి రాత్రి బాగా పొద్దుపోయాక వచ్చేస్తారు. కాగా ఒక్క ఆదివారం మాత్రం ఇంట్లో వుంటారు. అవసరమైతే ఏ ఆటపాటల కోసమో ఆరోజు కూడా బయటకే వెళ్తారు.

ఈరోజు ఆదివారం. కాబట్టి పెదబాబు ఇంట్లో వున్నాడు. ఆ విషయమై నేను ఇప్పుడు ప్రత్యేకంగా ఆలోచించలేదు. కాపోతే అతడినోటినుండి తొలిసారిగా నాపేరు వినగానే నాకు తెలియకుండానే నాలో కొండంత ఆశ్చర్యం కలిగింది.

"తనకు నా పేరు తెలుసా? ఎంత బాగా పిలుస్తున్నాడు? " మనసులోనే అనుకుంటూ పరుగున బయటికి నడిచాను.

"కాఫీ పెట్టిస్తావా? " నేను వెళ్లగానే అడిగాడు.

"ఆ..." సరే అన్నట్టుగా తలాడించాను.

ఆ సమయంలో సూటిగా కలిసిన మా చూపులు అతడిని ఏ విధమైన భావోద్రేకానికీ గురి చేయలేదని అతడ్ని చూస్తేనే చెప్పొచ్చు కానీ నాలో మాత్రం భాషకందని భావచలనం విద్యుత్ ప్రవాహంలా ఎగిసిపడింది.

వంటింట్లోకి వచ్చి కాఫీ తయారుచేసి చిన్న ట్రేలో కాఫీకప్పు పెట్టుకుని, మళ్ళీ అతడివద్దకు వెళ్లేటప్పటికి కూడా భావచలనం

నన్ను వీడలేదు. ప్రతిగా అతడికి కాఫీ అందిస్తుంటే నాలో పెరిగిన అలజడి ట్రేను జారవిడిచింది.

"హే..." అంటూ చప్పున దూరం జరిగాడు అతడు.

రెప్పపాటులో నేను కూడా దూరం జరిగినప్పటికీ సగంవరకూ కాఫీ నాపై ఒలికిపోయింది. మిగతా కాఫీ తెల్లని పాలిష్‌బండలపై ఒలికిపోయి పగిలిన కప్పుపెంకులు ఆ చుట్టూరా పరుచుకుని, అంతా ఒక చిందరవందరగా మారిపోయింది. ఆ తక్షణమే నాలో భయం అంతెత్తున ఎగిసిపడింది. దీంతో నాపై కాఫీ ఒలికిపోయిన సంగతిని అసలేమాత్రం పట్టించుకోకుండా, చప్పున వంగి పగిలిన కప్పు పెంకుల్ని గబగబా దగ్గరగా పేర్చసాగాను.

ఊర్లో వున్నప్పుడు ఒకసారి చూడక పొరపాటున అద్దపు ప్లేటును జారవిడిచి పగలగొట్టినప్పుడు, అమ్మగారు అంతెత్తున ఎగిరిపడుతూ నన్ను కొట్టినంత పనిచేశారు. కానీ ఇప్పుడు పెదబాబుగారు నోరుతెరిచి ఒక్క మాట కూడా అనడంలేదు. ఈ విషయం నాకు అంత భయంలోనూ ఒకింత ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటే నెమ్మదిగా తలెత్తి చూశాను.

అంతే... ఒక్కసారిగా నాకు ఏమీ అర్థం కానట్లుగా తోచింది. పెదబాబు అదో కైపుగా, అదో కసిగా, షూటిగా తన చూపుల్తో నా గుండెల్ని గుచ్చుతున్నాడు. ఆ చూపు నన్ను అలా కలవరపెట్టిందో లేదో ఇలా నా గుండెలవైపు చూసుకున్నాను. ఇంకేముంది? కప్పు పగలగొట్టిన తత్తరపాటులో నేను గమనించుకోలేదు కానీ, నా కొంగు జారిపోయి విశాలంగా వున్న నా జాకెట్టులోంచి నా అందాలు అందంగా బహిర్గతం అవుతున్నాయి.

"ఓ దేవుడా అయ్యో..." మనసులోనే కంగారుపడిపోతూ ఆ వెంటనే చప్పున కొంగు సర్దుకున్నాను. అందుకు పెదబాబు ఏమనుకున్నాడో ఏమో ఆ తక్షణమే అక్కడ్నుంచి నెమ్మదిగా లోపలికి నడిచాడు. నేనుమాత్రం మళ్ళీ ఎప్పటిలా నా పనిలో నిమగ్నం కాలేకపోతున్నాను.

"నేను కావాలని పైట జార్చాను అనుకుంటున్నాడా తను? ఒకవేళ తను నిజంగానే అలా అనుకుని వుంటే ఇంకేమైనా వుందా? తనంటే నాకు ప్రాణం. ఇందులో సందేహం లేదు. ఇలాగని విలువలకు దిగజారేంత నీచమైన వ్యక్తిత్వం కాదు నాది. కానీ ఇలాంటి నన్ను తను ఇప్పుడు పొరబడి వుంటే గనుక, ఆ భావనతో ఇకనుండి నన్ను మరోలా చూస్తాడేమో? అయినా నాకు తెలిసినంతవరకూ తనలో ఎప్పుడూ కూడా ఇలాంటి చవకబారు ప్రవర్తన కనబడలేదు. ఒకవేళ ఊర్లోకి వచ్చినప్పుడు అలా కనిపించడానికి ప్రయత్నించాడేమో అనుకుంటే, ఇక్కడికి వచ్చిన ఈ వారంరోజుల్లో కూడా తనలో ఏ విధమైన అనుచిత ధోరణీ కనబడలేదు తనకు. అలాంటిది ఇప్పుడు ఎందుకలా గుచ్చిచూశాడు?

అసలు దొరబాబుల వద్ద వున్న డబ్బు కోసం, వాళ్ళు అందించే ఖరీదైన సుఖం కోసం, నీతికి దిగజారే ఆడవాళ్ళు ఎవరైనా వుండవచ్చు కానీ నేను ఎవర్నీ? తమ ఇంట్లో నమ్మకంగా ఎంతోకాలంనుండి పని చేస్తున్న ఒక అమాయకుడి భార్యని. ఇలాంటప్పుడు నేను ఆశపడ్డా కూడా వారించాలే తప్ప అదునుకోసం చూడకూడదు. అది గొప్పవాళ్ళ లక్షణం. ఈ గొప్పతనాన్ని దొర ఇంట ప్రత్యేకంగా భావిస్తూ వస్తున్నాను నేను. మరి ఈరోజు ఎందుకిలా జరిగింది? " పెదబాబు అంటేనే పడిచచ్చే నా మనసు, పెదబాబులోని శృంగార పురుషుడివి మాత్రం సహించలేకపోయింది.

"వసుంధరా!" ఇంతక్రితమే నన్ను ఎంతగానో మురిపించిన ఆ పిలుపు. ఇప్పుడు అంతెత్తున భయపెడుతూ మళ్ళీ వినిపించింది.

"ఆ..." నాకు తెలియకుండానే పలుకుతూ లోపలికి చూశాను. అప్పటికి నా శరీరం చిరుచెమటతో తడిసిపోయి వుంది. కాగా నొసటకు పట్టిన చెమటను మాత్రమే తుడ్చుకుంటూ, ఏమాత్రం ఆలస్యం చేయకుండా అలా పలికి ఇలా లోపలికి నడిచాను.

రెండవ హాల్లో అటుతిరిగి నిల్చుని కనిపించాడు పెదబాబు. ఆ తీరు నాలో మరో కొత్త భయాన్ని కలిగిస్తుంటే పూర్తిగా అతడికి సమీపంగా వెళ్ళలేని దాన్నయి కాసింత దూరంగానే ఆగిపోతూ, "బాబుగారూ" అప్రయత్నంగా అన్నాను.

"ఆడపిల్లవి! జాగ్రత్తగా వుండడం నేర్చుకో" అటుతిరిగి నిల్చునే అన్నాడు పెదబాబు. ఆ అనడంలో మందలింపు స్పష్టంగా కనిపించింది.

'అంటే? నేను ఊహించినట్లుగానే తను నన్ను తప్పుగా అర్థం చేసుకున్నాడన్నమాట' నా హృదయం విలవిలలాడిపోయింది. దీంతో నా కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

"నేను కాబట్టి క్షమించి హెచ్చరిస్తున్నాను. అదే వేరేవాళ్ళు అయివుంటే నీతో పాటుగా నీ భర్తను కూడా వెనకాముందూ చూడకుండా పనిలోంచి తీసేస్తారు" అంటూ ఈ మారు ఇటు తిరిగాడు పెదబాబు.

'భగవంతుడా! ఏమిటిరా ఈ విషమపరీక్ష? నేను ఈ ప్రపంచంలో ఒక మనిషిగా మర్యాదగా జీవించడం ఇష్టం లేకపోతే తల్లి గర్భంలోనే నాకు నూరేళ్ళు ప్రసాదించలేకపోయావా? ఎందుకు పుట్టించి, మరెందుకు ఇలా అన్యాయంగా అపవాదుల పాలు చేస్తున్నావు?' మారుమాట పెగలక ఎదురైన పరిస్థితికి నా మనసు మౌనంగా కునారిల్లిపోయింది. ఫలితంగా నాకు తెలియకుండానే కన్నీళ్ళు నా చెక్కిళ్ళు దాటాయి.

"వెళ్ళు" అని చెప్పి ఇక పూర్తిగా లోపలికి వెళ్ళిపోయాడు పెదబాబు.

వెనుతిరిగే శక్తి కూడా నాలో లేనట్లుగా తయారయ్యింది. నేను ఇంతగా ఆరాధించిన పెదబాబు దృష్టిలో నా స్థానం ఇదా? తను నన్ను ఎందుకలా అనుకున్నాడు? నా పవిత్రత అడవికాసిన వెన్నెల కాగా, నా వేదన అరణ్యరోదనై నిశ్శబ్దంగా నన్ను చిత్రవధ చేసింది.

దైన్యమైన ఆ స్థితి మరి కాసేపటివరకూ అక్కడే అలాగే నిల్చుని, ఆ తర్వాత అప్రమేయంగా నేను అనే మనిషి వెనుతిరిగింది.

'ముందే ఇష్టంలేని పెళ్ళి. తోడుగా ఇష్టమైన వాడి దృష్టిలో చవకబారు స్థానం. ఇలాంటప్పుడు ఇక బతకడం దేనికి? ఇప్పటికే అపవాదుల ఊబిలో చిక్కుకుని అలసి సొలసిపోయాను. ఇంకా ఇంకా వాటిని భరించే ఓపిక ఇక నాకు ఎక్కడిది?' ఇంటికి వెళ్ళీవెళ్ళగానే నేలపై చతికిలపడిపోయి భోరున విలపించాను. ఆ దీనావస్థలో ఒక దీటైన ప్రశ్న నన్ను సందేహపరుస్తూ అనూహ్యంగా నా అంతరంగాన్ని తొలిచింది. దీంతో చప్పున ఏడ్వడం మాని కళ్ళనీళ్ళు తుడ్చుకుంటూ కనుబొమ్మలు ముడిచాను.

'అవునూ! బాబుగారిలో నిజంగానే మందలింపు ధోరణి వుంటే ఆ మింగేసే చూపులు ఎందుకు? తను తప్పుగా ప్రవర్తించాడు. కాబట్టి ఆ తప్పును కప్పిపుచ్చుకునే ప్రయత్నంగా నన్ను తప్పుడు మనిషిని చేస్తూ తన పెద్దరికాన్ని అందంగా వాడుకున్నాడు కదూ?'

ఈ ఆలోచన వచ్చిన తక్షణమే పెదబాబుపై నాకు విపరీతమైన కోపం వచ్చింది. ఆ కోపం వెనక ఒకింత అసహ్యం కూడా పొడచూపింది. అసలు చెప్పాలంటే ప్రేమలో క్షమాపణలు తప్పనిసరి అంటారు కాబట్టి నా పెళ్ళికి ముందు పెదబాబులో ఈ ప్రవర్తన కనిపిస్తే అది నాకు ఇష్టం లేకపోయినా భరించుకునేదాన్ని. కానీ నేను ఇప్పుడు మరొకరితో పెళ్ళయినదాన్ని. అంటే? అతడి కుసంస్కారం నా సంస్కారాన్ని వక్రించిందా?

"వసుంధరా" వున్నట్టుండి పెదబాబు గొంతు నా చెవుల్ని అనూహ్యంగా వచ్చి తగిలింది.

'తను మళ్ళీ ఎందుకు పిలుస్తున్నట్టు? తిట్టడానికేనా?' భయపడుతూనే లేచి నెమ్మదిగా బయటకు నడిచాను.

నీటుగా తయారై తమ ఇంటికి మా ఇంటికి మధ్యగా నిలబడి, మా ఇంటివైపే చూస్తూ కనిపించాడు పెదబాబు.

"నేను బయటకు వెళ్తున్నాను. ఫోన్స్ ఏమైనా వస్తే రాసి పెట్టమ్మా" నేను కనబడగానే చెప్పి, ఇక ఆ వెంటనే అక్కడ్నుంచి ముందుకు నడిచాడు తను.

"నువ్వంటే నాకు ఎంత ఇష్టమో, నా విలువలపై కూడా నాకు అంతే గౌరవం. ఈ గౌరవాన్ని నీవు అగౌరపరిచావు. అందుకే నీమీద ఇష్టాన్ని కూడా నేను మరిచిపోయాను. తెలుసా?" వెళ్తున్న అతడివైపు వెనకనుండి ఉక్రోషంగా చూస్తూ అనుకున్నాను. సరిగ్గా అదే క్షణంలో వెళ్తూనే నావైపు తిరిగిచూశాడు అతడు. ఆ చూపు నా ఉక్రోషాన్ని గమనించకూడదనే అప్రమత్తతతో ఒకవైపు ఉలిక్కిపడుతూనే మరోవైపు ముఖం తిప్పుకోబోయాను. కానీ నా ప్రయత్నానికి ఆనకట్ట వేస్తూ అతడి అడుగులు నెమ్మదిగా ఆగిపోయాయి.

"ఏంటి ఇలా?" మనసులోనే అనుకుంటూ అతడివైపు కంగారుగా చూస్తుండిపోయాను.

కానీ అతడు ఏమీ మాట్లాడలేదు. ఓ రెండుమూడు క్షణాలు నావైపు అలాగే చూసి, ఆ తర్వాత ఎప్పట్లా తన దారిన తనువెళ్ళిపోయాడు. అతడు అలా వెళ్ళిపోయినప్పటినుండీ మళ్ళీ సాయంకాలం అతడు తిరిగి వచ్చేవరకూ, అతడి చూపులకు అర్థాన్ని వెదుక్కున్నాను. కానీ సమాధానమే దొరకలేదు.

"ఫోన్స్ ఏమైనా వచ్చాయామ్మా" వస్తూనే అడిగాడు పెదబాబు.

"వచ్చాయి బాబుగారూ" వాకిట్లో కూర్చుని బియ్యంలో రాళ్ళు ఏరుతున్న దాన్నల్లా లేచి నిల్చుంటూ చెప్పాను.

"ఆc" నా సమాధానానికి తలపంకిస్తూ లిస్టు చూసుకునేందుకు నేరుగా లోపలికి వెళ్ళిపోయాడు అతడు.

నేను తిరిగి ఎప్పట్లా కూర్చుని బియ్యంలో రాళ్లు ఏరుకోసాగాను. ఇప్పుడు నాలో ఉదయం తాలూకు బాధ చాలావరకు తగ్గిపోయి వుంది. ఇలాగని నాలో ఏ ఉపశమనమో కలగలేదు. బాధపడటం నాకు ఎంత అలవాటయ్యిందో ఆ బాధను అణుచుకునే ప్రయత్నం చేయడం కూడా అంతే అలవాటు అయ్యింది. అలాగే చావాలనుకుంటూనే విరమించుకోవడం కూడా పాత అలవాటుగా మారిపోయింది. ఏదిఏమైనా అద్భుతమైన జీవితం నా చేతిలో అస్తవ్యస్థమైపోయింది. ఈ స్థితిని తిరిగి అద్భుతంగా మలుచుకోవాలీ అంటే మొగుడితో రాజీపడటమేనని నా అంతరాత్మ నాకు హితబోధ చేయడం అనేది కూడా సుమారుగా పాత ఆలోచనే! మరి ఈ అవస్థలో నా జీవనగతి ఏ మలుపు తిరుగుతుందో మాత్రం నాకు తెలీడంలేదు.

"అయామె... డిస్కోడాన్సర్..." చిన్నగా పాడుకుంటున్న పెదబాబు గొంతు వున్నట్టుండి వినిపించింది.

'బాబుగారు స్నానం చేసి వచ్చినట్టున్నారు' అనుకుంటూ వెంటనే లేచి లోపలికి నడిచాను.

పాడుతూనే టెలిఫోన్ ముందు కూర్చుని ఎవరికో నంబరు డయల్ చేస్తున్నాడు పెదబాబు. అప్పుడే కడిగిన ముత్యంలా అతడు ఎంత అందంగా కనిపిస్తున్నాడో! నేను లోపలికి వెళ్లగానే గుప్పున వచ్చిన సబ్బు తాలూకు ఖరీదైన పరిమళం అంతే అద్భుతంగా తోచింది.

లుంగీ కట్టుకుని చొక్కా లేకుండా భుజాలపై టవల్ వేసుకుని సినిమా కథానాయ

కుడిలా తోస్తున్న పెదబాబు అందం గురించి నాకు తెలీకుండానే నేను ఈమారు పెద్దగా పట్టించుకోలేదు. నా బాధ్యతగా వంటింట్లోకి వెళ్లి చిక్కని పాలల్లో బ్రూ కలుపుకుని తీసుకునివచ్చి జాగ్రత్తగా తనకు అందించాను. తర్వాత తిరిగి వంటింట్లోకి వెళ్లి వంట ఆరంభించబోయాను. అంతలో మధ్యాహ్నం కోసం వండిన వంట మొత్తం అలాగే వుండిపోయిందనే సంగతి గుర్తుకు వచ్చి 'నేను కూడా భోంచేయకపోయేసరికి గిన్నెలు దిగలేదు. వండాలో వద్దో అడిగి చూస్తాను' అనుకుంటూ వెంటనే వంటింట్లోంచి వెలుపలికి బయలుదేరాను. కానీ నా అడుగులు రెండవ హాల్లోనే ఆగిపోయాయి.

"మా మల్లేశాన్ని ఈ రాత్రికి అక్కడే వుండమని చెప్పండి. రేపు కూడా ఎలాగూ పని వుంటుంది కదా! మళ్లీ రావడం, పోవడం అంతా రిస్క్! అందుకే అక్కడ వుండమంటున్నాను. వాడికి ఏమైనా డబ్బులు అవసరమైతే ఇవ్వండి. ఆ డబ్బులు మీకు నేను తర్వాత ఇస్తాను" ఎవరికో ఫోన్ చేసి చెప్తున్నాడు పెదబాబు.

మల్లేశాన్ని ఎందుకు రావొద్దంటున్నాడు? నాలో ఏదో అనుమానం చెలరేగింది. దీంతో భయంగా ఆలోచించుకుంటూ అక్కడే అలాగే శిలాప్రతిమలా నిలబడిపోయాను. అలా నేను ఎంతసేపు నిలబడిపోయానో తెలీదుకానీ పెదబాబు లోపలికి వచ్చి నన్ను ఆశ్చర్యంగా చూస్తూ "హలో" అంటూ కాసింత దూరం నుండి నన్ను చిటికేసేసరికి ఉలికిపాటుగా నా లోకంలోకి వస్తూ "బాబుగారూ? " తడబడ్డాను.

ఏం మాట్లాడలేదు అతడు. నావైపు చిరునవ్వుగా చూశాడు. ఆ నవ్వు నాలోని ప్రేమికురాలిని సమ్మోహనపరిచే నవ్వు! వద్దు ప్రియతమా నవ్వొద్దు.

"కాఫీ కలిపి ఇవ్వాలా బాబుగారూ? " ఏం మాట్లాడాలో, ఎటు వెళ్లాలో, అసలేం చేయాలో తోచని గందరగోళ పరిస్థితిలో చప్పున అనేశాను.

నేను ఈ మాట అనేసరికి అతడిలో చిరునవ్వు మరింతగా విచ్చుకుంటూ పెదవులు విడివడ్డాయి. ఇప్పుడా నవ్వులో ఏదో అర్థం! అది నాకు వెంటనే బోధపడలేదు. అతడివైపు అయోమయంగా చూశాను.

"ఏమ్మా? అలా చూస్తున్నావు? కాఫీ కలుపుకుని తీసుకురా! నేను లైబ్రరీలో వుంటాను" చెప్తూనే పుస్తకాల గదివైపు నడిచాడు అతడు.

నేను అదే అయోమయంలో వంటగదివైపు నడిచాను. క్రమంగా అప్పుడు అర్థమయ్యింది నాకు అతడి నవ్వులోని మర్మం! ఏంటంటే... ఉదయం కాఫీ ఇస్తూ కప్పు పగలగొట్టినప్పుడే అనూహ్యమైన సంఘటన జరిగింది. నేను మళ్లీ కాఫీ తెస్తానన్నాను. అందుకే అతడు 'కాఫీ తేవడం మాత్రమే కాదు కప్పు కూడా పగలగొట్టాలి' అన్నట్టుగా నవ్వాడు.

'అమ్మో!' బాబుగారిని తలుచుకుంటూ భయంగా గుండెలపై చేయివేసుకుని తొందరపాటులో కాఫీ గురించి మాట్లాడినందుకు నన్ను నేను గట్టిగా మొట్టికాయ పెట్టుకున్నాను.

అసలు బాబుగారిని నేనే అపార్థం చేసుకుంటున్నానో లేక బాబుగారు నిజంగానే తప్పుగా ప్రవర్తిస్తూ నన్ను బోల్తా పడేయాలని ప్రయత్నిస్తున్నాడో నాకు ఎటూ అర్థం కావడంలేదు. కానీ ఆ రోజు రాత్రంతా భయంతో మెలకువతోనే వున్నప్పటికీ పెదబాబు నుండి నాకు ఎలాంటి సంఘటన ఎదురుకాలేదు. నా ఇంట్లో నేను, తన ఇంట్లో తను. ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా వుండిపోయాం.

ఉదయం కూడా ఎప్పట్లా తొందరగానే వెళ్లిపోయాడు తను. అలా తను వెళ్లిపోగానే ఇలా ఫోన్ వచ్చింది.

"హలో" వెంటనే వెళ్లి ఫోన్ ఎత్తాను.

"దొరబాబు రెసిడెన్సీ? " అవతల్నించి

ఆడగొంతు నాజూగ్గా అడిగింది.

"అవును" చెప్పాను.

"అక్కడ వసుంధర అని వుంటుంది. ప్లీజ్ ఏమీ అనుకోకుండా పిలుస్తారా?" ఆమెలో అభ్యర్థన.

అనూహ్యంగా నగరంలో నా కోసం వచ్చిన ఫోన్‌కి నేను ఒక్కసారిగా భయపడిపోయానో, కంగారుపడిపోయానో తెలీదు కాని "నేను వసుంధరనే మాట్లాడ్తున్నాను. ఎవరు మీరు?" సతమతంగా అడిగాను.

"ఒసే మొద్దూ బావున్నావా? నేను పద్మజను మాట్లాడ్తున్నాను" ఇందాకటి నెమ్మదితనాన్ని వదిలిపెట్టి తనదైన ధోరణిలో గలగలా అడుగుతూ ఆ గొంతులోనే బోలెడు సంతోషాన్ని పలికించింది పద్మజ.

"ఎక్కడ్నుంచే?" నాలో కూడా ఆనందం ఎగిరిపడింది.

"బంధువుల మ్యారేజ్ వుంటేనూ సిటీకి వచ్చాను. మీ అమ్మ నీ కోసం నా వెంట మురుకులు, గారెలు పంపింది. వీటిని తీసుకుని ఫోనూ గీనూ చేయకుండా సర్‌ప్రయిజ్‌గా నీ కళ్లముందు ప్రత్యక్షం కావాలనుకున్నాను. కాని అడ్రస్ నాకు తెలిసి చావలేదు కదా! అందుకే ఫోన్ చేశాను. ఎక్కడ మీ ఇల్లు?" అడిగింది పద్మజ.

"ఈ నగరం నాకేం తెలీదే. కాకపోతే గౌలిగూడకు కొంచెం దగ్గర్లోనే వుంది ఈ ఇల్లు" నాకు తెల్సినంతవరకు చెప్పాను.

"ఛీ! మొద్దు మొహమా! మీ ఆయన్నిగాని అబ్బాయిగార్లని గాని తొందరగా అడిగి చెప్పు. లైన్లోనే వుంటాను" మృదువుగా కోప్పడుతూనే సూచించింది పద్మజ.

"ఇంట్లో ఎవ్వరూ లేరే" చతికిలపడిపోయినట్లుగా అన్నాను.

"షిట్" నిట్టూర్పుగా అని "అవునూ వసూ! దొరబాబు వాళ్లకు విజిటింగ్ కార్డుల్లాంటివి వుండాలికదా?" గుర్తు చేసింది పద్మజ.

"ఆ! వున్నాయి" చెప్పాను.

"అయితే చూసి చెప్పు"

"అవి లోపల ఎక్కడున్నాయో చూడాలి. పది నిముషాల తర్వాత మళ్లీ ఫోన్ చేయి" చెప్పాను.

"సరే" అంటూ ఫోన్ పెట్టేసింది పద్మజ.

ఆ కార్డుల్ని ఎక్కడో చూశానే? ఎక్కడై వుంటుంది? ఆలోచనగా నన్ను నేనే ప్రశ్నించుకుంటూ నేను కూడా ఫోన్ పెట్టేసి ముందు మొదట హాల్లో తర్వాత రెండవ హాల్లో ఆ తర్వాత పెదబాబు పడకగదిలోకి వెళ్లి కార్డులకోసం వెదకడం ఆరంభించాను.

దొరబాబు గారికి నగరంలో వ్యాపారాలు వున్నాయి. వాటన్నిటిని పేరుపేరునా సూచిస్తూ దొరబాబుగారి పేరుమీదే విజిటింగ్‌కార్డుల్ని ముద్రించారు. అందులో ఇంటి చిరునామా కూడా వుంది. అది నేను చూశానుకాని పెద్దగా గుర్తించుకోలేకపోయాను.

తెలియకుండానే పదిహేను నిముషాల కాలం గడిచిపోయింది. అంతలో లోపలికి ఎవరో వచ్చిన అలికిడి అయింది. ఎవరు అన్నట్టుగా ఆ వెంటనే తిరిగి చూశాను.

పెదబాబు తన ముగ్గురు స్నేహితులతో కలిసి ఇటే వస్తూ కిటికీలోంచి కనిపించగానే కార్డుల్ని వెదకడం ఆపేసి మర్యాద పూర్వకంగా ఆ గదిలోంచి వెలుపలికి రాబోయాను. గుమ్మం దగ్గరే ఎదురయ్యారు పెదబాబు, అతడి స్నేహితులు. అందుకు నేను పక్కకు తొలగి నిల్చున్నాను. పెదబాబు నన్ను పట్టించుకోకుండా లోపలికి వచ్చాడు. అతడి స్నేహితులు మాత్రం నన్ను ఒక మాదిరిగా చూస్తూ లోపలికి వచ్చారు.

వాళ్లు ఎందుకలా చూస్తున్నారు? నేనేం చేశాను? వాళ్ల చూపుల్ని అర్థం చేసుకోలేక నాలో నేనే ప్రశ్నించుకుంటూ నెమ్మదిగా బయటకు నడిచాను.

"ఏమ్మా! మధ్యాహ్నం అందరికీ ఇక్కడే మీల్స్ రెడీ చేయి" వెనకనుండి ఆ వెంటనే

చెప్పాడు పెదబాబు.

"ఏం వండమంటారు బాబుగారూ? " ఆగి వెనక్కి తిరిగి వినయంగా అడిగాను.

"ఏం తింటార్రా? " సమాధానం కోసం తన స్నేహితుల వైపు చూశాడు బాబు గారు.

"ఎగ్ బిర్యాని" చెప్పాడు ఒక స్నేహి తుడు. అతడి పేరు వేణు. "వద్దురా! చికెన్ బిర్యాని" ఇంకో స్నేహితుడు అన్నాడు. అతడి పేరు రాజు.

"ఏ బిర్యానీ వద్దు. శుభ్రంగా వైట్ రైస్ అండ్ డిఫరెంట్ వెజిటెబుల్స్" మరో స్నేహితుడు ఆ ఇద్దరికీ భిన్నంగా సూచిం చాడు. మిగతా ఇద్దరూ నేను వెళ్లినప్పటి నుండి తరుచూ ఇంటికి వస్తూనే వున్నారు కాబట్టి నేరుగా కాకపోయినా ఫలానా అన్న ట్టుగా పరిచయం అయ్యారు. కానీ ఈ మూడో అతడ్ని చూడటం ఇదే మొదటి సారి. కాబట్టి అతడి పేరూగట్రా నాకు ఏమీ తెలీదు.

పెదబాబు తన ముగ్గురి స్నేహితుల రుచుల్ని విన్నాక ఎటూ అర్థం కాని వాడలా తలపట్టుకుని "ఇంతకు ఏం డిసైడ్ చేయ మంటార్రా? " అని నా వైపు చూస్తూ "ఈ ముగ్గురు చెప్పింది ఏదీ కూడా వండొ ద్దమ్మా! ఎంచక్కా ఎండు రొయ్యల వేపుడు, జొన్నరొట్టెలు చేసేయ్" చెప్పాడు.

"మధ్యాహ్నం టైమ్‌లో జొన్నరొట్టెలు ఏంట్రా?" కొత్తవాడు తన ముఖాన్ని కలి కుండలా మార్చేశాడు.

"బావుంటాయి" స్నేహితుడికి చెప్పి "ఇక నువ్వెళ్లమ్మా" నావైపు చూశాడు పెదబాబు.

నేను సరే అన్నట్లుగా తలాడిస్తూ అక్క డ్నుంచి నేరుగా లోపలికి వెళ్లిపోయాను. అంతలో బయటిహాల్లో పని తగిలి వెంటనే వెలుపలికి వచ్చేసరికి పెదబాబు పడకగది లోంచి నా గురించిన సంభాషణ వినిపిం చింది. ఆ మాటల్లో వక్రత తోస్తుండటంతో గుమ్మానికి ఆవతలే నా అడుగులు నెమ్మ దిగా ఆగిపోయాయి.

"అవున్రా ధీరూ మరిచిపోయాను. మన కాలేజీలో అమ్మాయిలకంటే మీ పనిపిల్లే చాలా బాగుంది కదరా! బ్యూటిఫుల్ గాల్! లైన్లో పెట్టకపోయావా? " అడుగుతున్నాడు కొత్తవాడు.

"ఛ! వూరుకోరా" వారించాడు పెదబాబు.

"నిజమేరా! గోపిగాడి మాటల్లో తప్పేం లేదు. అందుబాటులో ఐశ్వర్యారాయ్‌లాంటి ఫిగరు వుండగా బయటి అందాలు ఇక అవ సరమే వుండదు" ఆ వెంటనే అన్నాడు వేణు.

"అంటే? " అర్థం కానట్లుగా అన్నాడు పెదబాబు.

"పోరిగాడికి పొడుపుకథను విప్పి చెప్పి నట్టు నీకు ఇప్పుడు క్లారిఫికేషన్ ఇవ్వాల్సిన అవసరం లేదనుకుంటాను" అదో వంకరగా అన్నాడు వేణు.

"ఇద్సరేగాని, ఇంతకు ఆ పిల్లది ఏ వూర్రా? " అడిగాడు కొత్తవాడైన గోపి.

"మావూరే" చెప్పాడు పెదబాబు.

"అంతేకాదు అక్కడ కూడా ఇంట్లో పని పిల్లే" ఆ తక్షణమే అందుకున్నాడు రాజు.

"ఓరీ నా వైరస్ వచ్చిన ఫ్లాపీ! నీవు జేమ్స్ బాండు అనుకుంటున్నానేగాని మరీ ఇంత వేస్టుక్యాండిడేటువి అనుకోలేదు. ఛ! ఇదే నీ స్థానంలో నేను వుంటేనా? అమ్మాయిని ఏ టూ జడ్ ఎటాక్ చేసేవాడ్ని" అని కాసేపాగి "ఇంతకూ అక్కడి పనిపిల్ల ఇక్కడికి ఎందుకు షిఫ్ట్ అయినట్టు? " అడిగాడు గోపి.

"ఇప్పుడా పిల్ల మల్లేశంగాడి పెళ్లంరా" చెప్పాడు రాజు.

"వాట్? మల్లేశంగాడికి పెళ్లయ్యిందా? అదీ ఈ ఛమక్ ఛమక్‌తో! ఈ కాలానికి వాడే బెటర్రోయ్" అంతెత్తున ఆశ్చర్యపోయి నెల రోజులు నేను టూర్ వెళ్లొచ్చేసరికి మీ మల్లేశంగాడికి మంచి లాటరీ తగిలింది. ఎలాగూ వూర్లో పనిపిల్లే అంటున్నావు కాబట్టి ఈ లాటరీ కోసం ముందే ట్రై చేయ

కపోవడం రియల్లీ వెరీ బ్యాడ్" పచ్చి కుసంస్కారంతో వాపోయాడు గోపి.

వినిపిస్తున్న మాటలు నాలో తుఫాను వరదల్ని సృష్టిస్తున్నా ఇంకేం మాట్లాడతారో విందామని పొంగుకొస్తున్న ఆవేశాన్ని అసహాయంగా అదుపుచేసుకుంటూ బిగుసుకున్న పిడికిళ్లతో అలాగే నిలబడిపోయాను.

"ఆ అమ్మాయి అలాంటిదికాదు. అనవసరంగా ఏదేదో మాట్లాడొద్దు. అది మనకే పాపం" పెదబాబులో నిండుదనం ఎగిసిపడింది.

అంటే? నేను ఖచ్చితంగా పెదబాబును అపార్థం చేసుకున్నాను. నన్ను పీడించిన ప్రశ్న ఇప్పుడు నన్ను పశ్చాత్తాప పరుస్తుంటే పెదబాబు మీద పొంగిపొర్లిన మునుపటి అపారమైన అభిమానం నా కళ్లను తడిచేసింది.

"బిల్డప్‌లు వద్దురా! ఫాక్ట్ మాట్లాడు!" పెదబాబు మాటల్ని కొట్టి పాడేశాడు వేణు.

"ఇందులో లై ఏముందిరా? " నా పెదబాబు గొంతులో ఆశ్చర్యం.

"ఏముందిరా! అంటూ క్వశ్చన్ చేయొద్దు. బయట నీకు బోలెడు గాళ్ ఫ్రెండ్స్ వున్నారు. చెప్పాలంటే కాల్‌గాళ్‌కి కూడా కొదవలేదు. ఇలాంటపుడు శ్రీరామచంద్రుడిలా ఆ ఫోజు ఎందుకురా? " వ్యంగ్యంగా ఎత్తిచూపాడు రాజు.

"వీడు ఇంట్లో రాముడు వీధిలో కృష్ణుడు! లేకపోతే అంకుల్ ఇచ్చే జర్క్‌కి పల్లెటూర్లో పర్మనెంట్‌గా సెటిలైపోతాడు మరి" పెదబాబుకు బదులుగా తనే సమాధానపరిచాడు వేణు.

అంతలో ఫోన్ మోగింది.

"ట్రింగ్... ట్రింగ్..."

"పద్మజ అయివుంటుంది" మనసులో అనుకుంటూ అప్రమత్తమయ్యానేకాని ఫోన్ ఎత్తేందుకు వెళ్లలేకపోయాను. ఎందుకంటే ఫోన్ తాలూకు కార్డ్‌లెస్ పెదబాబు పడక గదిలోనే వుందన్న సంగతి నాకు తెలుసు.

"హలో" లిఫ్ట్ చేశాడు పెదబాబు.

"..."

'ఐసీ! పిలవాలా? "

"..."

"ఇప్పుడు ఎక్కడ్నుంచి మాట్లాడ్తున్నారు? "

"..."

"అలాగే! ఐతే అట్నుంచి నేరుగా కోఠి వచ్చేయండి. కోఠీనుండి ఇక్కడకు ఏ బస్‌లు వస్తాయనేది నాకు ఐడియాలేదు. కాకపోతే బై ఆటో షార్ట్ డిస్టెన్స్! అంటే గణపతి టెంపుల్ ఆర్ సిల్వర్‌స్టార్ కాలేజీ ఈ రెండింటికి అపోజిట్‌లో వుండే రాజా అపార్ట్‌మెంట్‌కి వచ్చేసి అక్కడ గేట్ కీపర్ నిగాని లిఫ్ట్‌బాయ్‌ని గాని ఎవర్ని అడిగినా సరే ఫ్లాట్ అడ్రస్ చెప్పేస్తారు" చెప్పుకుపోయాడు పెదబాబు. అతడి మాటల్ని బట్టి అవతల మాట్లాడుతున్నది పద్మజ అని అర్థమైంది. కానీ ఆ విషయాన్ని మాత్రం పెదబాబు నుండి వినలేకపోయాను. ఇలాగని నేను మనసు నొచ్చుకోలేదు. అతడికి నాపై వున్న మంచి అభిప్రాయానికి మురిసిపోవడం ఒక్కటే నా మనసుకు ఇప్పుడు తెలుస్తోంది. కాబట్టే ఇతరుల వక్రభాష్యం గురించి ఆ సమయానికి తప్పిస్తే మళ్లీ నేను పట్టించుకోలేదు.

"ఎవడు ఏం కూస్తే నాకు ఒరిగిపోయేది ఏముంది? " నాలో నేనే అనుకుంటూ లోపలికి వెళ్లిపోయాను.

మధ్యాహ్నం భోజనాల తర్వాత పద్మజ వచ్చింది. అప్పటికి పెదబాబు తన స్నేహితులతో కలిసి బయటకు వెళ్లిపోయాడు. పద్మజ మోసుకొచ్చిన పుట్టింటి కబుర్లు, పుట్టిన వూరి కబుర్లు మనసుకు హాయి కలిగించాయి. పెదబాబు అర్థమయ్యాడు కాబట్టే ఆ హాయి! లేదంటే పైకి హాయిగా కనిపించినా లోలోపల స్తబ్దుగా వుండిపోయేదాన్ని! ముఖ్యంగా పద్మజతో ఎప్పటిలా కులాసాగా మాట్లాడినప్పటికీ మల్లేశం

గురించి మాత్రం చెప్పలేదు. అతడితో నా సంసారం మాటేమిటోగాని కనీసం అతడి గురించిన సంభాషణకు కూడా నేను అవకాశం ఇవ్వలేదు. ఈ విషయం తెలివైన పద్మజ ఎప్పుడో పసిగట్టేసింది. అందుకే వున్నట్టుండి నన్ను ఆ విషయమై ప్రశ్నించింది.

"ఏంటే వసూ! మీ ఆయన గురించి నేను అడిగితే తప్ప మాట్లాడవు. ఏం తనంటే అంత భయమా? లేకా సిగ్గా? "

"రెండూ కాదు" చెప్పాను.

"మరి? " అడిగింది.

"అలా చెప్పుకోవడం ఏం బాగుంటుంది? " అన్నాను.

"సరేగాని, మీ ఆయన చేసే అల్లరి పనులు ఎలా వుంటాయి? ఐ మీన్ ఒంటరి సమయంలో" నా వైపు చిలిపిగా చూసింది పద్మజ.

"అవన్నీ నీవు అడగరాదు. నేను చెప్పరాదు" వెంటనే అన్నాను.

"ఎందుకమ్మా? " నా బుగ్గలు పిండింది తను.

"అలాంటి ప్రశ్నలు నన్ను ఇబ్బంది పెడతాయి" అంటూ గుంభనంగా తప్పుకున్నానే కాని వాస్తవాన్ని మాత్రం తనతో చెప్పుకోలేకపోయాను. చెప్పుకోలేను కూడా. నా ప్రేమ నా గుండెలోనే సమాధి అయినట్టుగా, ఇక నా బాధ కూడా నాలోనే సమాధి అయిపోవాలనుకుంటున్నాను. అవును! నేను, నా అనుభవాలు, అంతా ఒక పద్మవ్యూహం! ఈ స్థితిలో కాలం నన్ను ఏమైనా ఇంకేమైనా చేయనీ! తెలిసి ఈ లోకం ఏమైనా అనుకోనీ! తెలియక ఈ లోకమే ఇంకేమైనా అనుకోనీ!

"ఫ్రెండ్స్‌తో ఇబ్బందులు గట్రా అంటూ ఎస్కేప్ కాకూడదు. మొగుడితో ఎంత చనువుగా వుంటావో నాతో కూడా నీవు అంతే చనువుగా వుండాలి తెల్సిందా? " నాకు దగ్గరగా జరిగికూర్చుంది పద్మజ.

"సర్లేగాని మన వూరి విశేషాలు ఏంటనేది పూర్తిగా చెప్పనేలేదు" కావాలని సందర్భం మార్చే ప్రయత్నం చేశాను.

"వూరి ఆ లాస్టునుండి ఈ లాస్టువరకు వున్న కబుర్లు మొత్తంగా చెప్పేసినా కూడా నీకు ఇంకా వెలితిగానే తోస్తున్నట్టుంది. నీతో ఇంకేం చెప్పాలో నాకు తెలీదుగాని ముందు స్ట్రాంగ్‌గా ఓ కాఫీ పెట్టివ్వు!" అడిగింది తను.

"వచ్చేయ్" నాతోపాటుగా వంటింట్లోకి తనను కూడా తీసుకు వెళ్లాను.

"నీతో ఒక మాట అనబోతున్నాను" వంటింటిని కలియజూస్తూ అంది తను.

"ఏం మాట? " పాలల్లో షుగర్ కలుపుతూ అన్నాను.

"మ్యారేజయితే అన్నీ సర్దుకుపోతాయని పెద్దవాళ్లు అంటుంటారు. నిన్ను చూస్తుంటే ఆ మాట నిజం అన్పిస్తుంది. అయిష్టంగా మ్యారేజ్ జరిగినా ఇప్పుడు ఇష్టంగా కనిపిస్తున్నావు. పైగా ఈ ఇంట్లో నీకు దేనికీ లోటు లేనట్టుంది. ఎప్పుడుపడితే అప్పుడు ఏది ఇష్టమైతే అది హాయిగా ఎలాంటి కండీషన్స్ లేకుండా చేసుకుని తినొచ్చు తాగొచ్చు ప్చ్! దేనికైనా ఫేట్ వుండాలి" నా అదృష్టాన్ని హర్షిస్తూనే తన దురదృష్టం గురించి బాధను వ్యక్తం చేసింది పద్మజ.

'నాది అదృష్టం కాదే! నేను ఈ ప్రపంచంలోని ఘోరమైన దురదృష్టవంతుల్లో ఒకదాన్ని! నా గురించి నీవు భ్రమపడుతుంటే నాకు ఏడవలేక నవ్వొస్తోంది' మనసులోనే పేలవంగా అనుకుని పైకి మాత్రం ఓ అరువు తెచ్చుకున్న చిరునవ్వును అందంగా చిందించాను.

పద్మజ మరేదో అనబోయింది. అంతలో బయటినుండి పెదబాబు వచ్చేసినట్టుగా అతడు సన్నగా పాడుకుంటున్న పాట తాలూకు శబ్దం నా చెవుల్ని మృదువుగా వచ్చి తగిలింది.

"పెదబాబుగారు" గొంతు తగ్గించి పద్మ

జతో చెప్పాను.

"ఫోన్‌లో మాట్లాడాను గాని ఇప్పుడు తనకు ఎదురుగా వెళ్లాలంటే భయమనిపిస్తోంది" జంకింది పద్మజ.

"వూర్లో వున్నప్పుడు నేను కూడా నీలాగే భయపడేదాన్ని. కాని ఇక్కడికి వచ్చాక అర్థమయ్యింది. అబ్బాయిగార్లు ముగ్గురూ చాలామంచి వాళ్లు" తగ్గించిన గొంతుతోనే చెప్పాను. కాని వాస్తవం చెప్పాలంటే చిన్నబ్బాయిల్తో నాకు పెద్దగా భయంలేదుకాని నా పెదబాబుతో మాత్రం నాకు చచ్చేంత భయం.

"వాళ్లు ఏదైతే మనకెందుకుగాని వెళ్లి విష్ చేసి వస్తాను" అంతలోనే మనోధైర్యపడింది పద్మజ.

"నువ్వేంటీ? భయమంటావు. వెళ్తానంటావు? " నవ్వుతూ అని "వెళ్లు" చెప్పాను. ఆ వెంటనే బయటకు నడిచింది పద్మజ. ఆ వెళ్లడమనేది దొంగ పిల్లిలావుంది. అందుకే దాన్ని వెనకనుండి చూస్తూ నాలో నేనే మురిపెంగా నవ్వుకున్నాను.

ఆ రోజుకి అక్కడే వుండిపోయింది పద్మజ. మా మల్లేశం విషయానికి వస్తే మరో నాలుగైదు రోజులవరకు ఇంటి ముఖం చూడటం కుదిరేట్టు లేదని పరిస్థితులు చెబుతున్నాయి. ఈ విషయమై నాకు బాధలేదు. అతడు నాకు ఎంతదూరంగా వుంటే అంత సంతోషం. కాబట్టి ఆ విషయమై నేను పెద్దగా ఆలోచించలేదు కూడా. ఇక పెదబాబు విషయానికి వస్తే అతడికి నాపైవున్న మంచి అభిప్రాయానికి నాలో అతడిపట్ల అచంచలమైన అభిమానం, అనురాగం ఒక్కుమ్మడిగా దినదినాభివృద్ధి చెందడం మొదలయ్యింది. అంతే కాదు, మునుపటి నా ప్రేమ పునఃప్రారంభమై నాకు పెళ్లయ్యిందనే సంగతిని చాలాసార్లు మరిపింపచేస్తోంది.

నేను మనసుపడ్డ ఆ రాజకుమారుడు ఎక్కడ? నేను కట్టుకున్న ఆ సేవకుడు ఎక్కడ? సింహం దారి తప్పినా బోనులో చిక్కినా తన పౌరుషాన్ని మాత్రం మరిచిపోలేదు. అలాగే వసంతం వెళ్లిపోయిందని కోకిలమ్మ తన జీవితాన్ని త్యజించుకోలేదు. సింహం అరణ్యం కోసం, కోకిలమ్మ వసంతం కోసం తప్పకుండా ఎదురుచూస్తాయి. ఈ నిరీక్షణలో అవి గెలవొచ్చు ఓడొచ్చు! ఇప్పుడు నేను కూడా అదే పరిస్థితిలో వున్నాను. అంటే పెదబాబు మీది మోజుతో తప్పటడుగులు వేయాలని కాదు నా ప్రయత్నం! రాజమార్గంలోనే నా రాజకుమారుడిని చేరుకోవాలనేదే నా తాపత్రయం! ఇందుకు పద్మజను ఓ చిన్న ప్రయత్నంగా ఉపయోగించుకోవాలనుకున్నాను. అనుకున్నానేకాని నా ప్రయత్నాన్ని మాత్రం బయల్పరచలేదు. అంతా ఒక నిశ్శబ్ద సంగ్రామం.

"నేను ఈ రోజు వెళ్తానే" మరుసటి రోజు ఉదయాన్నే అంది పద్మజ.

"ఓ రెండ్రోజులు వుండి వెళ్లు" చెప్పాను.

"వద్దే!"

"ఏం? వుండాలనిపించట్లేదా? "

"అది కాదే, పెళ్లివాళ్లు ఈవాళ రాత్రికి వెళ్లిపోతారు"

"వెళ్లనీ"

"మా అమ్మ సంగతి నీకు తెలుసుకదా? ఒక్క గంట లేటయినా ఎవడితో కులికి వచ్చావంటూ నన్ను చంపుకు తింటుంది. రాక్షసి"

"పోనీ ఈ రోజు సాయంకాలం వరకైనా..."

"మధ్యాహ్నమే తలంబ్రాలు"

"నువ్వెళ్లకపోతే పెళ్లి ఆగిపోదులే"

"అబ్బా... ట్రైటూ అండర్ స్టాండ్ మీ"

"స్టాండూ లేదు బస్టాండు లేదు. నువ్వుంటున్నావు అంతే" ఖచ్చితంగా చెప్పి స్నానం కోసం బాత్‌రూంవైపు నడిచాను. నేను అనుకున్న పనిని ఆచరణలో పెట్టేందుకు ఆలస్యం చేయకూడదు. సమయం తక్కు

వగా వుంది కాబట్టి వెంటనే కావించాలి. ఈ ఆతృత కొద్దీ స్నానం కూడా ఆదరబాదరగా చేసి వెలుపలికి వచ్చి "పద్దూ... ఏయ్ పద్మజా" పిలిచాను.

"ఏంటే? " అడుగుతూ వచ్చింది పద్మజ.

"ఒక సహాయం చేస్తావా? " అడిగాను.

"హెల్ప్ చేయడంలో ఈ పద్మజకి సాటి మరెవ్వరూ లేరు. ఏంటో చెప్పు. టెల్ మీ" ఫోజుగా అంది పద్మజ.

"ఫోజులొద్దే! ఒద్దికగా నిలబడు. ఎందుకంటే నా పెళ్లి విషయంలో..." నా మాట పూర్తి కాకుండానే తను అందుకుంటూ "నోనో ఆ విషయంలో నేను ఫెయిల్ కాలేదు. పరిస్థితులు అలా దాపురించాయి" అంది పద్మజ.

"ఈమారు మాత్రం ఫెయిల్ కావొద్దు. ఫెయిలై ఇలాంటి సాకులు చెప్పుకోవద్దు" అని కాసేపాగి "ఆ పద్దూ! మరేంలేదు" అంటూ అసలు విషయానికి వచ్చేందుకు కొద్దిగా తడబడ్డాను.

"మరేం లేకపోతే నోర్మూసుకో" చమత్కారంగా ఆ వెంటనే అంది పద్మజ.

"అబ్బా చెప్పేవరకు ఆగవే" అని ఇక అసలు సంగతికి వస్తూ ఆలోచనగా కళ్లను ఒకసారి పైకెత్తి తర్వాత పద్మజను సూటిగా చూస్తూ "పద్దూ మరేంటంటే" అంటూనే పద్మజకు మరీ చేరుగా జరిగి "పెదబాబుకు అమ్మాయిల పిచ్చి ఎక్కువ! ఈ విషయం నాకు - నిన్ననే తెలిసింది. డబ్బుగల గొప్పింటి వాళ్లకు అలాంటివి సహజమే కావచ్చు. ఇలాగని వాళ్లకు అవసరమే తప్ప మనసు తెలీదు అనుకోవడం పొరపాటు. వాళ్లకు కచ్చితంగా ఎవ్వరో ఒకరిపై మనసు వుంటుంది. అపారమైన ప్రేమ వుంటుంది. అయితే ఈ విషయంలో పెదబాబు ఇంకా ఎవ్వర్నీ అంతగా ఇష్టపడివున్నట్టుగా లేదు. కాబట్టి అతడ్ని మనం సరదాగా ఫూల్ చేయాలి" చెప్పుకుపోయాను.

"ఓయ్! ఎవ్వర్తో అయినా పెట్టుకోవచ్చు గాని దొరబాబు వాళ్లతో కాదమ్మా" నా తలపై చిన్నగా మొట్టింది పద్మజ.

"మనం ఏమైనా పెదబాబును అవమానపరుస్తున్నామా? కేవలం ఆటపట్టిస్తున్నాం" అన్నాను.

"పెద్దింటి వాళ్లను చీట్ చేయడమంటే అంత ఈజీ అనుకోవద్దు పోకిరీ" చిటికేసింది పద్మజ.

"అంటే మన పేరు బయటపడదు"

"అయినా సరే"

"మరేం కాదులేవే"

"ఏంటే నీకు ఈ యూజ్‌లెస్ ఇంట్రెస్టు? "

"పెళ్లయిపోగానే పెద్దదాన్ని అయిపోయినట్టుగా వుంది. నాలో ఈ భావన పోవాలీ అంటే సరదాగా ఇలాంటి ఆటలు..." అభ్యర్థనగా అన్నాను.

ఇందుకు పద్మజ ఐదారు క్షణాలు మౌనం వహించి ఆ తర్వాత "ఆ సరే మరి ఇందుకు నన్నేం చేయమంటావు? " అడిగింది.

"గొంతు మార్చి పెదబాబుతో ఫోన్‌లో మాట్లాడాలి" చెప్పాను.

"ఏంటీ? " నా వైపు ఆశ్చర్యంగా చూసింది పద్మజ.

"అవును" తల గోకుతూ అన్నాను.

"ఏం మాట్లాడాలి? " కనుబొమలు ఎగరేసింది తను.

"మరేం లేదు. నీ పేరు, వివరాలు గట్రా ఏమీ చెప్పకుండా కేవలం నీవు తనని ప్రేమిస్తున్నట్టుగా మాట్లాడాలి. నీవు మాట్లాడే తీరు అతడ్ని పడగొట్టేలా వుండాలి. ఇందుకు నీవేం మాట్లాడతానో నాకు తెలీదు. కాకపోతే ఎక్కడా కూడా నీవు పట్టుబడిపోకుండా వుండాలి" ఒక్కో మాట జాగ్రత్తగా చెప్పాను.

"ఓకే! నా మాటలు అతన్ని అన్‌ఎక్స్‌పెక్టెడ్‌గా పడగొట్టేశాయి అనుకో! దెన్ నేను నిజంగానే ప్రొసీడ్ అయిపోతాను" పద్మజ తీరులో సరదా కనిపిస్తున్నప్పటికీ ఆ మాటలు నాలో నాకు తెలీకుండానే ఒక

విధమైన కలవరాన్ని అనూహ్యంగా సృష్టించాయి. కాగా ఈ భావాన్ని బయల్పడనీయకుండా నన్ను నేను తమాయించుకుంటూ "సరే! నా స్నేహితురాలు చిన్న దొరసాని అయితే నాకు అంతకన్నా ఆనందం మరేముంది?" చిరునవ్వును చిందిస్తూ అన్నాను.

"ఎప్పుడు మాట్లాడాలి? ఎక్కడ మాట్లాడాలి?" నా మాటలకు తను కూడా చిన్నగా మురిసిపోతూ అడిగింది.

"నేను చెప్పినట్టుగా నీవు ఓ రెండు మూడు రోజులు ఇక్కడే వుంటే గనుక నీవు ఇక్కడ వున్నన్ని రోజులు మాట్లాడిద్దాం అనుకున్నాను. కాని తమరు ఈ రోజే వెళ్తానంటున్నారుకదా! కాబట్టి మధ్యాహ్నాం రెండు గంటలకు ఈ బిల్డింగ్ చివరవున్న ఎస్‌టిడి బూత్ దగ్గరకు వెళ్లి ఇక్కడికి ఫోన్ కలుపు? అయితే ఇక్కడ ఒక విషయం మరిచిపోవద్దు. ఏంటంటే నీవు మాట్లాడే మాటలు రెండో మనిషికి వినిపించకూడదు. అద్దాల వెనక్కి వెళ్లి గొంతు తగ్గించి మాట్లాడు. సరేనా?" జాగ్రత్తలు సూచిస్తూ చెప్పాను.

"ఈ పద్మజ రంగంలోకి దిగిందీ అంటే అంతా కేర్‌ఫుల్! సో జాగ్రత్తల గురించి నీవు నాకు ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు! ఆ" వీరనారిలా అంది తను.

దాని తీరుకు చిన్నగా నవ్వుతూ సుకుమారంగా దాని బుగ్గలు పిండాను నేను.

"హోయ్! పిచ్చీ! ఇంతకీ ఈ సరదా గేమ్ వల్ల నీకు దొరికే బెనిఫిట్ ఏంటే? హెల్ప్ అంటూ ఫోజు కొట్టావు?" అడిగింది తను.

"బెన్‌ఫిట్ అంటే ఏదో గొప్పగా కాదే"

"మరి?"

"ఏం లేదే! బాబుగారిని మనం గుప్పిట్లోకి తెచ్చుకున్నాం అనుకో, ఇక ఎంచక్కా కొద్దో గొప్పో డబ్బు సంపాదించుకోవచ్చు అన్న మాట! ఎలా అంటే... అబ్బాయిగార్లు వాస్తవానికి ఎంత మంచి వాళ్లయినా డబ్బు దగ్గర కొద్దిగా కట్టడి! కాబట్టి తిండీ జీతమే తప్పిస్తే అదనంగా వచ్చేది ఏముండదు. ఈ పరిస్థితిలో బాబుగారిని మనం పట్టేస్తే, తను ఇక ఆ విషయం గురించే ఆలోచిస్తూ ఇక వేరే విషయాల గురించి పెద్దగా పట్టించుకోడు. ఈ స్వభావాల్ని అమ్మాయిల విషయంలో కాకపోయినా వేరే విషయాల్లో నేను గమనించాను. మనం అసలే పేద వాళ్లం. ఈ స్థితిలో కొంత డబ్బు వెనకేసుకుని అమ్మావాళ్లకు సహాయపడితే బాగుంటుంది. పైగా... ఇంతక్రితం చెప్పినట్టుగా నాకూ కొంత కాలక్షేపం దొరుకుతుంది" పచ్చి అబద్ధాల్ని పచ్చదనమంత అందంగా చెప్పుకుపోయాను.

"బాబుగారిని గ్రిప్‌లోకి తీసుకోవడానికి, డబ్బు రావడానికి సంబంధం ఏమిటే?" అర్థంకానట్టుగా అడిగింది పద్మజ.

అందుకు నేను చిన్నగా నవ్వి "ఇందులో పెద్ద మర్మం ఏం లేదు. అవసరాలకోసం ఎక్కువ డబ్బులు ఇచ్చి కూడా లెక్క అడగడం మర్చిపోతుంటాడు అంతే" చెప్పాను.

"ఇది మోసం కాదూ?" వేలు పెట్టి చూపించింది పద్మజ.

"ఛఛ! పొట్టకూటికోసం చిన్ని ప్రయత్నం" లోలోపల భుజాలు తడుముకున్నప్పటికీ పైకి మాత్రం తేలిగ్గా తీసిపడేశాను.

"పద్మజ మరేదో అనబోయింది. అంతలో నేనే కల్పించుకుంటూ "చెల్లెళ్లకు అస్సలు బట్టలు లేవు. సరైన తిండి తినలేరు. ఇక్కడ నాకు ఎంత మంచి భోజనం దొరికితే ఏం లాభం? ఆత్మకు తృప్తిలేదు. మరి ఇలాంటపుడు డబ్బు కావాలని అడిగే కంటే, ఇలా డబ్బు సంపాదించుకోవడం మేలనిపిస్తుంది. ఈ మార్గంలో అయినా ఎక్కువ డబ్బు సంపాదించుకోలేను. వచ్చిన ఐదారు వందలైనా సరే చెల్లెళ్లకు ఇవ్వాలని వుంది" బాధగా చెప్పుకున్నాను.

అందుకు పద్మజలో కూడా ప్రతిచర్య కనిపించింది. కాని నా స్వార్థంకోసం నేను

చెప్పుకున్న అబద్ధాలు నాకే చిన్నపిల్లల ఆటలా తోస్తుంటే సిగ్గుతో నా మనసు అల్లాడిపోవడం మొదలయ్యింది. 'నా పథకం వ్యర్థప్రయత్నమని అనిపించింది. అయినప్పటికీ తమాయించుకుంటూ గెలిచేలా ప్రయత్నిద్దాం' మనసులోనే అనుకున్నాను.

ఇక ఆరోజు మధ్యాహ్నం రెండుగంటలకు అనుకున్నట్టుగానే పద్మజను తీసుకుని మా గదికి వచ్చాను. అట్నుంచి పద్మజను కిందికి పంపించాను. నేను చెప్పినట్టుగానే పెదబాబుకు ఫోన్ చేసి, మాట్లాడి అర్ధగంటలో తిరిగి వచ్చేసింది పద్మజ. తను వచ్చీరాగానే, నేను అడకముందే తను పెదబాబుతో ఏమేమి మాట్లాడిందో అంతా పూసగుచ్చింది.

"మొత్తానికి అజ్ఞాత అమ్మాయిపై మన గురుడికి ఆసక్తి పెరిగింది అన్నమాట" తను చెప్పింది అంతా విన్నాక ఉత్సాహంగా కళ్లింతచేసి అన్నాను.

"ఇప్పుడు సెట్ కావడం ఓకే! రేపట్నుంచి నీ ప్రయత్నాలు ఏంటో నువ్వు మొదలెట్టు" చెప్పి "పద! ఫీలింగ్స్ ఎలా వున్నాయో చూద్దాం" అంటూనే నాకంటే ముందుగా తనే బయలుదేరింది పద్మజ.

మేము వూహించినట్టుగానే తనలోతనే ముసిముసిగా నవ్వుకుంటూ కళ్లు మూసుకుని, కుర్చీలో వెనక్కి జారగిలబడి, తాదాత్మ్యంగా ఏదో హిందీ పాటను తనలో తనే పాడుకుంటూ కనిపించాడు పెదబాబు.

"నీ బలహీనతను పట్టేశాను. మరి నా పరిస్థితి ఏమౌతుందో వేచిచూడాలి" పెదబాబును చూస్తూ మనసులోనే అనుకున్నాను.

★ ★ ★

ఆ రోజు సాయంకాలానికే పద్మజ వెళ్ళిపోయింది. మరుసటిరోజు ఎప్పట్లా పనిలోకి వెళ్ళాను. నేను వేళ్లేసరికి వ్యాయామం చేసి, స్నానం కూడా ముగించుకుని, బాలభానుడితో పోటీపడుతున్న నేలమీది గంధర్వ కుమారుడిలా కనిపించాడు పెదబాబు.

"ఈ అదృష్టాన్ని వదులుకోరాదు" అతడ్ని అలాగే చూస్తూ మనసులోనే అనుకుని నా పని కోసం నేను లోపలికి వెళ్ళిపోయాను. నా నిర్ణయంపట్ల ఒకవైపు భయం, మరోవైపు అపనమ్మకం, ఆ రెండింటి మధ్య బయల్పడని ఒక తెగింపు, మూడు కలిసి నన్నొక ప్రేమపిపాసిగానో, ప్రేమ చైతన్య దీపికగానో మారుస్తుంటే, లోలోపలే కోటిదేవుళ్లను మొక్కుకుంటూ స్టౌవ్‌మీద కాఫీకోసమై పాలుపెట్టి తర్వాత కూరగాయలు తరుక్కోసాగాను.

"వసుంధరా" అంతలో పెదబాబు దగ్గర్నుండి పిలుపు వినిపించింది.

"వస్తున్నాను బాబుగారూ" గట్టిగా చెప్తూనే ఆ వెంటనే వెలుపలికి బయలుదేరాను.

అదే సమయంల లోపలికి వస్తున్న పెదబాబును నా తొందరపాటుకొద్దీ చూసుకోలేక రెండవగుమ్మం మలుపులో బలంగా ఢీకొట్టాను. అతడి బలమైన తాకిడి ఆ స్థితిలో నాలో ఏవిధమైన భావాల్ని సృష్టించిందో కూడా తెలియకపోగా, అనూహ్యామైన స్థితికి ఒక్కసారిగా లోకాన్ని మరిచిపోయినట్టయ్యింది. అది కొన్ని క్షణాలవరకు మాత్రమే ఆ తర్వాత తేరుకున్న నేను, భయంతో కంపించిపోతూ చప్పున దూరం జరిగి "క్షమించండి బాబుగారూ" చేతులు జోడించాను.

"ఓకే ఇట్సాల్‌రైట్" అతడిలో మృదువైన చిరునవ్వు.

"తొందరపాటులో చూసుకోలేదు" అతడు తేలిగ్గా కనిపించినప్పటికీ మళ్ళీ సర్దిచెప్పుకున్నాను.

"ఓకే ఓకే..." అతడిలో అదే చిరునవ్వు.

నేను ఇంకేం మాట్లాడలేదు. అంతక్రితమే తను పిలిచాడు కాబట్టి భయంగా ఒక పక్కగా నిలబడిపోయి ఎందుకన్నట్టుగా అతడి ముఖంలోకి చూశాను.

"వెళ్లు" ఎందుకు పిలిచాడో చెప్పకుండా

నన్ను ఇక లోపలికి వెళ్ళమన్నట్టుగా అన్నాడు.

"చెప్పాలనుకున్న విషయం మరిచిపో యాడేమో బహుశా! గుర్తుకువస్తే మళ్ళీ పిలుస్తాడులే" మనసులోనే అనుకుంటూ, ఆ వెంటనే లోపలికి నడిచాను. కాని ఎంత సేపటికీ కూడా తను నన్ను పిలవలేదు. ఏ విషయమూ చెప్పలేదు. నేను కూడా ఇక ఎంతోసేపు ఆ విషయం గురించి ఆలోచిం చలేదు. పని పూర్తిచేసుకున్నాక, బడలికగా అనిపించడంతో స్నానం చేద్దామని మాకు కేటాయించిన బాత్‌రూమువైపు నడిచాను. అప్పటికే నా స్నానం పూర్తయ్యింది. కాని అలసటను పారద్రోలేందుకు స్నానం మంచి సాధనం కాబట్టి మళ్ళీ అందుకు ఉపక్రమిం చాను.

బాత్‌రూమ్‌లోకి వెళ్ళాక అతడి స్పర్శను మౌనంగా మననం చేసుకున్నాను. అద్వితీ యమైన అలజడి నిలువెత్తున కవాతుచే సింది.

"ఛీ" మృదువుగా నాలో నేనే నవ్వు కుంటూ చల్లని నీళ్ళు తలమీంచి గుమ్మరిం చుకున్నాను. కలిగిన హాయిలో అతడి స్పర్శ స్ఫురించి గిలిగింతలు పెడుతుంటే, మహా టంకంలా మల్లేశం గుర్తుకు వచ్చాడు. అంతే! నిలువెత్తున నీరుగారిపోయాను.

'నేనేంటి? నాకు అతడు భర్తఏంటి? రాత రాసిన కాలానికైనా కాస్తా ఆలోచన వుండాలి!' నాలో నేనే కాలాన్ని తిట్టు కుంటూ, బట్టలు కట్టుకోసాగాను. అంతలో నాపై ఏదో నీడ పడినట్టనిపించింది. "ఏంటబ్బా? " అనుకుంటూ చుట్టూ చూసి ఆ తర్వాత పైకి చూశాను. నా గుండె ఒక్క సారిగా జల్లుమంది. సగం మాత్రమే కప్పి వున్న రేకు కప్పులోంచి తమ మిద్దెమీద నిల్చుని కేబుల్‌వైరు సరిచేస్తున్న పెదబాబు తలవరకు కనిపించాడు.

"నేను అతడికి కనిపించానా? నన్ను అతడు చూశాడా? కూర్చుని స్నానం చేశాను కాబట్టి అలాంటిది ఏం జరిగివుం డదు" నాలో నేనే కంగారుపడుతూ హడావి డిగా అడ్డదిడ్డంగా బట్టలు కట్టుకోవడం పూర్తిచేసుకుని క్షణాల్లో బయటకి వచ్చే శాను.

కాసేపటి తర్వాత మిద్దెదిగి వచ్చిన పెద బాబులో ఎలాంటి కొత్త ధోరణి కనిపించ లేదు. సహజంగా వున్నాడు. అది చూసి "హమ్మయ్య" అనుకున్నాను. ముఖ్యంగా... పెళ్ళికి ముందు అతడిని గాఢంగా మన సారా ప్రేమించడం, పెళ్ళి తర్వాత అతడు నావాడు కాలేకపోయాడు కదాని బాధపడి పోవడం, మరి ఆ తర్వాత అతడు నా వ్యక్తి త్వాన్ని, ప్రవర్తనని తప్పుగా అర్థంచేసుకున్నా డేమోనని కుమిలిపోతూనే... అతడి తీరుని నిరసించడం, అతడిమీది ప్రేమను కాదను కోవడం, ఈ స్థితిలోనే అనూహ్యంగా మళ్ళీ అతడ్ని అభిమానించడం, ఆరాధించడం, కావాలీ అనుకోవడం... అంతా ఒక కలలా జరిగిపోయింది. ఇలాగని నా పరిధిదాటి అతడిని నేను చేరుకోలేను. నా ప్రయత్నం గెలవాలి. అంతవరకు నేను నేనే!



సాయంకాలం తన స్నేహితులతో కలిపి వచ్చాడు పెదబాబు. రాగానే ఎప్పటిలా

ఫోన్స్ గురించి అడిగాడు. నేను అనుకున్న ప్రకారం అందంగా కట్టుకథని వివరించాను.

"అమ్మాయి ఎవరో ఫోన్ చేసింది బాబు గారూ!"

"అలాగా! ఏం మాట్లాడింది? " ఆసక్తిగా కళ్ళింత చేశాడు.

"మీ గురించి అడిగింది. అర్జెంటుగా మాట్లాడాలని అంది. నేను మీ సెల్‌ఫోన్ నంబర్ ఇచ్చాను"

"పేరు? "

"అడిగాను. కాని చెప్పలేదు"

"చెప్పలేదా? " అని ఆలోచనగా కాసేపు ఆగి "ఇంకేమైనా ఫోన్స్ వచ్చాయా? " అడిగాడు.

"మిగతా ఫోన్స్ రోజూ వచ్చేవే బాబు గారూ! వాళ్ళందరి పేర్లు ఆ నోట్‌బుక్‌లో రాసిపెట్టాను" చెప్పాను.

"ఓకే!" అవి నేను చూసుకుంటాను అన్నట్టుగా అని "ఏరా... ఈవినింగ్ స్పెషల్‌గా ఈ రోజు లైట్‌గా డ్రింక్ తీసుకుందాం" స్నేహితులకి చెప్పి "నువ్వెళ్ళి మాకోసం ఆమ్లెట్స్ రెడీ చేయి" చెప్పాడు పెదబాబు.

సరే అన్నట్టుగా తలాడిస్తూ లోపలికి నడిచాను. అదే సమయంలో "ఫోన్ ఏంటీ? అమ్మాయి ఏంటీ? మాకేం అర్థంకాలేదురా? ? " నా ఫోన్ కథ గురించి స్నేహితుడు ఒకడు ప్రశ్నగా మారిపోగానే "ఏమోరా! అంతా ఒక సర్‌ప్రయిజ్! పేరూ తెలీదూ వూరూ తెలీదూ, నిన్నటి నుండి నాతో ఫోన్ కాంటాక్ట్ పెట్టుకుంది. నిన్ననే సెల్ నంబర్ ఇచ్చాను కూడా! కాని టక్కరి దొంగ! సెల్‌కు మాత్రం చేయడంలేదు" అమ్మాయి ఫోన్ తన మేల్ ఇగో తాలూకు ఎస్టేట్‌ని అమాంతం పెంచేసినట్టుగా, అదో ఖుషీగా సమాధానం చెప్పాడు పెదబాబు.

"దొరికిపోయావు" నా మనసులోనే మురిసిపోతూ, ఆ తర్వాత వాళ్ళు ఇంకేం మాట్లాడుతున్నారో కూడా పట్టించుకోకుండా పూర్తిగా లోపలికి వెళ్ళిపోయాను.

చిన్నబాబులు ఇద్దరూ "రాముడు మంచి బాలుడు" అన్నట్టుగా కాకపోయినా, స్మోకింగ్, డ్రికింగ్ వంటి అలవాట్లకు విరోధులుగా కనిపిస్తారు. పెదబాబు మాత్రం ఆల్‌రౌండర్! అన్ని అలవాట్లు వున్నట్లుగా అర్థమౌతుంటాడు. అయితే దొరబాబు, అమ్మగారు, వచ్చినప్పుడు మాత్రం అబ్బాయిగార్లు ముగ్గురూ కూడా అన్ని విషయాల్లో "మంచిబాలురు" అన్నట్టుగా ప్రవర్తిస్తారు. ఒక్కవిషయంలో తప్ప! అదేంటంటే మల్లేశాన్ని ఆటపట్టించే విషయంలో! నా పెళ్ళయి ఇక్కడికి వచ్చాక దొరబాబు దంపతులు రాలేదు కాని, ఫోన్లు మాత్రం అదేపనిగా చేస్తుంటారు. అప్పుడు ఈ అబ్బాయిగార్లు తాము మల్లేశాన్ని ఏడిపించిన సంగతుల్ని ఫోన్‌లో నవ్వుతూ చెప్తుంటారు. కాని ఒకసాటి మనిషిగా వాస్తవం చెప్పాలంటే... అబ్బాయిగార్లు ఆటపట్టింపు ధోరణి కొన్నిసార్లు నవ్వు తెప్పిస్తుంది కాని, మరికొన్నిసార్లు కోపం తెప్పిస్తుంది!

"ఆమ్లెట్స్ వేశావా? " అడుగుతూ వచ్చాడు పెదబాబు.

"ఆ... అయిపోయింది" అంటూ మిగిలిన గుడ్డురసాన్ని పెనంపై వేశాను.

"ఈసారి ఆ అమ్మాయి ఫోన్‌చేస్తే, పేరు అడగవద్దులేగాని... ఏరియా అడుగు" చెప్పాడు పెదబాబు.

"సరే బాబుగారు" చెప్పాను. పెదబాబు ఇంకేం మాట్లాడలేదు. విజిల్‌తో హిందీ పాటను హమ్ చేసుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు.

'తమ క్లాస్‌మేట్స్‌పై అనుమానంగా వున్నట్టుంది. అందుకే ఏరియా అడగమంటున్నాడు' నాలో నేనే నవ్వుకున్నాను. అంతే కాదు, అదే రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో వచ్చిన స్నేహితులకు వీడ్కోలు చెప్పడానికని కింద గేటువరకు తను అలా వెళ్ళి ఇలా వచ్చేలోపు మరో కట్టుకథను

## సచిత్ర విచిత్రం

# బార్ విత్ హాస్పిటల్




ఆస్ట్రేలియాలోని క్వీన్స్‌లాండ్ అనే వూళ్లో ఓ బార్ ఉంది. దీని పేరు 'గార్డెన్ బార్'. ఇందులో సీఫుడ్ వగైరా అన్నీ సర్వ్ చేస్తారు. ఎంటర్‌టెయిన్‌మెంట్ కోసం లైట్ మ్యూజిక్ కూడా ఉంటుంది. అంతేకాదు, మరీ ఎక్కువ తిన్నా, ఎక్కువ తాగినా ఆ విషయం చూడడానికి ఓ చిన్న హాస్పిటల్ కూడా బార్‌కి అటాచ్‌డ్‌గా నడుపుతున్నారు. క్వీన్స్‌లాండ్ లోని ప్రజలకు తాగుతుంటే ఆపూ అంతూ ఉండదు కాబోలు, అందుకే వాళ్ల కోమాలోకి వెళ్లకుండా చూడడంకోసం బహుశా ఈ హాస్పిటల్ ఏర్పాటు చేసిఉంటారని చాలా మంది అభిప్రాయం.

అల్లుకుని, తను రాగానే "అమ్మాయి ఇందాకే ఫోన్‌చేసింది. మీరు అడగమన్నట్టుగానే ఏరియా అడిగాను. కాని చెప్పలేదు. మళ్ళీ ఫోన్ చేస్తాను అంది" చెప్పాను.

"ఎప్పుడు? " అడిగాడు తను. ఆ అడగ డంలో మునుపటి ఆసక్తికి తోడు అదో నిషా!

"సరిగ్గా చెప్పలేదు. తను ఉరుమూ మెరు పూలేని వర్షంలా నీపై కురుస్తుందే తప్ప సమయాలు అంటూ చెప్పదట" చెప్పాను.

"ఎసీ..." అవునా అన్నట్టు అని "ఆ... దట్స్ ఓకే! నన్ను కళ్లుగప్పి తను ఎంతో కాలం వుండలేదులేగాని, నా క్కొంచెం నడుము నొప్పిగా వుంది. కాస్త వేడి కాపు తావా? " అభ్యర్థనగా అడిగాడు.

"కాపుతాను బాబుగారూ" అంటూనే వేడి కోసం లోపలికి నడిచాను.

'బాబుగారు అసలే తాగివున్నారు. తోడుగా ఒంటరిగా వున్నాం. పైగా వేడికా పమని అడుగుతున్నాడు. నాపై మరో లాంటి ఉద్దేశ్యం లేదుకదా!' మనసులోనే అనుకుని, అంతలోనే నన్ను నేను వారించు కుంటూ 'ఛ! తను బయట ఎలాంటి వాడైనా నా విషయంలో అలాంటివాడు కాదని, ఎప్పుడో అర్థమయ్యింది కదా! మళ్ళీ నాలో ఈ అనుమానం ఏంటి దరిద్రంగా!' నా తలను నేనే చిన్నగా కొట్టుకున్నాను. తర్వాత నిష్కల్మషంగా కిరోసిన్ స్టౌవ్ తీసు కుని తన గదిలోకి నడిచాను.

అప్పటికి తను మంచంపై బోర్లా పడు కుని వున్నాడు. లుంగీ తప్ప ఒంటిపై మరే మీలేదు. కొద్దిగా అంటూనే బాగానే తాగారు కాబట్టి కాస్త ఒళ్లు మరిచిపోయినట్లుగా పడు కుని వున్నా, అదంతా శరీరకమైమరుపు! భౌతికంగా మాత్రం ఎప్పటిలా వున్నాడు. అందుకు తార్కాణంగా ఇందాక ఫోన్ సంభాషణే కాదు, ఇప్పుడు నేను .గదిలోకి వెళ్ళగానే "వసుంధరా! నీకు కాపాలనిపిస్తేనే కాపమ్మా! ఇబ్బంది అనిపిస్తే మాత్రం వద్దు. సరేనా? " పడుకునే చెప్పాడు.

"మరేం ఫరవాలేదు బాబుగారూ" అంటూనే స్టౌవ్‌ని ఒక పక్కగా వుంచి, పెనం వేడిచేసి, వేడిపెనంపై కాటన్ గుడ్డను అదిమి అతడి నడుముపై మృదు వుగా వత్తాను.

"అమ్మా..." బాధగా మూలిగాడు అతడు.

"వేడి ఎక్కువయ్యిందా? బాబుగారూ" కంగారుగా అడిగాను.

"ఆ! కాస్త తగ్గించు" చెప్పాడు.

నేను వెంటనే స్టౌవ్ తగ్గించి, గోరువెచ్చని వేడితో కాపడం మొదలెట్టాను.

"ఆ... బాగుంది" హాయిగా అన్నాడు పెదబాబు.

నాకాపడం అతడిలో ఎంత హాయిని కలి గిస్తుందో, అంతకు రెట్టింపుగా అతడికి కాపు తున్నందుకు నాలో ఆహ్లాదం కలుగుతోంది. నిజం! అతడి దగ్గరితనం నాలో ప్రేమోద్రే కాన్ని కలిగిస్తుంది. అలాగే గంటల తరబ డిగా అక్కడే వుండిపోవాలనిపిస్తుంది. ఇలా గని నా తనువులో హద్దులు దాటే ఆరాటం లేదు. మనసులు ముడిపడాలనే ఆతృత మాత్రమే వుంది. ఈ స్థితిలో అక్కడే ఎంత సేపు వుండిపోయానో అర్థంకావడం లేదు కాని, నన్ను నేను మైమరిచి అతడిని అలాగే కాపుతూ వుంటే, అనూహ్యంగా అతడి చేయి నా భుజంపై పడింది. ఆ పరి ణామానికి చప్పున ఉలిక్కిపడుతూ అతడిని కంగారుగా చూశాను. తను బాగా గాఢని ద్రలో వున్నాడు.

'నిద్రలో వున్నావా? దొంగా!' అతడ్ని చిలి పిగా చూస్తూ నాలో నేనే ముసిముసిగా నవ్వుకుంటూ అనుకుని, అతడి చేయిని నెమ్మ దిగా నా మీదినుండి తీశాను. తర్వాత అక్క డ్నుంచి వెళ్ళిపోయే ప్రయత్నం చేశాను. అంతలోనే "దాహంగా వుంది. నీళ్లు కావాలి" కలవరింతగా అన్నాడు అతడు.

"తెస్తాను బాబుగారూ" అంటూనే పరు

గున ఫ్రిజ్ వద్దకు వెళ్ళి నీళ్లసీసా తీసుకుని వచ్చేసరికి అతడు మంచంమీద లేచి కూర్చుని వున్నాడు. అయితే అతడి తీరు సహజంగా లేదు. మద్యం మత్తు, నిద్ర మత్తు, రెండూ కలగలసి అతడిని అదో మైకంగా చూపెడుతున్నాయి. ఆ స్థితిలో అతడు తలను ఒక పక్కగా వాల్చి కూర్చుని వున్నాడు.

"బాబుగారూ" అంటూ నీళ్ళసీసాను అతడికి అందివ్వబోయాను.

"ఆ..." తాపమన్నట్టుగా తలను చిన్నగా కదిల్చాడు అతడు.

'ఏమో అనుకున్నాను. బాగా తాగి లోకం మరిచినట్టున్నాడు' నాలో నేనే అనుకుంటూ, జాగ్రత్తగా నీళ్లు తాపే ప్రయత్నం చేశాను. ఈ ప్రయత్నంలో భాగంగా అతడిమీదకు దాదాపుగా వంగివున్నాను నేను. ఆ సమయంలో అతడు మరో అనూహ్యపరిణామాన్ని సృష్టిస్తూ నా చేయిని చప్పున బిగ్గరగా పట్టుకుని "సీతా! ఐలవ్ యూ..." తమకంగా అన్నాడు.

"బాబుగారూ..." ఒక్కసారిగా కలవరపడిపోయాను నేను.

"బాబుగారూ అంటావేం సీతా?" అతడిలో అదే తమకం.

"నేను సీతను కాదు, బాబుగారూ వసుంధరని" అతడిని తప్పించుకోబోయాను.

"నో సీతా! నేను నిన్ను వదలను. నీవు నాక్కావాలి" అతడు నన్ను మరింత బిగ్గరగా పట్టుకున్నాడు.

ఆ హఠాత్పరిణామం నాలో భయాందోళనల్ని అంతెత్తున కలిగిస్తూ నాలో ముచ్చెటమల్ని పట్టిస్తుంటే "అయ్యో బాబుగారూ! నేను వసుంధరని. నన్ను వదిలిపెట్టండి" దాదాపుగా ఏడ్చినట్లుగా అన్నాను.

"నో! నీవు వసుంధర కాదు. ఆమె మా ఇంట్లో పనిమనిషి. నీవు నా కావాల్సిన మనిషివి. నీ నుండి నాకు సుఖం కావాలి. కాదనొద్దు ప్లీజ్! ఇదిగో... కావాల్సిస్తే ఈ ఉంగరాలు, బ్రాస్‌లెట్, చైను, ఇంకా కావల్సిస్తే డబ్బు ఎంతయినా తీసుకో! నన్ను మాత్రం నిరాశపరుచొద్దు" అంటూనే ఒక్కసారిగా తనమీదకు నన్ను బలంగా లాక్కున్నాడు.

"వద్దు... వదలండి..." అతడిని విడిపించుకునే ప్రయత్నం గట్టిగా చేశాను.

"నో..." అతడు కామోద్రేకపు రాక్షసత్వంతో నన్ను తన బలమైన కౌగిట్లో బంధించి, నన్ను అసహాయురాలిగా చేసేందుకు యత్నించసాగాడు.

"బాబుగారూ! నన్ను వదలండి... మీ కాళ్లు పట్టుకుంటాను" నేను ఏడుస్తూ గింజుకోసాగాను.

"వద్దు సీతా! కాదనొద్దు! నీకు ఏం కావల్సొస్తే అది ఇస్తాను. ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను. నీవు ఒప్పుకుంటే నా పర్మనెంటు సెటప్‌గా వుంచుకుంటాను. ఈ విషయాన్ని ఎవ్వరికీ చెప్పను కూడా! ప్లీజ్ ట్రైటూ అండర్‌స్టాండ్‌మీ" ఆరాటంకొద్దీ అతడు నా పెదిమల్ని తన పెదవుల్తో అందుకోబోయాడు.

నాకు పెదబాబు అంటే వల్లమాలిన ప్రేమ! ఈ ప్రేమను పవిత్రంగా అతడికి అర్పించాలనేదే నా అభిమతం తప్ప, ఎలాగైతేనేం దొరికిన అవకాశాన్ని ఉపయోగించుకోవాలి అనేది నా మనస్తత్వం కాదు?

ఎటూ తెలియని స్థితిలో నా శరీరంలోని సత్తువనంతా ఒక్కసారిగా అతి ప్రయాసగా ఉపయోగించుకుంటూ, అతడిని ఒకవైపు దూరంగా నెట్టేస్తూనే... మరోవైపు నా ముఖాన్ని పక్కకు జరుపుకున్నాను. నేను ప్రయోగించిన బలం ఏ పాటిదో నేను అంచనా వేసుకోలేనుగాని, నేను తోసిన తోపు అతడి పట్టును సడలించింది. ఫలితంగా నేను అతడ్ని తప్పించుకుంటూ, మంచం దిగి, పరుగున అక్కడ్నుంచి బయటపడ్డాను. అప్పటికి నా ఒంటిపై చీరలేదు. జుట్టు మొత్తంగా చెదిరిపోయివుంది. ఎవ

రైనా చూస్తే ఏదో జరిగిపోయిందన్న నమ్మకం బలపడేలా అక్కడక్కడా శరీరం కూడా గీసుకుపోయి వుంది.

"భగవంతుడా నన్ను కాపాడు తండ్రీ" పూర్తిగా ఆరుబయటకు వచ్చేశాక గుండెలపై చేయివేసుకుని బిక్కుబిక్కుమంటూ వెనక్కి చూస్తూ అనుకున్నాను.

★ ★ ★

ఉదయాన్నే యధావిధిగా పనిలోకి వెళ్లాను. అప్పటికే నిద్రలేచిన పెదబాబు వ్యాయామం చేస్తున్నాడు. తనని చూడగానే నాలో ఒకవిధమైన ఇబ్బందిలాంటిది కలిగింది. కాని తనకు మాత్రం రాత్రి సంఘటన గురించి ఇసుమంత కూడా గుర్తులేనట్టుగా వుంది. కాబట్టే ఎటువంటి తడబాటు లేకుండా ఎప్పట్లా వ్యాయామం చేస్తూపోతున్నాడు.

"గుర్తుండకపోవడమే మంచిది" మనసులోనే అనుకుంటూ వంటింటివైపు సాగిపోయాను. వంటింట్లోకి వెళ్ళగానే రాత్రి విషయం గురించి మర్చిపోయి నావైన పనుల్ని ఎప్పట్లా చేసుకోసాగాను.

★ ★ ★

మరుసటిరోజు మధ్యాహ్నం మల్లేశం వచ్చేశాడు. అతడితో నేను జరిగిన విషయం గురించి చూచాయగా కూడా మాట్లాడలేదు. అతడితో జీవితాన్ని పంచుకోవడమే ఇష్టంలేదు. ఇక ఇవన్నీ ఎందుకు మాట్లాడ్తాను? ఇదంతా ఏమోలే గాని, ఇక అదేరోజు సాయంకాలం పూలకుండీల్లోకి నీళ్లు పడుతున్న నా వద్దకు అనూహ్యంగా వచ్చాడు పెదబాబు.

"నీవూ మల్లేశం దగ్గర్లో వున్న యాదగిరి గుట్టకు వెళ్ళిరండమ్మా!" రాగానే చెప్పాడు.

"ఎందుకూ? " మనసులోనే అనుకుని, పైకి మాత్రం "సరే బాబుగారూ" అని తలాడించాను.

అంతలో అటుగా మల్లేశం వచ్చాడు. "ఏరా మల్లీ! ఇట్రారా!" అతడ్ని చూడగానే తనదైన దర్పంతో పిలిచాడు పెదబాబు.

"బాబుగారూ" సమీపంగా వచ్చాడు మల్లేశం.

అంతలో పెదబాబు స్నేహితురాలు రావడంతో, అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు పెదబాబు.

"బాబుగారు ఏందో అంటున్నారు" తన సందేహాన్ని నివృత్తి చేసుకునే ప్రయత్నం చేస్తూ నావైపు సూటిగా చూశాడు మల్లేశం.

సమాధానం చెప్పేందుకు నాకు చిర్రెత్తుకొచ్చింది. కాబట్టే చెప్పాల్సిన సమాధానాన్ని పెడసరంగా చెప్పాను.

"ఎందుకు వసుంధరా? నేనంటే అంత అసహ్యించుకుంటావు? నేనూ మనిషినే, నాకూ మనసుంటుంది" తనదైన ధోరణిలోనే అయినప్పటికీ నన్ను గురిచూసి కొట్టినట్టుగా అన్నాడు.

"నీకు మనసు వుంది అని నాకూ తెల్సు. మరి నాక్కూడా ఓ మనసుంటుందని నీకు తెలుసా? " వ్యంగ్యంగా అడిగాను.

"అర్థంచేసుకుని సర్దుకుపోతే ఇద్దరి మనసులు బాగుంటాయి" వేదాంతం మాట్లాడాడు.

"నీతో ఈ జన్మకు సర్దుకోలేను" మనసులోనే అనుకుని, పైకి మాత్రం అతడివైపు ఒకమారు బేఖాతరుగా చూసి, అక్కడ్నుంచి వెళ్ళిపోయాను.

ఆ తర్వాత అనూహ్యంగా నాలో నేనే మల్లేశం గురించి లోతుగా ఆలోచించాను. ఏంటంటే... తప్పనిస్థితిలో అతడి జీవితంలోకి ప్రవేశించాను. అన్నీ తెలిసే అతడు నన్ను తన జీవిత భాగస్వామిగా ఒప్పుకున్నాడు. ఈ ఒప్పుకోవడం బానిసత్వపు అసహాయత కావొచ్చు లేదా అర్థంచేసుకునే స్వచ్ఛమైన మనస్తత్వం కావొచ్చు అతడి తీరునుబట్టి మాత్రం అతడిది స్వచ్ఛందనమే అని నిస్సంకోచంగా చెప్పవచ్చు మరి అలాంటి నిర్మలత్వపు మనసుని నా కరుకుతనంతో బాధపెట్టడం, దూరంగా వుంచడం

ఎంత వరకు సమంజసం? నా ప్రవర్తనలో తప్పు వుందో వేదనవుందో నాకు తెలియదు కాని, అతడితో నేను జాలిపడి కూడా మనసు చంపుకుని కూడా రాజీపడి కాపురం చేయలేను. ఈ విషయమై ఆ కాలం నన్ను శిక్షించినా సరే, తెలిసి ఈ సమాజం నన్ను దూషించినా సరే! ముఖ్యంగా అతడి మంచితనాన్ని అర్థంచేసుకుని, అతడి మనసు నొప్పించకుండా, ప్రవర్తించగలనేమో గాని, అతడి భార్యగా ఈ సమాజానికి మాత్రం నన్ను నేను పరిచయం చేసుకోలేను కూడా!

"అమ్మా వసుంధరా" నా ఆలోచనని చెరిపివేస్తూ అంతలో పెదబాబు గొంతు వినిపించింది.

"బాబుగారూ" మొక్కల కుండీల్లో మట్టిని వదులు చేస్తున్నదాన్నల్లా ఒక్కసారిగా తేరుకుంటూ పలికాను.

"నేను నా ఫ్రెండ్స్‌తో కలిసి బయటకు వెళ్తున్నాను. రాత్రికి వస్తే రావొచ్చు లేకపోతే లేదు. ఓకే" చెప్పి ఆ వెంటనే అక్కడ్నుండి వెళ్ళిపోయాడు తను.

"నాకే పనికట్టుకుని చెప్తున్నాడు. అక్కడే మల్లేశం వున్నాడు చెప్పొచ్చు కదా? " వెళ్తున్న పెదబాబునే చూస్తూ మనసులో అనుకున్నాను. అదే సమయంలో నా మునుపటి ప్రయత్నం తాలూకు ఆలోచన నన్ను మెల్లిగా కుదిపింది. కాగా ఆ విషయమై నేను ఏమాత్రం వెనకడుగు వేయలేదు. పెదబాబు అధముడిగా అర్థమైన తర్వాత కూడా నేను ఆశపడటం అతి సహజంగా జరుగుతోంది. అందుకే నాలో నేనే చిన్నగా నవ్వుకుంటూ "పెదబాబూ! నీవు మూర్ఖుడిగా నమ్మకద్రోహిగా తెల్సివచ్చిన తర్వాత కూడా నీలో మనిషిని, అవసరమైతే మహాపురుషుడిని, చూడాలనుకుంటున్నాను. ఆ దేవుడు నీ మనసును మార్చి నాకు సహకరించాలి" అనుకుంటూనే తిరిగి నాదైన పనిలో మునిగిపోయాను.

మరుసటిరోజు ఉదయం తొమ్మిదిగంటలకల్లా పెదబాబు వచ్చేశాడు. రాగానే వచ్చిన టెలిఫోన్లకోసం నోట్ బుక్ తెరిచి చూడసాగాడు. అదే సమయంగా నేను వెళ్ళి "బాబుగారూ! రాత్రి ఆ అమ్మాయి ఫోన్ చేసింది" చెప్పాను.

"అవునా? " ఆశ్చర్యంగా అని "నీవు వున్నప్పుడే ఫోన్ చేయాలని ఆ అమ్మాయి కంకణం కట్టుకుందా ఏమిటి? " చిన్నగా నవ్వి "ఏం మాట్లాడింది? " ఆసక్తిగా అడిగాను.

"పుట్టగానే పువ్వు ఎందుకు పరిమళిస్తుంది? పుట్టగానే బిడ్డ ఎందుకు ఏడుస్తాడు? అని ప్రశ్నించుకుంటే 'ప్రేమతత్వం' ' అందుకు సమాధానం అని చెప్పవచ్చు ఈ ప్రేమతత్వం కారణంగానే పెళ్ళి అనగానే యువతీయువకుల మధ్య ఒక బంధం ఆరంభమౌతుంది. కాని పెళ్ళి వున్నచోట "ఇష్టం" లేనప్పుడు, ఏర్పడిన ఆ బంధానికి అర్థం వుండదు. అప్పుడు ఆ జీవితాలు పరిమళించని పువ్వుల్లాంటివి, ఏడ్వని బిడ్డలాంటివి! మరి ఇలాంటప్పుడు మనసున్న ఒక మనిషిగా మీరు ఆ జీవితాలకు ఇచ్చే సమాధానం ఏమిటి? " నాదైన ప్రశ్నని ఉపోద్ఘాతంలేకుండా సూటిగా అడిగేసి "అని ఆ అమ్మాయి మిమల్ని అడగమంది" చెప్పాను.

అందుకు అతడు కొన్ని క్షణాలవరకు నావైపు చిత్రంగా చూసి "ఇంతకూ ఆమె ఎవరు? ఆమె ఉద్దేశ్యం ఏమిటి? " అడిగాడు.

"ఏమో బాబుగారూ! ఈ మాత్రమే నాతో మాట్లాడింది" చెప్పాను.

"ఓకే! ఈమారు గనుక మళ్ళీ తను ఫోన్ చేస్తే, నీవు ఎదురుగా వస్తేనే తప్ప సమాధానం చెప్పడని చెప్పు" చెప్పాడు తను.

నేను సరే అన్నట్టుగా తలాడించి అక్కడ్నుంచి వెళ్ళిపోయాను. వెళ్లాక ఆ విషయమై బాగా ఆలోచించాను. పెదబాబుపై ఆశపడటం నిజంగా వ్యర్థమేనేమో తెలివి తక్కువగా ప్రవర్తిస్తూ తెలివిగా ప్రవర్తిస్తు

న్నానని భ్రమ పడుతున్నానేమో, పెళ్ళికి ముందు నాపై వచ్చిన అపవాదుల సంగతి ఏంటోగాని... నా ప్రయత్నం గురించి గనుక బయట పడితే తేరుకోలేని బాధల్ని ఎదుర్కోవాల్సి వస్తుందేమోనని, నా మనసు నన్ను మళ్ళీమళ్ళీ హెచ్చరించింది. అది పాత హెచ్చరికనే కాబట్టి అందుగురించి నేను లోతుగా వెళ్ళలేదు. అంతా దేవుడున్నాడు అని అతి సహజంగా అనుకుంటూ నా పనిలో నేను మునిగిపోయాను.

★ ★ ★

నేను, మల్లేశం యాదగిరి నరసింహస్వామిని దర్శించుకుని తిరిగివచ్చాము. అప్పటికి బాగా చీకటయ్యింది. తోడుగా ప్రయాణంలో అలసినట్టయ్యింది. అందుకే రాగానే పడుకుందాం అనుకున్నాను. కాని పెదబాబు ఆ మాటా ఈ మాటా మాట్లాడేసరికి పడుకోడానికి కాసింత ఆలస్యమైంది. దీంతో పడుకునేసరికి ఒళ్లు తెలీకుండా నిద్ర పట్టేసింది. మరుసటిరోజు ఎప్పటిలా పనిలోకి వెళ్లాను.

వూరి నుండి అమ్మగారు దొరబాబు, ముంబాయి నుండి చినబాబులు ఇద్దరూ, ఆరోజు రాత్రికల్లా రాబోతున్నారని టెలిఫోన్ సమాచారం రావడంతో నా పనిలో హడావిడి ఎక్కువయింది. దొరబాబు చినబాబుల గురించి కాదుకాని ముఖ్యంగా అమ్మగారు వస్తున్నారు కాబట్టి, ఏ మాత్రం అశుభ్రంగా వున్నా కోప్పడతారని ఇల్లంతా దులిపి సర్ది పెట్టి కడిగేసరికి నిన్నటి ప్రయాణానికిమల్లే బాగా అలసట వచ్చింది. ఈ పనుల్లో మల్లేశం భాగం పంచుకున్నప్పటికీ అలసట రావడం ఒక ఎత్తయితే, వచ్చేవారి కోసం రాత్రి పదకొండు గంటలు దాటేవరకు వేచి చూడటం మరో ఎత్తయ్యింది. అప్పటికి రావల్సిన అందరూ వచ్చేశారు. వాళ్ళ అవసరాలు అన్నీ చూసి పడుకునేసరికి పన్నెండు దాటింది. అయినప్పటికీ ఆలస్యం లేకుండా ఎప్పటిలా ఉదయాన్నే మల్లేశంతో పాటుగా నిద్రలేచి పనిలోకి వెళ్ళాను.

చూస్తుండగానే మధ్యాహ్నం కావొచ్చింది. కాలక్షేపంగా అందరూ టీవీముందు కూర్చున్నారు. ఆరోజు ఆదివారం, పైగా దొరబాబు దంపతులు వచ్చారు. కాబట్టే ఇంట్లో వాతావరణం ఇన్నాళ్లకి విభిన్నంగా వుంది. ఈ విషయాన్ని నేను మాత్రమే అనుకోవడంకాదు, టీవీ చూస్తూ పెదబాబు కూడా అన్నాడు.

"మమ్మీ! మిగతారోజులు వూర్లో వుండండిలే గాని, సండేస్ మాత్రం ఇక్కడికి వచ్చేయండి"

"ఆదివారాలు నీ దగ్గరకి వస్తాం సరే, మరి వచ్చేనెలనుండి తమ్ముళ్లు ముంబాయిలోనే వుండిపోతున్నారు. వాళ్ల దగ్గరకి ఎప్పుడు వెళ్ళాలి? " ప్రేమగా కొడుకువైపు చూసింది అమ్మగారు.

"అడపా దడపా" తాపీగా అన్నాడు పెదబాబు.

"దొంగా!" మురిపెంగా అని 'మీరు ముగ్గురూ ఎవరికి వాళ్లు జీవితంలో సెటిలయ్యాక, ఒక్కొక్కరి దగ్గర ఒక్కో నెల తిరిగ్గా స్పెండ్‌చేస్తాన్రా! ఇప్పుడు మాత్రం ఇలా ఎప్పుడో ఒకసారి తప్పిస్తే కంటిన్యూగా రావడం కుదరదు. నాకు కుదిరినా మీ డాడీ పనులు నాకు కుదరనివ్వవు కదా? " అంది అమ్మగారు.

"సర్లేగాని మమ్మీ! మెస్‌భోజనం అస్సలు బాగుండదు కాబట్టి, తమ్ముళ్లకోసం ఒక ఫ్లాట్ తీసుకుంటేనే బాగుంటుంది. ఫ్రీగా వుండొచ్చు" అన్నాడు పెదబాబు.

"మీ డాడీ ఎమంటారో మరి? " దొరబాబువైపు చూసింది అమ్మగారు.

"నేనూ అదే అనుకుంటున్నాను. చిన్నప్పటినుండి పిల్లలు హాస్టల్లో వుండలేదు. ఇప్పుడు ఎలా వుండగలుగుతారు? " అన్నాడు దొరబాబు.

"అయితే పనివాడ్ని కూడా మాట్లాడాలి. ఇందుకు పేపర్ యాడ్ ఇవ్వడం, వచ్చిన వాడు ఎలాంటివాడో తెలీకపోవడం, అంతా

ఒక ఇబ్బంది. సో తెల్సినవాడ్నే పనిలో పెట్టుకోవడం బెటర్" అని పెదబాబు అంటుంటేనే "మన వూర్లోనే ఒకడ్ని చూడాలి" అందుకున్నాడు దొరబాబు.

"వద్దు డాడీ! ఆ వచ్చేవాడు పాత వాడే అయినా మన అలవాట్లకు కొత్తవాడే అవుతాడు. కాబట్టి మన మల్లేశాన్నే ముంబాయి పంపిద్దాం" సూచన అందించాడు పెదబాబు.

అతడు ఉద్దేశ్యపూర్వకంగానే సందర్భం తీసుకువచ్చి చివరకు అనుకున్నది చెప్పేశాడని చెప్పకనే అర్థమైంది నాకు. అందుకే మల్లేశాన్ని అతడు సూచించగానే, కుప్పగా పోసుకున్న కూరగాయల్ని వేటికవే వేరుగా పాలిథీన్ కవర్లలో సర్దిపెడుతున్న నేను... మెల్లగా అతడి ముఖంలోకి చూశాను.

"ఆ... కరక్ట" కొడుకు మాటను సమర్థించింది అమ్మగారు.

"కొత్తగా పెళ్లయిన వాళ్లు. మనం విడదీయడం ఎందుకు? " నా వెనుకగా కూర్చుని మార్కెట్ నుండి తెచ్చిన ఇతర సరుకుల్ని సర్దుతున్న మల్లేశాన్ని, నన్నూ ఒకమారు చూసి అన్నాడు దొరబాబు.

"ఆ... ఏమౌతుందిలే డాడీ? దూరంగా వుంటేనే ప్రేమలు పెరుగుతాయి" సులువుగా అనేశాడు పెదబాబు.

"అయినా... ఎప్పటికీ మల్లేశం అక్కడే వుండిపోవాల్సిన అవసరం లేదులే! మంచివాడు, నమ్మకమైవాడు పనితెల్సినవాడు, దొరికినంతవరకే వుండిపోవల్సి వస్తుంది అంతేకదా!" కొడుక్కి దరువేసింది అమ్మగారు.

"ఏమ్మా? సమ్మతమేనా? " ఆ వెంటనే నావైపు చూశాడు దొరబాబు.

"భలేవారే, సమ్మతం కాకుండా మరేంటీ? " భర్తతో అని "ఏమే వసుంధరా? " నా వైపు చూసింది అమ్మగారు. నా నుండి సమాధానం రాకమునుపే అలా అమ్మగారు కల్పించుకున్నారు కాని, ఒకవేళ కల్పించుకోకపోయినా నానుండి అనంగీకార సమాధానం రావడం అనేది ఎట్టి పరిస్థితిలోను కుదరదు. ఎందుకంటే మల్లేశం నాకు దూరంగా వెళ్ళిపోవడాన్నే నేను కోరుకుంటాను. కాబట్టే "అబ్బాయిగార్లు కొత్త ప్రాంతానికి వెళ్తున్నారు. ఇలాంటప్పుడు తోడుగా వుండేవాళ్లు కూడా కొత్తవాళ్లయితే బాగుండదు. మల్లేశం వెళ్లడమే బాగుంటుంది. వెళ్ళడం మల్లేశానికి ఇష్టం లేకపోతే నేనయినా వెళ్తాను" చెప్పాను.

"వెరీగుడ్" నిండుగా అంది అమ్మగారు.

"అమ్మాయివి కదా! నీవు వెళ్లడం ఎందుకులే? " నేను ఎక్కడ వెళ్తానో అన్నట్టుగా ఆ తక్షణమే చప్పున అందుకున్నాడు పెదబాబు.

అందుకు నేను ఏమీ అనలేదు. నా తరపున కూడా ఎవ్వరూ ఏమీ అనలేదు. "ఇదంతా వుండనీగాని, ఇంతకూ మీ చదువులు ఎలా వున్నాయిరా? " ముగ్గురు కొడుక్కుల్ని ఉద్దేశిస్తూ సందర్భం మార్చేశాడు దొరబాబు.

వాళ్ల మాటలు వాళ్లు ఒకవైపు మాట్లాడం మొదలెట్టగానే, నా ఆలోచనలు నాకై నేను మరోవైపు తర్జనభర్జనలు పడుతున్నాను.

'నేను ఒక్కతినే వుండటం అనేది పెదబాబు స్వభావం రీత్యా వీలైనంత వరకు మంచిది కాదు. అలాగే నేను అనుకున్నది గెలవడంకోసం అలాంటి ఏకాంతం ఒకందుకు ఆసరా అవుతుంది అన్పిస్తుంది. మొత్తానికి పెదబాబు దుర్మార్గుడయినా దొరబాబు మంచివాడు కాబట్టి నన్ను నేను ఎలాగైనా కాపాడుకోవచ్చు ఆ తర్వాత అనుకున్నది సాధించవచ్చు

చూస్తుండగానే సమయం రాత్రి తొమ్మిది గంటలకు వచ్చేసింది. అప్పటికి దొరబాబు గారి ఇంట్లో నా పనంతా పూర్తిచేసుకుని, మాకు కేటాయించిన గదిలో ఒక పక్కగా కూర్చుని, ఆరోజు ఉతుక్కున్న దుస్తుల్ని శుభ్రంగా మడతపెట్టుకోసాగాను. అంతలో పిల్లి ఒకటి ఆ గదిలోకి వచ్చింది.

"ఏయ్...ఛత్..." దుస్తుల్ని మడతబెట్టుకుంటూనే దాన్ని వెళ్లగొట్టాను. నా అదిలింపుకు అది వెంటిలేటర్‌లోకి ఎగిరి, అక్కడ్నుంచి బయటకు వెళ్లే ప్రయత్నం చేసింది. కాని అక్కడ పాతడబ్బాలు అడ్డంగా ఉండటంవల్ల తిరిగి కిందికి దుమికి గుమ్మంలోంచే బయటకు వెళ్ళింది. అయితే అది వెంటిలేటర్‌మీదకు ఎగిరి, తిరిగి కిందికి దుమికేటప్పుడు, వెంటిలేటర్‌లోంచి ఒక డబ్బా కూడా కిందికి జారి పడింది. అప్పుడు నాకు వెంటిలేటర్‌లోంచి గదిలోకి తీసి వున్న నల్లని వైరులాంటిది ఒకటి కనిపించింది.

ఇంట్లో చిన్న టీవీ ఒకటి వున్నప్పటికీ దానికి సంబంధించిన వైరు గుమ్మానికి కాసింత పైన వున్న గొట్టం మార్గంలోంచి లోపలికి వచ్చింది. మరి ఈ వెంటిలేటర్‌లోంచి వచ్చిన వైరు ఏమిటి? నాలో నేనే ప్రశ్నించుకుంటూ వెళ్ళి స్టూలు వేసుకుని, దానిపైకి ఎక్కి, అక్కడ వెంటిలేటర్‌లో వున్న వైరు సంగతి గమనించాను. అది చాలా దూరం నుండి వచ్చినట్లుగా అర్థమౌతూ, వైరు లోపలి చివర చిన్న వుండలాంటిది ఒకటి వుండి, అది ఒక కాడ సహాయంతో వెంటిలేటర్‌పై చివరివరకు సాగి వుండి, అట్నుంచి కొద్దిగా ముందుకు సాగినట్లుగా వుండి డబ్బాలమధ్య ఉంచబడింది.

"ఏంటిది? " నాకేం అర్థంకాలేదు. అయినప్పటికీ దాన్ని అలాగే ఉంచేయకుండా అటూ ఇటూ కదిపి చూశాను. ఇలా చూస్తున్నప్పుడే పైనుండి బల్లి ఒకటి నామీద పడటం, నేను ఆవైరును అలాగే పట్టుకుని స్టూలుమీదనుండి కిందపడిపోవడం, ఫలితంగా నా మోచేతులు రాసుకుపోవడం మాటేమిటోగాని, నా చేతిలో చిక్కిన వైరు తాలూకు కాడకు సంబంధించిన ఫిట్టింగ్ వదులైపోయింది. పైగా చాలావైరు కిందికి లాగబడినట్టయ్యింది కూడా!

"అమ్మో! పెదబాబు ఏమైనా అవసరమై ఈవైరు పెట్టాడేమో!" మనసులోనే భయంగా అనుకుంటూ లేచి, నాతోపాటుగా కిందపడిపోయిన స్టూల్‌ని ఎప్పట్లా వేస్కుని ఎక్కి, జాగ్రత్తగా వైరును సరిచేసిపెట్టాను. కాని వదులైన కాడ ఎప్పట్లా బిగించడం మాత్రం నాకు తెలీలేదు. అందుకే దాన్ని మాత్రం అలాగే వదులుగా వుంచేసి, కిందికి దిగి, తిరిగి బట్టల్ని మడతపెట్టుకోసాగాను. అంతలో మల్లేశం వస్తూ "వసుంధరా! వూరి నుండి మీ అమ్మావాళ్లు ఫోను చేశారు" చెప్పాడు.

"అమ్మావాళ్లు ఫోన్ చేశారా? " ఆనందంగా హడావిడి పడుతూ చప్పున లేచి పరిగెట్టినట్టుగా వెళ్లాను.

ఫోన్‌లో అమ్మ, నాన్న, చెల్లెళ్లు, అందరూ మాట్లాడారు. 'నన్ను చూడాలనివుంది' అని చెప్పారు. పెళ్ళయి ఇక్కడికి వచ్చింది మొదలు అమ్మా వాళ్ల ముఖం చూడలేదు కాబట్టి, నాక్కూడా అమ్మావాళ్లు అందరినీ చూడాలనిపించింది. కానీ వూరికి మాత్రం ఇప్పుడు వెళ్ళాలనిపించట్లేదు. అనిపించినా ఇప్పుడు కుదరదు కూడా! ఏ క్షణం ఎలా వుంటుందో? ఏ క్షణంలో నేను పెదబాబు మనసును స్పందింపజేస్తానో అనేది ఒక అంతర్యుద్ధంలా కొనసాగుతోంది కాబట్టి, వూరికి వద్దనుకుంటున్నాను తప్ప పట్నపు గాలిసోకిన తరువాత పల్లె సొగసులు వెగటుపుట్టి మాత్రం కాదు. సంతోషం దొరికితే అరణ్యం కూడా బాగుంటుంది నాకు. ఇది ఏమైనా నా తర్వాత మల్లేశం మాట్లాడాడు. తర్వాత మళ్ళీ నేను మాట్లాడాను. ఆ తర్వాత మరో పదినిముషాలకు అమ్మావాళ్లు ఫోన్ పెట్టేశారు. వాళ్ళు మాట్లాడిన మాటల్ని మనసులో మననం చేసుకుంటూ, అక్కడే దొరబాబు వాళ్ళముందు కాసేపు కూర్చుని, ఆ తర్వాత వెలుపలికి రాబోయాను.

"వసుంధరా! ట్యాంకు కడిగి ఎన్నిరోజులయ్యింది? " అంతలో అడిగింది అమ్మగారు.

"ఎప్పటిది అప్పుడు కడిగేస్తాను అమ్మ

గారూ" చెప్పాను.

"ఏమో మరి? ఇందాకైతే చెత్త వచ్చింది. కాబట్టి వెళ్ళి కడిగిరా! ఎలాగూ నీళ్లు అయిపోయాయి కదా. కడగడం తొందరగానే పూర్తవుతుంది" చెప్పి "ఏరా మల్లీ! నువ్వెళ్ళి ఓ మూడు జొన్నరొట్టెలు చేసి ఇవ్వు! తినక చాలా రోజులయ్యింది కాబట్టి తినాలనిపిస్తోంది" మల్లేశాన్ని ఆదేశించింది అమ్మగారు.

"వేళాపాళాలేదు" మనసులోనే అమ్మగారిని తిట్టుకుంటూ, మధ్య హాల్లో వున్న మెట్లద్వారా మిద్దెమీదకి వెళ్లేందుకు అక్కడ్నుండి ముందుకు నడిచాను.

"డోంట్ వేస్ట్‌టైమ్! అంతా కేర్‌ఫుల్‌గా సాగిపోవాలి. ఇక్కడ నేను అడ్వాన్స్‌డ్‌గా వున్నాను. నేను అనుకున్నది తప్పకుండా సక్సెస్ అవుతుంది. నేను నీకు చెప్పానే...మా పనిమనుషులనే క్యూట్ కపుల్... ఆ ఇద్దర్నీ యాదగిరికి పంపించి, వాళ్ళ గదిలో ఇంపోర్టెడ్ కెమేరా ఒకటి అమర్చిపెట్టాను. 'స్మాల్ ప్లేస్ -బిగ్‌షో' దట్ కెమేరా స్పెషల్ కాబట్టి, అంతా క్లియర్‌గా వుంటుంది. అక్కడ గదిలో జరిగే సీన్స్‌ని నా గదిలో టీవీలో లైవ్ రిలేలా చూడవచ్చుకూడా! కంపల్సరీ సక్సెస్ అవుతాను. ఓకే! మళ్ళీ త్రీ ఫోర్ డేస్ తర్వాత ఫోన్‌చేసి ఏ విషయం చెప్తాను..." రహస్యంగా మాట్లాడ్తూపోతున్న పెదబాబు గొంతు అనూహ్యంగా నా చెవిన పడింది.

మొదటి రెండు మాటలకే ఒకపక్కగా ఆగిపోయివున్న నేను, తను ఇంకేం మాట్లాడుతాడో అన్నట్టుగా చెవులు రిక్కించాను. అప్పటికి నా ఒళ్లంతా చెమటలు పట్టాయి అనుకుంటే పొరపాటు. మల్లేశంతో నా ఎడబాటు అతడికి తెలియాలి కాబట్టి, అతడి పన్నాగం ద్వారానే, నా పరిస్థితిని విన్నవించుకోవాలనే తలంపు క్షణాల్లో కలిగింది కాబట్టి, స్థిరంగా నిలబడి వున్నాను. కాపోతే అతడి నీచత్వాన్ని ఒకవైపు తిట్టుకుంటూనే వున్నాను.

"ఓకే బై... సీయూ అగైన్" పెదబాబు అంటుంటేనే నేను నెమ్మదిగా అక్కడ్నుంచి పక్కకు తప్పుకుని, అతడు మిద్దె దిగి కిందికి వెళ్ళిపోయాక నాదైన పనిని పూర్తి చేసుకోవడం కోసం నేను మిద్దె మీదకు వెళ్ళాను.

★ ★ ★

రాత్రి పదిన్నర కావొచ్చింది. ఎప్పటిలా నా పరుపును మల్లేశానికి దూరంగా వేసుకుని మరెప్పటిలా మౌనంగా పడుకోలేదు. నామౌనం పెదబాబుకు 'ఆ మూడురోజులు' అనే అనుమానాన్ని కలిగించవచ్చు కాబట్టి ఎలాగైనా సరే ఇప్పుడు సంభాషణ సాగించి తీరాల్సిందే అని సందర్భాన్ని వెదుక్కోసాగాను.

"వసుంధరా! మనం ఇక ఈ జన్మకు భార్యాభర్తలుగా కలిసి జీవించలేమా?" అనూహ్యంగానే తనే కల్పించుకున్నాడు మల్లేశం.

'హమ్మయ్య! ఆ దేవుడు మాట్లాడిచ్చినట్లుగా సరైన మాట మాట్లాడాడు' మనసులో అనుకున్నాను.

"ఎప్పటికీ జీవించలేము. ఎందుకో తెలుసా?... కట్టుబాట్లు సంప్రదాయాలు మనల్ని భార్యాభర్తల్ని చేశాయే తప్ప, అందుకు నా మనసు ఒప్పుకోవడంలేదు. ఈ విషయాన్ని మీకు ఎన్నోసార్లు చెప్పాను. ఇప్పుడు కూడా చెప్తున్నాను. దయచేసి ఇంకెప్పుడూ నన్ను భార్య అనే దృష్టితో చూడవద్దు. భర్తగా నేను నిన్ను అంగీకరించనప్పుడు, భార్యగా నీవు నన్ను భావించడంలో అర్థం వుండదు. అసలు పెళ్లయ్యింది మొదలు ఏరోజూ మనం ఒకటికాలేదు. ఇక కావడం జరగదు కూడా" కావాలని ఆవేశంగా నా ఇష్టం వచ్చినట్టుగా

# ఏరిన ముత్యాలు

✤ జీవించినవారిని గురించిన ఆలోచనలతో బాధపడేవారు నిజంగా మరణించిన వారవుతారు.

-లాంగ్‌ఫెలో

✤ ఒక అమాయకుడు బాధపడడం కంటే పదిమంది దోషులు తప్పించుకోవడమే మంచిది.

-సర్ విలియం బ్రేక్‌స్టోన్

✤ చీకటిని నిందించడంకంటే ఒక చిన్న కొవ్వొత్తిని వెలిగించడమే మంచిది.

-డా॥ వెల్తీఫిషర్

✤ ఆటలలోని నియమాలను పాటించకుండా ఆడడంకంటే ఆట ఓడిపోవడమే మంచిది.

✤ ప్రయత్నం చేయని పెద్దపనులను గురించి కలలు కనడం కంటే చిన్న పనులను సక్రమంగా చేయడమే మంచిది.

-నెపోలియన్

✤ పనికిరాని పదిమంది స్నేహితులకంటే పనికొచ్చే విలువైన స్నేహితుడిని కలిగి వుండడమే మంచిది.

-అనార్‌చార్‌సిస్

✤ సర్వాన్నీ పూజ్యభావంతో చూసేవారే పూజ్యులు.

-అమ్మ

✤ ప్రజాస్వామ్యాన్ని గురించి తెలుసుకోవాలంటే బస్సులలో ఎక్కువ సమయాన్ని గడపండి.

-లారెన్స్ సి. కఫ్‌లిన్

✤ లాభాలను సంపాదించడం పాపం అన్నది సోషలిస్టుల అభిప్రాయం. నన్నడిగితే
నష్టాన్ని పొందటమే నిజమైన పాపం.

-విన్‌స్టన్ చర్చిల్

✤ మంచి ఆరోగ్యానికి మంచి మనసు చాలా అవసరం.

-శామ్యూల్ జాన్సన్

✤ కత్తిగాటువల్ల కలిగే గాయంకంటే నోటిమాటవల్ల కలిగే గాయం లోతుగా ఉంటుంది.

-రాబర్ట్ బర్టన్

సేకరణ: పి.వి. రమణకుమార్

మాట్లాడ్తూ పోయాను. అతడు నన్ను మధ్యలోనే అందుకుంటూ "చూడు వసూ! నీలో మార్పురావాలని ఓపికగా ఎదురు చూస్తున్నాను. నీవు నాకు నచ్చావు కాబట్టే సహనంతో నీ మొండితనాన్ని భరిస్తున్నాను. ఇప్పుడు అబ్బాయిగార్లకోసం నేను బొంబాయి వెళ్లాలి. అంటే ఆ దేవుడికి కూడా నామీద జాలిలేకుండా పోయింది. అందుకే నన్ను నీకు దూరంగా పంపిస్తున్నాడు. నిస్సహాయుడిని కాబట్టి ఇది కూడా భరించక తప్పదు" తన బాధను వెళ్లగక్కుకోవడం మొదలెట్టాడు.

నేను మల్లేశానికి ఇంకా దూరంగానే వున్నానని ఈ పాటికి పెదబాబుకు తెల్సిపోయిందని నాకు అర్థమౌతున్నా మళ్లీ ఆ ప్రస్తావనని తీసుకువస్తూ "చదువుకోవాలని, చదివి ప్రయోజకురాల్ని కావాలని, నాలో ఎన్నో కలలు వుండేవి! కాని దురదృష్టం నన్ను నీ భార్యను చేసింది. ఏం చేస్తాను? ఖర్మను తప్పించుకోవడం ఎవరి వశం కాదు కదా! అయినా వూర్లో నాపై అన్యాయంగా లేనిపోని అపవాదులు వచ్చి, నా జీవితాన్ని ఇంత దుర్భరంగా మార్చేశాయి. ఆ అపవాదులు అన్నీ అబద్ధం, నేను నిజం, అంటూ గొంతు చించుకు అరిచినా ఈ సమాజాన్ని నమ్మించలేము. ఇలాగని నేను రాజీపడలేను. కాబట్టే ఇష్టంలేని నీకు ఇలా దూరంగా వుంటున్నాను. దయచేసి నన్ను అర్థంచేసుకోండి. క్షమించండి" మొదట ఎప్పట్లా ఆవేశంగా మాట్లాడి చివరగా మెత్తబడిపోతూ ఏడుపుముఖంతో అతడి కాళ్ల పట్టుకోబోయాను.

"ఏ...వసూ..." అతడు చప్పున దూరం జరుగుతూ నన్ను వారించాడు.

"నన్ను క్షమించి, నేను మీ భార్యననే సంగతి మరిచిపోండి" ఏనాడూ అలా మెత్తబడి మాట్లాడని నేను, ఇప్పుడు అనూహ్యాంగా ఎందుకు అలా మాట్లాడ్తున్నానంటే... పెదబాబుకు నాపై జాలి కలగాలని నాలో చప్పున మెదిలిన ఆలోచనని నిజాయితిగా పండించాలని.

"వసూ..." అతడు నా బాధకు తనదైన బాధతో స్పందిస్తున్నాడు.

"నేను మీ భార్యగా బతకలేను. కాబట్టి మనం ఎలా విడిపోవాలనేది బాగా ఆలోచించి మీరే సూచించండి. ఒక మంచి మనసున్న వ్యక్తిగా ఈ జీవితం చివరివరకు మిమ్మల్ని గౌరవిస్తాను కాని, మీ జీవిత భాగస్వామిగా మనసు చంపుకుని మాత్రం బతకలేను. నన్ను అర్థంచేసుకోండి" బాధను హెచ్చిస్తూ చివరకు కన్నీళ్లు కార్చేశాను కూడా!

"వ...సూ... మనం... వి...డి...పో...వా...లా...?" అతడు తట్టుకోలేని వాడై విలవిలలాడిపోయి, ఆ తర్వాత అక్కడ వుండలేనివాడై నెమ్మదిగా లేచి గది తలుపు తీసుకుని నిశ్శబ్దంగా బయటకి నడిచాడు.

నేను 'ఈ దీనురాలిని గెలిపించు తండ్రీ' మనసులోనే దైవాన్ని ప్రార్థించుకున్నాను.

★ ★ ★

ఉదయం ఆరుగంటలు కావొచ్చింది. అప్పటికి నేనూ, మల్లేశం పనిలోకి వెళ్లాము. రోజూ ఆ సమయంలో వ్యాయామం చేస్తూ హుషారుగా కనిపించే పెదబాబు, ఆరోజు ఏదో పోగొట్టుకున్నవాడిలా నిశ్శబ్దంగా వున్నాడు.

"ఎందుకిలా వున్నాడు?" అతడి తీరు నాకేమీ అర్థంకాలేదు. నాకే కాదు ఇంట్లో కూడా ఎవ్వరికీ అర్థంకాలేదు. కాబట్టే "ఎందుకలా వున్నావు?" అంటూ ఒకరి తర్వాత ఒకరు ప్రశ్నల వర్షం కురిపిస్తూ గాబరాపడుతున్నారు. ఇందుకు అతడినుండి నంథిగ్ అంటూ సమాధానం వస్తోందే తప్ప మరేమీ చెప్పడం లేదు. అయితే అందుకు అసలు సమాధానం ఏమిటనేది నాకు మధ్యాహ్నం అనగా తెలిసివచ్చింది. అది ఏంటంటే... నిన్న పిల్లి కారణంగా వైరు కనెక్షన్‌లో లోపం ఏర్పడటం

జరిగింది. దీంతో రాత్రి నేనూ మల్లేశం మాట్లాడుకున్న మాటలు తనకు తెలియక పోవడం సంగతి ఏంటోగాని, తను అనుకున్నట్టుగా మా ఇద్దరి మధ్య జరిగిన శృంగార సన్నివేశాల్ని తన కెమేరా బంధించలేకపోయిందనే వేదనకొద్దీ అతడు మనిషి కాలేకపోతున్నాడు! ఈ విషయమై నా స్పందన సంగతి ఏంటో గాని, నా బాధ మరోలా మొదలయ్యింది. ఎలా అంటే... నా ప్రయత్నంలో నేను మళ్ళీ ఓడిపోయాను కదా!

ఇంతలో దొరబాబు దంపతులు అతడ్ని తీసుకుని వూరెళ్లారు. వూర్లో పెదపాలేరుకు అకస్మాత్తుగా జబ్బు చేసిందని, ఆ జబ్బు నయమయ్యే వరకు మల్లేశాన్ని అక్కడే వుంచుకోవాలని, ఇందువల్ల వ్యవసాయం పనుల్లో కూడా కొద్దో గొప్పో ప్రవేశం వున్నట్టుగా వుంటుందని, వాళ్ల అభిప్రాయం! ఇక ఇక్కడ నేను ఒంటరిదాన్నయిపోయాను. మల్లేశం నా తోడుగా వున్నా నేను ఒంటరిదాన్నే! అయితే... నా అభిప్రాయం ప్రకారం "మొగుడూ పెళ్లాలను ఆ విధంగా విడదీయడం ఎంతమాత్రం మంచి అన్పించుకోదు! మా ఇద్దరిమధ్య ఎడం గురించి వాళ్లకు తెలియదు. ఇలాంటప్పుడు ఈ విధమైన వాళ్ల ప్రవర్తన మామీద వాళ్ల నిర్లక్ష్యానికి నిలువెత్తు సాక్ష్యం" ఇలాంటి వాళ్ల గుణదోషాల గురించి నేను ఇలా అనుకోవడం కొత్తేమీ కాదుగా! అందుకే ఆ విషయమై అదేపనిగా వాళ్లను ఆడిపోసుకోలేదు నేను! అసలు ఆడిపోసుకోవడం ఎందుకు? నా ప్రయత్నం ఏంటో ఆ విషయం గురించే నేను ఆలోచిస్తేపోలా?

ఇప్పుడు ఇంట్లో నేను, అబ్బాయిగార్లు ముగ్గురం వున్నాం. ఈ నలుగురి నేపథ్యం లోనే నన్ను పెదబాబుకు తెలియచేసుకోవాలి. కాని ఎలా? ఎంత ఆలోచించినా సందర్భం తోచడంలేదు. స్వయానా చెప్పుకునే అవకాశమా? అది కలలో మాట!

★ ★ ★

చూస్తుండగానే కాలం ముందుకు నడిచిపోయింది. చిన్నబ్బాయిగార్లు మల్లేశాన్ని తీసుకుని ముంబాయి వెళ్ళిపోయారు. రెండ్రోజులు వుండి వద్దామని నేను అమ్మా వాళ్ళ ఇంటికి వెళ్లాను.

"మొగుడు ఒకచోట, పెళ్లాం ఒకచోట. దొరబాబు వాళ్లకు ఇది న్యాయం కాదు. వాళ్లు చేసిన పని వాళ్ళకు బాగుందేమో గాని, చూసేవాళ్ళకు ఏం బాగలేదమ్మా! ఆ లంకంత కొంపలో నీవూ పెదబాబు ఇద్దరే వుంటే ఏమైనా సమ్మతం వుందా? పది మందీ పదిమాటలు అనరూ! తిండికి లేక పోయినా నీతిగా బతికేవాళ్లం. ప్చ్... ఏందో లేమ్మా... పెదబాబుగారు ఎంత మంచోడయినా నీ మటుకు నీవు వుండిపో! ఏ సమయాన ఎవ్వరికి ఎటువంటి బుద్ధిపుడుతుందో? " నా గురించి అంతెత్తున బాధ పడిపోయింది అమ్మ.

అందుకే సర్దిచెప్పుకుంటూ "నీవు అంతగా బాధపడాల్సిన అవసరంలేదమ్మా! పెదబాబు దేవుడులాంటివాడు" చెప్పాను.

"ఏం దేవుడో ఏమో? ఎంతయినా వయసులో వున్న మగపిల్లవాడు! ఇన్నిరోజులు ఆ ముగ్గురు మగపిల్లలతో కలిసి ఎట్లున్నావో ఏమో? "

నేను అక్కడ వున్నన్నిరోజులూ బాధపడిపోతూనే వుండిపోయింది. నేను అమ్మ బాధను పెద్దగా పట్టించుకోలేదు. అందులో వాస్తవం వున్నప్పటికీ ఎప్పటికప్పుడు ఆ బాధను చెరిపే ప్రయత్నం చేస్తూవచ్చాను. ఇక నేను నగరానికి ప్రయాణమైనప్పుడు అమ్మ కళ్లనీళ్లు పెట్టుకుంది.

★ ★ ★

ఉన్నట్టుండి ఒకరోజు పెదబాబు వెంట ఒకమ్మాయి వచ్చింది. చాలా బాగుంది. వాళ్ళ ఇద్దరి మధ్య సాగుతున్న సంభాషణ ఆధారంగా 'ప్రేమికులు' అని స్పష్టమైంది. పెదబాబుకు ప్రేమికులు వున్నట్టుగా ఇన్నాళ్లవరకు సూచాయగానైనా నాకు తెలిసిరా

లేదు. అమ్మాయిల్తో పరిచయాలు వున్నట్టుగా మాత్రం తెలుసు. అయితే ప్రేమించే గొప్ప హృదయం కూడా అతడిలో వుందంటే, అతడు నన్ను అర్ధంచేసుకునే శక్తిని కూడా ఏదో ఒక మూలన తప్పనిసరై కలిగివుంటాడు. అదే నాక్కావల్సింది.

ముఖ్యంగా అతడి హృదయంలో చోటును మాత్రమే వెదుక్కుంటున్నాను.

నేను కూడా తనకి కావాలి అనే బలమైన కోరికను అతడిలో కలిగించాలి! అతడు నా వాడైతే ఎవ్వరూ నన్నేమీ చేయలేరు! మరి ఇందుకు నేను ఏం చేయాలి? అతడ్ని నేను ఎలా ప్రేరేపించాలి? అన్నింటికంటే ముందు మల్లేశాన్ని నా జీవితంలోంచి ఎలా తొలగించుకోవాలి?

"వసుంధరా..." ఆలోచనలో మునిగిపోయి వున్న నన్ను పెదబాబు పిలుపు మేల్కొలిపింది.

"బాబుగారూ..." చప్పున పలికాను.

"ఏంటమ్మా పరధ్యానంలో వున్నావు? మల్లేశం గురించి ఆలోచిస్తున్నావా?" అడిగాడు నవ్వుతూ.

ఆ ప్రశ్న నా గుండెల్ని బలంగా పిండినట్టయ్యింది. మల్లేశం అనే మాట నా హృదయాంతరాల్లో అసహ్యాన్ని రేపింది. అయినప్పటికీ సహజంగా వుండిపోతూనే "అదేంలేదు బాబుగారూ" అన్నాను.

"సర్లేగాని, నేను బయటకి వెళ్ళొస్తాను. వచ్చే వరకు అమ్మగారికి ఏమైనా అవసరం వస్తే చూస్తూవుండు. తను అసలే మోహమాటస్తురాలు. కాబట్టి తన అవసరం ఏంటో నువ్వే అడిగి తెలుసుకుంటూ వుండు. ఓకే?" చెప్పి ఆ వెంటనే వెళ్ళిపోయాడు పెదబాబు.

ఆ తర్వాత బయటకు నడిచి "అమ్మగారూ తమరి పేరేంటి?" అడిగాను.

"నా ఒర్జినల్ నేమ్ చిత్రరేఖ! నా ఫ్రెండ్సంతా 'చిత్రా' అంటారు. కాని మీ బాస్‌గారు మాత్రం డాళింగ్ అంటారు." చలాకీగా చెప్పింది తను.

అందుకు నేను చిన్నగా ఓ చిరునవ్వు నవ్వి "ఇప్పుడు తమరికి ఏమైనా కాఫీ, టీలాంటిది?" అడిగాను.

"నాకు ఇప్పుడు అవేమీ అవసరంలేదు కాని, వెళ్ళి నీ పనేంటో నీవు చూసుకో! డిస్టర్బ్ చేసే వాళ్లంటే నాకు కాస్త చీకాకు. ఓకే?" చిరునవ్వుగానే అయినప్పటికీ చెంపదెబ్బ కొట్టినట్లుగా కరాఖండిగా చెప్పేసింది తను.

"మొహమాటస్తురాలని పెద్దగా చెప్పాచ్చాడు బాబుగారు. కాని ఈవిడగారు మొహమాటానికి బదులుగా మొహాన్ని వాయగొట్టే మహాశక్తిలా వుంది" మనసులోనే అనుకుంటూ చప్పున అక్కడ్నుంచి వెళ్ళిపోయి, వెనక ఖాళీ ప్రదేశంలోకి వెళ్ళి నిల్చున్నాను.

మళ్ళీ ఆలోచనలు చుట్టుముట్టాయి. వీళ్లు నన్ను కాదన్నా, అతడు నన్ను మోసం చేయాలని చూసినా, అతడి మనసు కోసం నేను మళ్ళీ మళ్ళీ ప్రయత్నిస్తాను. ఈ ప్రయత్నంలో గెలిస్తే తరంగాన్నై అతడ్ని లాలనగా తడిపేస్తాను. ఓడిపోతే ఉన్మాదినై నాకు దక్కని అతడ్ని మరెవ్వరికీ దక్కకుండా చేస్తాను.

స్థిరంగా నా మనసు ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత ఇక నాకు తెలియకుండానే నాలో ఒక కొత్త ధైర్యం వచ్చి చేరింది. పెదబాబు పరాయివాడు అయిపోతాడేమో, నా ప్రేమ కలగానే మిగిలిపోతుందేమో! అనేటువంటి భయాలు ఇప్పుడు నాలోంచి పూర్తిగా చెరిపివేయబడ్డాయి. ఇదే తరుణంలో నా శీల సంస్కారాన్ని బాధపెడుతూ 'పెదబాబుగారు వసమ్మను ఉంచుకున్నారంట' అన్న వార్త వూరిలో గుప్పుమన్నట్టుగా ఫోన్‌చేసిన అమ్మ ఏడుస్తూ చెప్పింది. లేని అపవాదు నా మనసును బలంగా పిండినమాటేమిటోగాని ఆ విషయాన్ని గురించి కావాలని పెదబాబుతో మాట్లాడి కపట కన్నీళ్లు పెట్టుకున్నాను.

అతడి స్పందనకోసం నేను ఆసక్తిగా ఎదురు చూశాను.

"ఎవరెవరో ఎన్నెన్నో అంటుంటారు.

వాటిని పట్టించుకుంటూ వెళ్తే మనశ్శాంతిగా బతకలేమమ్మా! అయినా ఇది నా ప్రిస్టేజ్ ఇష్యూ కాబట్టి నాకూ బాధగానే వుంది. ఇలాగని సమాజం నోరును మనం మూయించలేం కదా? " అన్నాడు అతడు.

"అంతేలే బాబుగారూ" తలాడిస్తూ మరో మారు కళ్లు తుడ్చుకున్నాను.

"ఇంతమాత్రానికి ఏడ్వడం ఏంటమ్మా? ఇలాంటివి చాలా చిన్నచిన్న విషయాలు" అన్నాడతడు.

అది ఏ విషయమోగాని వాస్తవం చెప్పాలంటే నా శీలం అనుమానించబడటం ఒకరకంగా బాధను కల్గించినా మరోరకంగా నాకు సంతోషాన్ని కల్గిస్తోంది. ఆ మాట అతడిలో బలంగా నాటుకు పోయి నాతో అతడు తన వ్యాపారాత్మక స్వార్థాన్ని కాకుండా నిజంగానే నా తోడును కోరుకునేలా అతడి మనసు మారిపోవాలని నా మనసు తపించడం మొదలెట్టింది. ఇంకా మల్లేశానికి మా గురించి తెలిసి గుండె ఆగిపోవాలని కర్కశంగా అన్పిస్తోంది కూడా. అయితే నేను అంత సులువుగా మాత్రం పెదబాబు పంచకు చేరలేను. అందుకు సరైన నమ్మకం కుదరాలి.



బాగా చీకటిపడింది. నేను నా గదిలో కూర్చుని పెదబాబు ఇంటినుండి తెచ్చుకున్న చపాతి తింటున్నాను.

"వసుంధరా" పిలుస్తూ వచ్చాడు పెదబాబు.

"బాబుగారూ" తినేదాన్నల్లా వదిలి లేచి నిల్చున్నాను.

"తిన్న తర్వాత ఒకసారి ఇంటికి రామ్మా" చెప్పి ఆ వెంటనే వెళ్లిపోయాడు తను.

"ఎందుకు? " నాకు ఏదో మూలన భయమేస్తుండగా మనసులోనే అనుకున్నాను. అయినప్పటికీ వెళ్లక తప్పదు కాబట్టి ఆదరబాదరగా సగం సగంగా తినేసి ఆ వెంటనే వెళ్లాను. అప్పటికి పెదబాబు నాకోసమే ఎదురు చూస్తున్నట్టుగా మొదటి హాల్లోనే బయటకు చూస్తూ కూర్చుని నేను వెళ్లగానే "తినాలనిపిస్తోంది. ఎండుచేపల్ని ఫ్రైచేసి తీసుకురాపో" చెప్పాడు.

"సరే బాబుగారూ" అంటూనే నేను లోపలికి నడిచి పది నిముషాల్లో ఎండుచేపల్ని ఫ్రై చేసుకుని తీసుకువచ్చాను. నేను వచ్చేసరికే తన ముందు మందుసీసాల్ని పెట్టుకుని విలాసంగా తాగుతూ, మరోవైపు సిగరెట్టు ఊదుతూ, ఒంటరి వాతావరణంలో ఒకవిధమైన గుండె అలజడిని కలిగించాడు.

"ఇక నేను వెళ్లవచ్చా బాబుగారూ? " ఎండుచేపల్ని అందించి, ఎంతయినా అక్కడ వుండటం మంచిది కాదని అడిగాను.

"వసుంధరా! అమ్మావాళ్లు మరీ ఓవర్! కొన్ని విషయాల్లో నేను చెప్పినట్టుగా మసలుకోవాలి. ఏంటంటే నా డ్రింకింగ్ గురించి గాని, స్మోకింగ్ గురించి, గాని పేకాట గురించిగాని, నా ఫ్రెండ్స్ అలవాట్ల గురించిగాని ఇంట్లో వాళ్లకు ఎట్టి పరిస్థితుల్లో తెలియనీయకూడదు" తాగుతూనే చెప్పుకుపోయాడు.

"సరే" తలాడించాను.

అందుకు అతడు చిన్నగా నవ్వాడు. "ప్రతి దానికీ సరే అంటూ తలాడించడం నీకు మేనరిజమా! నీతో ఎలా చెప్పాలో అర్థం కావడం లేదు" అని కాసేపు ఆగి

"నీవూ వయసులో వున్నావు. నేనూ వయసులో వున్నాను. మనలా వయసులో వున్న వాళ్లు ఇలా ఒంటరిగా వుండకూడదు. వుండకూడదు అనే మానర్సు మా పెద్దవాళ్లకు లేదు సరే వున్నప్పుడు ఏం జరిగిపోవాలీ అనే నాలెడ్జ్ అయినా మనకు వుండాలికదా! ఐ మీన్ నీవూ నేనూ కమిట్ అయిపోయామనుకో, ఎవరి భయంలేకుండా, అడ్డంకు లేకుండా స్వర్గాన్ని అనుభవించవచ్చు ఇందుకు మన ఇద్దరికీ కావల్సింది డేర్‌నెస్. నా అంతట నేను కోరి నిన్ను పిలుస్తున్నాను. ఏమంటావు?" ఎలాంటి తడబాటు లేకుండా ముక్కుసూటిగా మాట్లాడుతూ పోయిన పెదబాబు నాలో విస్మయాన్ని కలిగించాడు.

"బా...బూ..." అతడి మాటలు జీర్ణించుకోలేనిదానిగా అప్రయత్నంగా లేచి నిల్చున్నాను.

"ఏంటమ్మా! అలా చూస్తున్నావు? భయమేస్తోంది కదూ?" అంటూ చిన్నగా నవ్వి "మరేం భయపడాల్సిన అవసరంలేదు. మన విషయం మూడో కంటికి తెలియకుండా జాగ్రత్తపడదాం" తేలికగా అన్నాడు.

పెదబాబు అంటే నాకు ప్రాణం! అంత మాత్రానికి ఒకరి పెళ్లాంగా వుంటూ అతడితో పడక పంచుకోవడం నాకు ఇష్టం లేదు. కాబట్టే వణుకుతున్న గొంతుతో "మీరేం మాట్లాడుతున్నారు బాబు?" బలవంతంగా అనగలిగాను.

అందుకు అతడు నావైపు కొన్ని క్షణాలు సూటిగా చూసి "ఇష్టంవుంటే ఒప్పుకో! లేదంటే ఈ విషయాన్ని బయటకు పొక్కనీయకుండా ఇక్కడే మర్చిపో" సిగరెట్టు నలిపి యాష్ట్రేలో పడవేస్తూ అన్నాడు.

"..." నేను గజగజా వణికిపోతున్నాను.

"నీ అందం నాకు నచ్చింది. అందుకే అడుగుతున్నాను" మరో సిగరెట్టు వెలిగించుకుంటూ అన్నాడు.

నేను మెల్లగా నాదైన అభిమతంలోంచి ఆలోచించుకోవడం మొదలెట్టాను. ప్రేమ ఎంత గొప్పదయినా శీలం విషయంలో సంస్కారానికి కట్టుబడిన నేను ఒక్కసారి ధైర్యంచేసి అతడికి లొంగిపోతే నా కన్యత్వం గురించి అతడికి అర్థమౌతుంది. ఆ తర్వాత అందుకు కారణం తెలిసివస్తుంది. దీంతో అనుకున్న విజయం కోసం ఇన్నాళ్ల నా వృధా ప్రయాస పటాపంచలై సులువుగా అతడి జీవితంలోకి కాకపోయినా బలంగా అతడి మనసులోకి ప్రవేశించగలను.

నమ్మకంగా ఆలోచించడం పక్కకు పెడితే అతడి ప్రవర్తనపై నాకు నమ్మకం లేదు. తన స్వార్థంకోసం నన్ను ఒక పావును చేసుకుని, ఆ తర్వాత...

"ప్చ్! విసిగించొద్దు" అంటూనే లేచి నావైపు వచ్చాడు అతడు.

అతడు అలా రాగానే నాలో భయం పెరిగింది. అందుకే నాకు తెలియకుండా ఒక అడుగు వెనక్కి వేశాను.

"ఏం ఇష్టంలేదా?" అతడు నావైపు చిత్రంగా చూస్తూ ఆగిపోయాడు.

"బా...బు.గా...రూ" ఏం మాట్లాడాలో తెలియక ఎలా స్పందించాలో అర్థంకాక గుటకలు మింగాను.

"ఐదు నిమిషాల సుఖం కోసం నేను నిన్ను అడుక్కోవడం వెరీబాడ్! అడుక్కునే అవసరం అదీ నీలాంటి వాళ్లని అడుక్కోవాల్సిన ఖర్మ నాకు లేదు. అయినా నేను నిన్ను నా అంతట నేనుగా కోరుకుంటున్నాను. నాలాంటి రాజకుమారుడితో సుఖం దొరకడమంటే వెదకాల్సిన బంగారు తీగ కాలికి తగిలినట్టే! కాని నువ్వేంటి వసుంధరా అంతగా భయపడిపోతున్నావు? ఆ మల్లేశం గాడు ఏంటీ వాడి భార్యగా నీవు ఇంత ఇదిగా హద్దుల్ని ప్రేమించడమేంటి! నథింగ్! నో సెంటిమెంట్స్!

"వూర్లో ఎలాగూ మన గురించి అపవాదు

వచ్చింది. దాన్ని నీవు నిజం చేయకపోయినా సరే నేను నిజం అన్నట్టుగా తెర వెనకవుండే అందరినీ నమ్మిస్తాను. నీవు ఒప్పుకున్నావు అనుకో అదంతా అబద్ధం అని నీ విలువల్ని కాపాడుతాను. అయినా మీలాంటి వాళ్లకు విలువలు ఏంటీ? మాలాంటి వాళ్లతో సంబంధాలు వున్నాయంటేనే మీకు అదొక ఎస్సెట్ కదా! పోనీలే! నీవు కొద్దోగొప్పో చదువుకున్నావు కాబట్టి సెల్ఫ్ రెస్పెక్ట్ అనేది నిన్ను యాదృచ్ఛికంగా చుట్టేసివుండవచ్చు. అయినా సరే వసుంధరా! నీవు అలాంటి వాటిని గురించి పట్టించుకోవద్దు. కమాన్ ఆలస్యం చేయొద్దు" అంటూనే నన్ను బలంగా తనమీదకు లాక్కున్నాడు తను.

"ఆ..." ఏ వేగంతో అతడిపై పడ్డానో అదే వేగంతో అతడినుండి దూరం జరిగాను.

"వసుంధరా" కుదిపినట్టుగా అన్నాడు తను.

"ఆ బాబుగారూ" నేను ఉలిక్కిపడ్డాను.

"వలచివచ్చినందుకు చిన్నచూపా? అంత పొగరువద్దు" పౌరుషంగా అన్నాడు.

"పొగరుకాదు బాబుగారూ" అన్నాను.

"మరి? " అన్నాడు అతడు.

"మీ కాళ్లు పట్టుకుంటాను. నన్ను రెండ్రోజులు ఆలోచించుకోనివ్వండి" దీనంగా అభ్యర్థించాను.

"అంటే? " అర్థం కానట్టుగా, అర్థమైనా ఎందుకన్నట్టుగా అదో మాదిరిగా చూశాడు.

"మిమ్మల్ని కాదనలేను బాబుగారూ! మిమ్మల్ని కాదనడం నావల్లకాదు. అంతా మీకు చెప్పినట్టుగానే కానిస్తాను. ఇందుకు రెండురోజులు..."

"వద్దు.. వద్దు" నా మాట పూర్తి కాకుండానే ఈమారు తను అందుకున్నాడు.

"అది కాదు బాబుగారూ" నా మనసును మరోమారు విన్నవించుకోబోయాను.

"నా మాటను కాదనలేను అంటున్నావు. ఆలోచించుకోలేనూ అంటున్నావు. అసలు నేను నిన్ను ఎలా అర్థం చేసుకోవాలి? టెల్ మీ, డోంట్ వేస్ట్ టైమ్" తొందరపెట్టాడు.

"మీకు దండం పెడతాను బాబుగారూ! మీలాంటి వాళ్లు మాలాంటి వాళ్లను కోరుకోవడం అంటే అదో గొప్ప అదృష్టం! కాని ఒక్కసారి నన్ను ఆలోచించుకోనివ్వండి" భయపడుతూనే అభ్యర్థించాను.

"ఆలోచించుకున్నాక వద్దనిపిస్తుంది. అప్పుడేమంటావు? "

"మిమ్మల్ని కాదనలేను బాబుగారూ!"

"ఎలాగూ కాదనలేవు. ఇప్పుడే ప్రొసీడ్ అయిపో"

"అదికాదు బాబుగారూ"

"ఇంకేంటి? "

"ఎందుకంటే నేను ఇప్పుడు దూరం. మూడు రోజులవరకు" ఇక అర్థం చేసుకోండి అన్నట్టుగా అతడివైపు చూశాను.

"ఆ విషయమేంటో ముందే చెప్పి ఏడవొచ్చుకదా! నేను ఏదో నిన్ను బలవంతం చేస్తున్నట్టుగా, నీవు ఏదో తప్పించుకున్నట్టుగా ఇంతసేపూ ఏంటా బిల్డప్పు? అయినా నీవు నిజం చెప్తున్నావా లేకా నన్ను తప్పించుకునే ప్రయత్నంగా అదో డ్రామానా? " సూటిగా అడిగాడు.

"లేదు బాబుగారూ! అయినా నేను డ్రామా ఆడితే ఇప్పుడు తప్పించుకోగలనే మోగాని ఎప్పటికీ తప్పించుకోలేనుకదా! కాకపోతే ఈ విషయం మీకు ఎలా చెప్పాలో అర్థంకాక ఇంతసేపూ అలా మాట్లాడాను" ఎంత మాత్రం తడబాటులేకుండా అన్నాను.

"నాకు నమ్మబుద్ధి కావడంలా" అతడు నావైపు అదోరకంగా చూసి ఆ తర్వాత ఓ పెగ్గు కలుపుకోసాగాడు.

"దేవుడా! నీవే నన్ను రక్షించాలి" మనసులోనే అనుకుని "లేదు బాబుగారూ! మీ దయాదాక్షిణ్యాలమీద బతికేవాళ్లం! మీతో నటించేంత ధైర్యం మాకు ఎక్కడిది? "

దీనంగా అన్నాను.

అప్పటికి నిషా క్రమంగా పెరిగిపోతున్న పెదబాబు "ప్రా..మీ..స్?" అంటూ మూతలు పడుతున్న కళ్లతో నన్ను చూశాడు.

"మీమీద ఒట్టు బాబుగారూ" చెప్పాను.

"సరే వెళ్లు!" అన్నాడు.

"సరే బాబుగారూ" అంటూ వెంటనే వెనుతిరిగి గబగబా వచ్చేయకుండా ఒక్కో అడుగు వెనక్కి వేస్తూ అలా ఓ ఐదారు అడుగులువేసి ఆ తర్వాత వెనుతిరిగి "హమ్మయ్య" అనుకున్నాను మనసులోనే.

★ ★ ★

ఆలోచనలతో రాత్రి నిద్రపట్టలేదు. దీంతో ఉదయాన్నే లేవలేకపోయాను. ఏ తెల్లవారుజామునో వచ్చిన కునుకు బారెడు పొద్దెక్కినా నన్ను విడవక ఆవహించి, ఆ పిమ్మట చప్పున నన్ను గాబరాపెట్టింది. దీంతో నేను హడావిడి పడిపోతూ బాబుగారి ఇంటివైపుగా పరుగెట్టాను. నేను వెళ్లేసరికి బాబుగారు ఎక్కడా కనిపించలేదు.

'ఎక్కడికి వెళ్లివుంటారబ్బా?' మనసులోనే ప్రశ్నించుకుంటూ అటూ ఇటూ చూశాను. అంతలో బాబుగారు వస్తున్నట్టుగా స్లిప్పర్ శబ్దం మెట్లవైపుగా వినిపించింది. చప్పున అటువైపు చూశాను. నేను చూసిన కొన్ని క్షణాలకు బాబుగారు మెట్లు దిగి వస్తూ కనిపించాడు.

"ఏంటీ రాలేదు?" నన్ను చూడగానే ప్రశ్నించాడు.

"అదీ" నీళ్లు నమిలాను.

"సర్లే! తొందరగా టిఫిన్ రెడీ చేయి! ఎలాగూ ఆలస్యం అయింది. తినేసి వెళ్తాను" చెప్తూనే నన్ను దాటుకుని వెళ్లాడు.

గబగబా వంటింటివైపు నడిచాను. ఐదు నిముషాల్లో ఉప్మాకి కావల్సిన అన్నింటిని తయారుగా పెట్టేసుకున్నాను. అంతలో వంటకంటే ముందుగా దేవుడిగది వూడ్చాలనే సంగతి గుర్తుకు వచ్చింది.

"దేవుడిగది శుభ్రం చేయలేదు" గుర్తు చేశాడు.

"హడావిడిలో మరిచిపోయాను. క్షమించండి బాబుగారూ" జాలిగొలిపే ముఖంతో అన్నాను.

"ఫరవాలేదులే" చిరునవ్వుతో అన్నాడు.

తర్వాత నేను ఉప్మా తయారుచేసేవరకు అక్కడే నిల్చుని ఏదో ఒకటి మాట్లాడుతూ పోయాడు. అయితే ఇదివరకటిలా అమ్మా అని మాత్రం ఎక్కడా సంబోధించలేదు. దీని ఆధారంగా తన ఉద్దేశ్యం మారలేదని అర్థమయింది.

"ఉప్మా రెడీ అయ్యిందికదా! ఇక నాకు నేనే వడ్డించుకుంటాలే గాని నువ్వెళ్లి దేవుడి గది శుభ్రం చేయి" అదే చిరునవ్వుతో తనే కల్పించుకున్నాడు.

నేను దేవుడిగది శుభ్రం చేయడానికి వెళ్లాను. ముఖ్యంగా ఈమధ్య కాలంలో బాబుగారికి భక్తి ఎక్కువయ్యింది. అప్పటి నుండే ఈ శుభ్రం చేయడాలు తప్పనిసరై పోయాయి.

'బాబుగారు ఏంటీ? నా కోసం ఇలా ప్రవర్తించడం ఏంటీ?' మనసులో అనుకుంటూ దేవుళ్ల పటాల్ని నెమ్మదిగా జాగ్రత్తగా శుభ్రమైన గుడ్డతో తుడుస్తున్న నా చూపులు అప్రయత్నంగా సుబ్రమణ్యస్వామి పటానికి వెనకవైపుగా వుంచబడిన కవర్‌పై పడ్డాయి. చూడగానే అది ఎవరికో రాసి వుంచిన ఉత్తరమని అర్థమౌతోంది.

'దేవుడి ఆశీర్వాదం కోసం వుంచిన ఈ ఉత్తరం ఎవరికై వుంటుంది? ఎంత ముఖ్యమైనదై వుంటుంది?' ఈ మాటకూడా మనసులోనే అనుకుంటూ వద్దనుకుంటూనే అటూఇటూ చూసి ఇంకా అతికించని ఆ కవర్‌ని నెమ్మదిగా విప్పి చదవబోయి అంతలోనే బాబుగారు వచ్చినా రావచ్చుని తలుస్తూ వెళ్లి తలుపులు దగ్గరగా వేసుకుని వచ్చి 'ఏం రాశావు పెదబాబు?' అనుకుంటూ మెల్లగా చదవనారంభించాను.

"డాక్టర్‌గారూ! మీతో నాకున్న ఇంటిమసీతో ధైర్యంగా నా బాధ మీ ముందుంచుతున్నాను. నా గురించి ఇప్పటికే మీకు కొంత తెలుసు. అయినా నేను స్వయంగా చెప్పుకుంటేగానీ తృప్తిలేదు. రాజరికంలో పుట్టి పెరిగిన నాకు పేదరికం, ఓటమి ఎలాంటివో ఇప్పటివరకూ తెలీవు. ఇక మీదట ఎప్పుడూ కూడా తెలియకూడదనుకుంటున్నాను. తాతగారి నుండి నాన్నవరకు సంపాదించిన ఆస్తులు మా ఇంకొన్ని తరాలవరకు పేదరికాన్ని తెలియనీయవు అనడంలో ఎంతమాత్రం పొగడ్తలేదు. ఎందుకంటే మా ఆస్తిపాస్తులు అనేవి కొన్ని మిలియన్ డాలర్లలో వున్నాయి. ఇది ఓకే! కాని ఓటమి నన్ను దరిచేరుతుందేమోనన్న భయం ఈమధ్యకాలంలో నన్ను పీడిస్తోంది. ఓటమి వరించినప్పుడు ఎంత డబ్బున్నా ఏమీ చేయలేరనే వాస్తవం నాకు తెలుసు. ఎందుకంటే నాటి చరిత్ర నుండి నేటివరకూ ఓడిన వీరులు ఎందరో వున్నారు. వాళ్లల్లో ఒకరిని నేను కాకూడదు అనుకుంటున్నాను. అందుకే నాకు తెలియకుండానే ఈమధ్యకాలంలో దేవుడ్ని ఆరాధించడం మొదలెట్టాను. ఆత్మ విశ్వాసం ముందు ఏ శక్తి అయినా బలాదూరే అని విశ్వసించే నేను ఈవిధంగా నా స్వార్థం కోసం దేవుడు అనే శక్తిని నమ్మడం మొదలెట్టడంతో నాకు నేనే చిత్రంగా అన్పిస్తున్నాను. ఇది ఏమైనప్పటికీ నా అసలు విషయానికి వస్తే నేను ఒకమ్మాయిని కోరుకుంటున్నాను. మెయిన్‌గా ఈ విషయమై మీకు ఉత్తరం రాస్తున్నాను.

నా పదవతరగతి చదివే రోజుల్నుండి ఆమెను కోరుకున్నప్పటికీ ఏ రోజూ ఆవిధంగా బయటపడలేదు. మా రాయల్ డిగ్నిటికి ఎలాంటి ఢోకాలేకుండా బిహేవ్ చేస్తూ వచ్చాను. ఇప్పుడా అమ్మాయికి మా ఇంట్లో పనివాడితో పెళ్లయింది. కోరుకున్న అమ్మాయిని ఫ్రెష్‌గా అనుభవించాలి అనేది నా తపన. ఆమెకు పెళ్లయ్యింది కాబట్టి నా తపనకు ఫుల్‌స్టాప్ పెట్టేశాను అనుకుంటే పొరపాటే! ఎందుకంటే షి ఈజ్ మోస్ట్ బ్యూటిఫుల్ గాళ్. మంచి కుటుంబంలో పుడితే తన అందానికి నాలాంటి రాజకుమారులు ఎందరో సీతా స్వయంవరాన్ని పునరావృతం చేసేవాళ్లు. బట్ తనది బాడ్‌లక్! మంచిముత్యమైనప్పటికీ మసిగుడ్డలో ఇమిడిపోయింది. అఫ్‌కోర్స్! ఇప్పటికీ తనని తనివితీరా కొన్నాళ్లు అనుభవించాలని వుంది.

అంతేకాదు నేను సీక్రెట్‌గా కొనసాగిస్తున్న బ్లూఫిల్మ్ బిజినెస్‌లో ఆమె అందాలని హైలైట్‌గా పెట్టాలనివుంది. ఈ ప్రయత్నంలో భాగంగా కొన్నాళ్ల క్రితం నేను విఫలమయ్యాను. నా బిజినెస్ మైండ్ విఫలమైనా నా వాంటెండ్‌మైండ్ సక్సెస్ కావాలని ఆరాటంగా వుంది. కానీ ఆమెను నా గ్రిప్‌లోకి తెచ్చుకునే ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు. నాలాంటి హైక్లాస్ కుర్రాళ్లు అలాంటివాళ్లపై ఓ చూపువిసిరినా చాలు గువ్వల్లా వచ్చి ఒళ్లో వాలుతారు అని ఇన్నాళ్లు చాలా సహజంగా భ్రమపడ్డాను నేను. కాని ఇది అబద్ధం అని ఆమెను చూశాక తెల్సింది. వాళ్లలో మానాభిమానాలువున్న స్త్రీలు ఉంటారని తొలిసారిగా అర్థమయింది. అందుకే ఆమె మీది నా కోరికను లైఫ్‌లాంగ్ ఇల్లీగల్ కాంటాక్ట్‌తో 'నిన్ను చూసుకుంటాను' అని ఆశచూపి అప్రయత్నంగా ఆమెతో చెప్పుకున్నాను. డబ్బుకంటే మానమే ముఖ్యం అనుకుంటున్నట్టుంది ఆమె బహుశా. సో నా కోరికను కాదనలేని స్థితిలో ఆలోచిస్తాను అంది. శీలంమీది గౌరవంలేని స్త్రీలు మాత్రమే ఆలోచిస్తాను అంటారు. ఇది నాకు తెలుసు. ఎందుకంటే ఆలోచించడమంటే కాసింత ఆలస్యంగా మనల్ని ఆక్సెప్ట్ చేయడం అని అర్థం. కానీ ఈమె ఆలోచన మామీది భయభక్తుల తోడిది. తమకు ఇష్టం లేకపోయినా పెద్దింటి వాళ్లం కాబట్టి మా కోరికను వాళ్లు మన్నించాలి. అయితే ఆమెతో నా కోరికల్ని

తీర్చుకున్న తర్వాత ఆమెను బ్లాక్‌మెయిల్ పేరుతో బెదిరిస్తూ క్రమంగా నా బ్లూఫిల్మ్ బిజినెస్ కూడా కొనసాగించాలని అవసరమైతే వచ్చే బిజినెస్ పార్టనర్స్‌కి ఆమెతో రాత్రుల్ని బుక్ చేయాలని, నా ఫర్‌దర్ ఐడియా. ఆమె ఒకసారి లొంగిపోతే మిగతావన్నీ ఈజీగా చక్కబడతాయని నాకు తెలుసు. కాగా ఎవరితో చెప్పుకోలేని నా అంతరంగాన్ని మీ ముందు ఇలా ఎందుకు చెప్పుకుంటున్నానో తెలుసా డాక్టర్.

ఎందుకంటే మీరు ఈ దేశంలోనే కాదు ప్రపంచవ్యాప్తంగా పేరున్న ద గ్రేట్ హిప్నో టైగర్! మీరు తలుచుకుంటే ఆమె మెదడును నాకు అనుగుణంగా ఆడించగలరు. నేను ఏం చెప్పినా అది చేస్తూ నేను ఏం చేసినా అది తప్పుకాదంటూ అంతా నాదైన లోకంలో మునిగిపోయి నేను ఆడించే ఒక అందమైన బొమ్మగా ఆమెను మలచగలరు. దయచేసి నన్ను, నా ఆరాటాన్ని అర్థం చేసుకుని మీరు నాకు సహకరిస్తానంటే మీకు ఎంత డబ్బయినా ఇచ్చుకుందుకు సిద్ధంగా వున్నాను. మీరు ఓకే అంటే నా వ్యాపారంలో మీకు ఒక భాగం కేటాయించగలను కూడా! నేను చెప్పుకోవాల్సింది అంతా వివరంగా చెప్పుకున్నాను. ఇక ఈ తర్వాత మీ ఇష్టం. నన్ను అవునంటే అదృష్టవంతులు. కాదంటే మీ దారి మీది నా దారి నాది.

థాంక్‌యూ!

ఉత్తరం ఆసాంతం చదివిన నా మనసు రెక్కలు తెగిపోతున్న పక్షిలా విలవిలలాడిపోయింది.

"రాక్షసుడా" మనసులో అనుకుంటూ వణుకుతున్న చేతుల్తో వుత్తరాన్ని ఎప్పటిస్థానంలో ఎప్పటిలా పెట్టేసి ఒక్కసారి గట్టిగా వూపిరి పీల్చుకున్నాను. అంతలో బయట నుండి పిలుస్తున్న పెదబాబు గొంతు అకస్మాత్తుగా నా చెవుల్ని తాకింది.

"వసుంధరా... వసుంధరా"

"ఆ బాబుగారు వస్తున్నాను" గబగబా వెళ్ళి తలుపుతీశాను.

"తలుపులేసుకున్నావేంటీ? " అదో కంగారుగా కనుబొమలు ముడిచి అడిగాడు.

"మరేంలేదు బాబుగారూ! ఈవాళ శుక్రవారం కదా! దేవుడి గదంతా దులపాలని దుమ్ము బయటకురాకుండా వుండేందుకు తలుపులేసుకున్నాను" మాటల్ని పేర్చుకున్నప్పటికీ సరైన సమాధానం చెప్పగలిగాను.

"ఏం వసుంధరా! రాత్రయితే దూరం అన్నావు. మరి ఈవాళ దేవుడి గది శుభ్రం చేశావేమిటి? " నన్ను సూటిగా చూస్తూ అడిగాడు తను.

"ఆ" నీళ్లు నమలడం తప్ప వెంటనే మరేం చేతకాలేదు నాకు.

"తప్పించుకునే ప్రయత్నమా? " అతడి నుండి అదే చూపు.

"అదికాదు బాబుగారూ" సర్ది చెప్పుకోబోయాను.

"ఇంకేం చెప్పొద్దు! కమాన్ ప్రొసీడ్" చివరి పదం పలికేప్పుడు అదోలా నవ్వాడు.

నేను వెంటనే స్తబ్దుగా మారిపోయాను. స్తబ్ధతలో కొన్ని క్షణాల కాలం నన్ను ఆలోచింపజేసిందో ఆవేశపరిచిందో లేక నేను తికమకపడిపోతున్నానో తెలియదుకాని ఆ తర్వాత క్షణం నెమ్మదిగా పెదవులు విప్పి "స్నానం చేసి వస్తాను బాబుగారూ" అదే స్తబ్దతతో చెప్పాను.

వెళ్లు అన్నట్టుగా చిరునవ్వుతోనే చెప్పాడు అతడు. నేను నెమ్మదిగా లోపలికి అడుగులు వేశాను. స్నానాలగది పని వాళ్లకోసం బయటకట్టించారు. కాని నాలో నేను లేనట్టుగా వున్నాను కాబట్టి లోపలికి నడిచాను. ఆ విషయం స్నానాలగది లోపలికి వెళ్లాక అర్థమై వెంటనే వెనుతిరిగి వచ్చేసాను. అప్పుడు పెదబాబు ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతున్నాడు. ఆ మాటలు నా గురించే అని తోచడంతో వెంటనే ఇవతల గుమ్మం దగ్గరే ఆగిపోయాను.

"అది కాదు డాక్టర్! ఇలాంటి విషయాల్ని

పత్రికల్లో బహిరంగంగా అడగరాదని నాకు తెలుసు! బట్ మీ వద్దకు డైరెక్టుగా రాలేక అలా రాశాను. ఎనీహౌ ఈ రోజు ఇవినింగే మిమ్మల్ని డైరెక్టుగా వచ్చి కలుస్తాను. అన్ని సంగతుల్ని ఈ ఫోన్లో వివరించలేను. ఇప్పుడు టూకీగా చెప్పానుకదా! ఈవినింగ్ వచ్చినప్పుడు నేను రాసి వుంచిన ఉత్తరం మీకు అందిస్తాను. చదివి నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించండి" అంటూ ఒక విధమైన ఉద్విగ్నతతో మాట్లాడుతూ పోయాడు పెదబాబు.

అందుకు అవతల్నుండి ఏం మాట్లాడారో గాని "అలాగే సర్! ఐతే జస్ట్ ఆఫన్నవర్‌లో వచ్చి కలుస్తాను" చెప్పి అప్పటికే రెడీ అయి వున్నాడు కాబట్టి గబగబా బయటకు నడిచాడు. ముందు జాగ్రత్తగా పక్కకు తప్పుకున్న నేను అతడు పూర్తిగా వెళ్లిపోగానే గుండె బరువు దిగినట్టుగా హాయిగా వూపిరిపీల్చుకుంటూ 'ఇప్పుడేం చేయాలి? ' మనసులోనే అనుకుంటూ బయటవైపుగా అడుగులు వేశాను. ఓ భయంకరమైన ఆలోచన తట్టింది.

"దే... వు... డా!"

నన్ను పసిగట్టడం కోసం దేవుడి గది శుభ్రం చేయమని తొందరపెట్టిన బాబుగారి సునిశితమైన ఆలోచనముందు నేను ఓడిపోయిన మాట వాస్తవం. మరి ఇప్పుడు నేను ఇంత భయంకరమైన పథకానికి సిద్ధమౌతున్నాను. బయల్పడితే బతకగలనా? అసలు నేనేంటి? సింహంపై దాడికి సిద్ధం కావడం ఏంటీ? సింహపుబోనులో బతకలేని చిట్టెలుక నిజాయితీగా బయటికి వచ్చేయాలి. అంతేకాని సింహాన్ని తన పళ్లతో కొరికి చంపేయబోతే పరిస్థితులు ఎలా వుంటాయి?

అతడిని ఎంతగా ప్రేమించానో అంతగా నన్ను వంచించాలనుకుంటున్నాడు. పేదవారికి మనసేలేదని భ్రమపడుతున్నాడు. చలువరాతి మేడల్లో నివసిస్తూ దిగువ స్థాయివాళ్లని దిగజారినవాళ్లుగా అపోహ పడుతున్నాడు. నన్ను, నా శీలాన్ని పవిత్రంగా అర్థం చేసుకున్నప్పటికీ అతడి వంచన ముందు నా జీవితం ప్రశ్నగా మిగిలిపోయి నన్నొక ఎండమావిని చేసి చూపిస్తోంది. కాటేసే కోరలు తనకున్నాయి. ముల్లును ముల్లుతోనే పెకలించాలి. తెలివిగా ఆ కోరల్ని కాదు ఆ మనిషినే సమాప్తం చేయాలి.

మూర్ఖత్వంతో నన్ను ప్రేమిస్తున్న వ్యక్తిని నిరాదరణకు గురిచేసి నిన్ను ప్రేమించాను. అదే లోకం అనుకున్నాను. అదే నా సర్వస్వం అనుకున్నాను. అందుకే నిన్నే తలంచాను. నీకై తపించాను. కానీ వద్దు ఇప్పుడు వద్దు. నీ ప్రేమ, నీ తోడు, నీ నీడ, నీబంధం ఇవేమీ నాకు కలలో కూడా వద్దు. నేను నేనే! నా కోసం ఎవరు పుట్టారో నేను ఎవరికోసం పుట్టానో అక్కడే నా జీవితం మొదలుకావాలి. ఇన్నాళ్లూ నేను మానసికంగా చేస్తూ వచ్చిన పాపానికి నా భర్త మీద నేను ఈ క్షణం నుండే పెంచుకున్న ఆత్మీయతానురాగాలు ఒక ప్రక్షాళన కావాలి. శీలం, సంస్కారం ఈ రెండింటినీ ప్రాణంగా భావించే సంప్రదాయమైన స్త్రీని నేను. ఇన్నాళ్లూ నేను అవివేకంగా పెంచుకున్న నీమీది ప్రేమతత్వం అంతా ఒక కల. పీడకల. దాన్ని నీవనే శిలముందు త్యజిస్తున్నాను. నన్ను నేను పునీతం చేసుకుంటున్నాను.

★ ★ ★

మధ్యాహ్నం కావచ్చింది. బయటికి వెళ్ళిన పెదబాబు అప్పటికి హడావిడిగా తిరిగివచ్చాడు.

"వెరీ నైస్" రాగానే నన్ను ఆపాదమస్తకం చూస్తూ మెచ్చుకోలుగా అన్నాడు.

నేను అందుకు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాను.

"కొత్త చీరా? " స్నానం చేశాక రోజువారీ చీరే కట్టుకున్నాను. అయినప్పటికీ నా చీరె

లపై తనకు అంతగా దృష్టిలేదు కాబట్టి బహుశా ఆసక్తిగా అడిగాడు.

"... " కాదన్నట్లుగా తల అడ్డంగా ఆడించాను.

"సర్లేగానీ, నేను స్నానం చేసి వస్తాను. బీ రెడీ" చెప్తూనే లోపలికి వెళ్ళిపోయాడు.

అతడి వాలకం చూస్తుంటే వెళ్ళిన డాక్టర్‌తో తనదైన ప్రయత్నానికి ఫలితం కనిపించినట్టుంది. తోడుగా ఉదయం నేను మాట్లాడిన మాట తనకు అనుకూలంగా వుంది. కాబట్టే ప్రపంచాన్ని జయించినట్టుగా చెప్పకనే తనలోని ఆరాటాన్ని తెలియచేస్తున్నాడు. నేనుమాత్రం తిన్నగా వున్నాను. అనుకున్న పనిని విజయవంతం చేసుకోవడంకోసం నాలో నేనే సిద్ధమవుతూ, నాకు నేనే ధైర్యం చెప్పుకుంటూ, క్షణాలను లెక్కపెడుతున్నాను.

"హాయ్..." కాసేపటి తర్వాత మృదువుగా వినబడింది అతడి గొంతు.

"ఆ..." తేరుకుంటూ చూశాను అతడి వైపు.

"ఏంటో ఆలోచిస్తున్నావు" తల స్నానం చేసి తల తుడ్చుకుంటూ నాకు సమీపంగా వచ్చాడు.

"ఏంలేదు బాబుగారూ" వినయంగా ఎప్పటిలా చెప్పాను.

"ఏం లేకపోతే పోనీలేగానీ, ఉదయం స్నానంచేసి వస్తానన్నావు" మెల్లగా అసలు విషయానికి వచ్చాడు.

"అదీ... అదీ బాబుగారూ. ఇప్పుడు వద్దు. రాత్రికి" తడబడుతూ, నన్ను నేను సర్దుకుంటూ, ఎలాగోలా ధైర్యం చేశాను.

"ఏ...? " ఎందుకన్నట్లుగా అన్నాడు.

"ఈ సమయంలో మీకోసం ఎవరుఫడితే వాళ్ళు వస్తుంటారు" చెప్పాను.

అందుకు అతడు ఫకాలున నవ్వి, "నాకు లేనిభయం నీకెందుకు? " అడిగాడు.

"మా విలువలు దిగజారినా ఫర్వాలేదు గానీ, మీ విలువలు పదిలంగా వుండాలి బాబుగారూ" ఎలాగైనాసరే అతడిని ఇప్పుడు వద్దనిపించాలనే ప్రయత్నంలో భాగంగా భారీగా గౌరవాన్ని ప్రదర్శించాను. అందుకు అతడు ఏదో అనబోయాడు. అంతలో టెలిఫోన్ మోగింది.

"ఇదొకటి" తనలో తనే అనుకుంటూ వెళ్ళి లిఫ్ట్ చేశాడు.

"ఆ ఫోన్ చేసింది ఎవరో? ఇక్కడికి సరాసరి వచ్చేసి వుంటే బాగుండును" అతడ్నే చూస్తూ మనసులో అనుకున్నాను.

"వచ్చేశావా" ఆ దేవుడు నా మొర ఆలకిస్తున్నాడో లేక నేను భ్రమపడుతున్నానో తెలియడంలేదుకానీ అతడి వదనం ఒక్కసారిగా ముడుచుకుపోయింది. తర్వాత అవతల్నుంచి ఏమన్నారో ఏమోగానీ, "తమ్ముళ్ళను ఒంటరిగా వదిలేసి, ఇక్కడికి చెప్పాపెట్టాకుండా వచ్చేయడమేనా? " కస్సుమన్నాడు.

ఆ మాటల్ని బట్టి మల్లేశం వచ్చేసినట్లుగా అనుమానం వచ్చింది. ఆ అనుమానానికే నా మనసు ఆకస్మికంగా సంతోషపడింది. ఈ సంతోషం అతడిపై నాకు ఆకస్మికంగా పెరిగిపోయిన అనురాగంతోటో లేక దిక్కుతోచని నాకంటూ ఇప్పుడు ఒక మనిషి తోడుగా వస్తున్నాడు అనే భరోసాతోటో నాకే ఇతమిద్ధంగా అర్థంకాలేదు. ఏది ఏమైనప్పటికీ నా మనసు నాకు తెలియకుండా కొంత కుదుటపడింది.

"వసుంధరా" పెదబాబుగారి గొంతు కాసింత కఠినంగానే విన్పించింది.

"బాబుగార్రూ" ఉలిక్కిపడ్డాను.

"మల్లేశం ఎందుకు వస్తున్నాడు? " నిలదీసినట్లుగా అడిగాడు.

"ఏమో బాబుగారూ" భయంగా చెప్పాను.

"ఉత్తరంగానీ రాశావా? " అతడిలో అదే గద్దింపు.

"లేదు బాబుగారూ" నాలోనూ అదే భయం.

"ఎధవ! అక్కడ తమ్ముళ్ళు ఎక్స్‌కర్షన్ కోసం ఎక్కడికో వెళ్లారట. నెలరోజువరకూ

తిరిగి రారుట. అందుకే ఈ పెద్దమనిషి ఇక్కడికి వచ్చేశాడుట." మల్లేశాన్ని చిరుబురులాడి "అయినా తమ్ముళ్ళకైనా వుండొద్దు. టూర్‌మోజులో కనీసం ఫోన్ కూడా చేయలేదు" తమ్ముళ్ళపై గుణిగాడు.

నేను మౌనంగా నిలబడిపోయాను.

"తమరి దొరగారు ఇంకో అరగంటలో ఇంటికి వచ్చేస్తున్నారు" వేళాకోళంగా చెప్పి, ఆ వెంటనే అక్కడ్నుంచి కోపంగా పెద్దపెద్ద అంగలేసుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు పెదబాబు.

చూస్తుండగానే కాలం ముందుకు పరుగెట్టింది. మల్లేశం వచ్చేశాడు. రాగానే చిరునవ్వుతో తన చేతిలోని వస్తువుల తాలూకు సంచిని నా చేతికిచ్చాడు.

అతడు, అతడి ముఖంలోని అమాయకత్వం, అతడి తీరులో ఎంతమాత్రం చెదరని మంచితనం... ఆ కళ్ళల్లో ఇంకని ప్రేమతత్వం... ఆ పలకరింపులో చెదరని అనురాగపుతత్వం... నన్నూ, నా మనసును ఒక్కసారిగా స్పందింపచేశాయి. అతడనే ప్రేమవనంలో స్తబ్ధుగా వున్న నేననే అనుబంధాన్ని ఒక్కసారిగా మేల్కొల్పాయి. ఇంతసేపు దూరంగావున్నా అతడు దగ్గరగా రాగానే నా మనసు మారిపోవచ్చని భయపడ్డాను. పెదబాబును అసహ్యించుకున్నప్పటికీ ఇతడిని ప్రేమించలేనేమోనని ఏ మూలనో సంకోచపడ్డాను. కానీ అతడి చిరునవ్వుకి ప్రతిగా నా కళ్ళల్లో కనిపించిన కన్నీటిధార ఉబికినప్పుడే నేను పూర్తిగా మారిపోయానని నాకు అర్థమైంది.

కల్మషం లేకుండా అతడు కనబర్చిన ఆప్యాయతా, నేను కాదంటున్నప్పటికీ అతడిలో తగ్గని అభిమానపు సంపద, నాకు దగ్గర కావాలని, నన్ను మనసున్న మనిషిగా చూడాలని అతడు ప్రతిసారీ వహిస్తూ వచ్చిన ఓపిక, పెళ్ళాం అనే అధికారం ఉన్నప్పటికీ శారీరక సుఖంకోసం అతడు ఏనాడూ బలవంతం చేయకుండా కేవలం నన్ను తన మనిషిగా చూసుకోవడంకోసం నిండుగా ప్రవర్తించిన అతడి తీరు... అంతా అంతా ఒక్కొక్కటిగా గుర్తుకు వస్తుంటే అతడిమీద అన్నాళ్ళ నా అలసత్వానికి నా అంతరంగం నిలువెత్తున కుంగిపోసాగింది. కాబట్టే నాకు తెలియకుండానే అతడి చేయిని బిగ్గరగా పట్టుకున్నాను.

నాకు చేసంచిని అందించి, తర్వాత అక్కడ్నుంచి వెళ్ళబోయిన అతగాడు, ఊహించని పరిణామానికి ఒక్కసారిగా ఆగిపోతూ నావైపు చిత్రంగా చూశాడు.

"మనం ఇక్కడ్నుంచి ఎక్కడికైనా వెళ్ళిపోదాం" అతడి చేయిని అలాగే పట్టుకుని లోగొంతుకతో అన్నాను.

ఏ ఉపోద్ఘాతం లేకుండా ఏ ఉరుమూ మెరుపూ లేకుండా... ఆకస్మికంగా ప్రకటించబడిన ఘటనలా... క్షణాల్లో వరదల్ని ముంచెత్తిన జడివానలా నానుండి వెలువడిన మాట మల్లేశాన్ని విస్మయపరచింది. అందుకే అతడు నావైపు అదో రకంగా అర్థంకానట్టుగా చూశాడు.

అంతలోనే పెదబాబు వస్తున్నట్టుగా మెట్లవైపునుండి బూట్ల శబ్దం వినిపించింది. ఇద్దరం చప్పున చేతుల్ని వదిలేస్తూ దూరం జరిగాం.

"ఆ... ఏం మల్లేశం? " రాగానే ముఖమంతా దగ్గరగా కుదించుకుని నిర్లక్ష్యంగా అన్నాడు. అది పలకరింపా? గద్దింపా? ఎటూ అర్థంకాని తీరులో వుంది.

"బాబుగారూ..." వినయంగా చేతులు జోడించి, దగ్గరగా ఒదిగి నిల్చున్నాడు మల్లేశం.

"చెప్పా పెట్టేయకుండా వచ్చేయడమేనా? ఫోన్‌చేసి రావచ్చుకదా" అదే నిర్లక్ష్యంతో అడిగాడు పెదబాబు.

"చిన్నబ్బాయిగార్లు నన్ను రైలెక్కించి, తమరే ఫోన్‌చేసి చెప్తామన్నారు" కాసింత బెరుగ్గా మాట్లాడాడు మల్లేశం. అదే నాకు నచ్చదు. కానీ నా బతుకు స్థానం అక్కడ

వుంది. ఇన్నాళ్ళూ నా స్థానానికి బాధపడ్డాను. ఇప్పుడు ఆ స్థానంలో వున్నంత మాత్రాన అంత బానిసత్వం మాకెందుకు అని బాధపడుతున్నాను.

"ఆ... మినిస్టర్లకు పని ఎక్కువై మర్చిపోయారు" తమ్ముళ్ళని సైతం విసుక్కుని "ఇప్పుడేనా రావడం?" మల్లేశాన్ని కనుబొమలు ఎగరేస్తూ చూశాడు.

"ఇప్పుడే వస్తున్నాను బాబుగారూ" చెప్పాడు మల్లేశం.

"అయితే నువ్వెళ్ళి ఫ్రెషప్ అయ్యి, భోంచేయ్. తర్వాత ఏం చేయాలో నేను చెప్తాను", అని మల్లేశానికి చెప్పి, "ఆ... అమ్మా! నువ్వెళ్లి పైన డాబా శుభ్రంచేయి. రేపు మా ఫ్రెండ్స్‌తో కలిసి అక్కడ పార్టీ ఏర్పాటు చేసుకోవాలి" నాతో చెప్పాడు.

"నంగనాచి వెధవా" మనసులోనే తిట్టుకుని ఆ వెంటనే డాబాను శుభ్రంచేసేందుకు ముందుకు నడిచాను. మల్లేశం మేం వుండే ఇంటివైపు నడిచాడు.

నేను డాబామీంచి వచ్చేసరికి మల్లేశంతో, "ఎంతోదూరం ప్రయాణం చేసి వచ్చావు కదా. నీకు బాగా రెస్ట్ అవసరం. పో... ఈ రాత్రికి నీవు మన గెస్ట్‌హౌస్ దగ్గరకి వెళ్ళి హాయిగా పడుకో" చెప్తున్నాడు పెదబాబు.

"బాబుగారూ" కలిసిరాని కాలాన్ని కలిసి వచ్చేలా మలుచుకుంటున్న అతడి తెలివితేటలకు నాలో నేనే మండిపోయాను. అయినా మిన్నకుండిపోయాను.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది. అప్పటివరకూ మమ్మల్ని మాట్లాడనివ్వకుండా పరిస్థితుల్ని సృష్టించిన బాబుగారు, తనలో తను ఏం సాధిస్తున్నాను అనుకుంటున్నాడో నేనూహించగలను. కానీ విచిత్రంగా ప్రవర్తిస్తున్న అతగాడి తీరును చూస్తూ, "ఏనాడూ లేనిది బాబుగారు ఏంటి ఇలా ప్రవర్తిస్తున్నాడు? ఆమె ఎందుకు అలా మాట్లాడింది?" అనే భావాల్ని తన కళ్ళలోనే ఒలికిస్తున్న మల్లేశం సందేహాలకి నివృత్తి ఎలా చేయాలనేది నాకు తోచడంలేదు. అయినా మల్లేశం అమాయకుడు, అసహాయుడు. తన పెళ్ళాన్ని తన దొర మరో దృష్టితో చూస్తున్నాడంటే ఎదిరించి నిలబడలేడు. కానీ దొంగచాటుగా నన్ను తీసుకుని పారిపోగలడు. ఇదిమాత్రం నాకు తెలుసు. కానీ ఏం చేయను? నా పరిస్థితి అతడికి ఎలా వివరించను? అతడు బాగా తెలివిగలవాడైతే పరిస్థితి ఊహించుకోగలడు. కానీ అంత తెలివితేటలు తనలో వున్నాయని కూడా నేను అనుకోలేను.

ఆందోళన... అర్థంకాని తనం... రెండింటిమధ్య సతమతమౌతూ, తన యజమాని మీది గౌరవంతో భయంతో కనీసం వెళ్లేప్పుడు కూడా నావైపు చూడకుండా అక్కట్నుండి మరికాసేపటి తర్వాత బయలుదేరి వెళ్లాడు మల్లేశం!

అతడు వెళ్లిపోయాక నేనూ బాబుగారే మిగిలిపోయాం! ఆ ఒంటరి వాతావరణం అలవాటయినదే అయినా కొత్తగా భయపెడుతోంది. అతడి చూపులు కామంతో నన్ను గుచ్చడం క్రమంగా ఆరంభించాయి. నేను మళ్ళీ మొదటి నిర్ణయానికే వచ్చేశాను. ముఖ్యంగా మల్లేశం వస్తున్నాడనగానే నాలోని పథకానికి తెరపడిందని భావించాను. కాని ఇప్పుడు ఆ తెరను ఎత్తేశాను. అసలు నా నొసటి రాత ఎందుకిలావుందో ఏమోగాని, ఒకవేళ మల్లేశం ఈ కొన్నాళ్లూ ఎక్కడికీ వెళ్లకుండా ఇక్కడే నా దగ్గరే వుండిపోతే గనుక అతడి భార్యగా నా జీవితం ధన్యమయ్యేది! ఆ తర్వాత మళ్ళీ మొదటికొచ్చే బాబుగారిని అనుకున్నట్టుగా మట్టుపెట్టడం జరిగేది. కాని తాళికట్టినవాడికి సంపూర్ణంగా ఆలిని కాకమునుపే నా జీవితం చీకటి పరదాను తాకబోతోంది! అవును! నా పథకాన్ని అమలుపరచడమంటే... ఆ తర్వాత నేను కటకటాలు లెక్కించడమో ఈ ప్రపంచాన్నే

వదలడమో... ఖచ్చితంగా జరుగుతాయి!

"వసుంధరా" దగ్గరగా వచ్చి మత్తుగా పిలిచాడు అతడు.

ఆలోచనలోపడి అతడు దగ్గరకి వచ్చింది కూడా చూసుకోలేకపోయిన నేను, "బాబుగారూ" ఉలిక్కిపాటుగా చూశాను.

"మనిద్దరమే వున్నాం" తెలిసిన విషయాన్ని గుర్తుచేశాడు.

"ఆ..." తెలుసు అన్నట్లుగా అన్నాను.

"కమాన్ ప్రొసీడ్..." చప్పున చేయి పట్టుకున్నాడు.

"ఇ...క్క...డ వద్దు! మేము వుండే గదికి రం...డి..." చెప్పకనే చెప్పాను.

"ఎందుకు? " అదోలా అడిగాడు అతడు.

"మీలాంటి పెద్దవాళ్లు వుండే గదుల్లో... మాలాంటి వాళ్లు" ఆయాసం లాంటిది పొరలుపొరలుగా అంతరంగాన్ని చుట్టుముట్టేస్తుంటే మాటను పూర్తిచేయలేకపోయాను.

"ఓ... యూ ఆర్ ఎ సెంటిమెంటల్ ఫూల్" అంటూ చిన్నగా నవ్వి "ఎక్కడైనా ఫరవాలేదు" భుజాల్ని ఎగరవేసుకుంటూ అన్నాడు.

"రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో వచ్చేయండి" అతి ప్రయాసగా చెప్పి అక్కడ్నుండి వెళ్లబోయాను. కాని అతడు నా చేయిని చప్పున బిగించి పట్టుకున్నాడు. వెంటనే నేను అతడివైపు చూశాను. "అంత సమయం వృథాచేయడం ఎందుకు? " అన్నట్టుగా వున్నాయి అతడి చూపులు.

"మీకోసం రాత్రి పదిగంటల వరకు ఎవరెవరో వస్తుంటారు" చూపులు తిప్పుకుని చెప్పాను. ఈ చెప్పడంలోనూ ప్రయాస వుంది.

"నా గురించి నాకంటే నీకే బాగా జాగ్రత్తవుందే" అంటూ నా చేయి వదిలేసి "అంత సమయం వరకు నేను వెయిట్ చేయలేను. సో వన్ ఆర్ టూ ఫోన్‌కాల్స్ చేసుకుని, ఇక్కడికి ఇక ఇంకెవ్వరూ రాకుండా చేసేసి, జస్ట్ ఆఫన్నవర్‌లో వచ్చేస్తాను. వెళ్లు" చెప్పాడు.

నేను ఇంకొక్కక్షణం కూడా అక్కడ నిల్చోకుండా గదికి వచ్చేశాను. రాగానే ఎంత మాత్రం ఆలస్యం చేయకుండా, వస్తువుల చాటున ఓ పక్కగా పెట్టబడివున్న పొడవైన బలమైన రోకలిబండను నా పథకాన్ని అమలుపరచడం కోసం సిద్ధంగా వుంచుకున్నాను. అనుకున్న పని పూర్తిచేయడానికి నన్ను నేను కూడా సంపూర్ణంగా సిద్ధపరుచుకున్నాను.

అడుగుల చప్పుడు వినిపించింది.

రోకలిబండను బిగించి పట్టిన నా చేతులు ఇంకాసేపటిలో ఫెళ్లున పగిలే భూమిలా విపరీతంగా కంపిస్తుంటే, నా మనసు అలజడి సంద్రమై ఎగిసెగసిపడుతోంది.

నేను తలుపు తీసిన వెంబడే తను గబుక్కున లోపలికి వచ్చేశాడు. పరుచుకున్న చీకటిలో ఆ సంగతి స్పష్టమౌతోంది. అయితే నేను వున్న పరిస్థితిలో నా వునికిని చూసి నేనే భయపడుతున్నాను కాబట్టి లోపలికి వచ్చిన పెదబాబు వైపు తేరిపార చూడలేదు. తను అలా లోపలికి వచ్చినట్లుగా తెలిసీ తెలియగానే, నా చేతుల్లోని రోకలిబండను విసురుగా పైకెత్తడం, బలంగా అతడి తలపై కొట్టడం, అంతా క్షణాల్లో జరిగిపోయింది.

అంతే!

నా శరీరం ఎంత బలాన్ని ప్రయోగించిందో, అంతకు రెట్టింపుగా బిగ్గరగా అరుస్తూ అతడి శరీరం క్షణాల వ్యవధిలో కిందపడిపోయింది. అప్పటికి నేను చేసింది ఏమిటో నేనే జీర్ణించుకోలేకపోతూ... నిలువెత్తున కకావికలమై పోతూ... "భగవంతుడా" బిగ్గరగా అరుస్తూ పెద్దగా ఏడవసాగాను.

"వ...సుం...ధ...రా..." కింద పడిన శరీరం నన్ను అస్పష్టంగా పిలవడం, ఆ ఏడుపులోనూ నేను గ్రహించగలిగాను. అయితే అది పెదబాబు గొంతు కాదని కూడా అదే సమయంలో నాకు తెలిసింది. ఇది బలపరుస్తున్నట్టుగా అదే సమయంలో

# రోబోకాప్

## సచిత్ర విచిత్రం







ఇజాయిల్ ప్రభుత్వం ఈమధ్య రిమోట్‌కంట్రోల్ రోబోట్‌ని రూపొందించింది. ఆత్మాహుతి దళాన్ని నిరోధించడానికి ఈ రోబోట్ ఎంతగానో వినియోగపడుతుంది. ఆ దళానికి చెందిన వ్యక్తి తాను శరీరానికి చుట్టుకున్న బాంబు పొరపాటున పేల నందున రోడ్డుమీద పడిపోవడాన్ని మీరు చూస్తున్నారు కదా! వెంటనే ఆ ప్రదేశమంతా రాకపోకలు నిలిపి వెయ్యబడతాయి.

ఒక పోలీసురోబోట్ వెళ్లి, ఆ టెర్రరిస్ట్‌ను క్షుణ్ణంగా పరీక్షిస్తుంది. ఆ వ్యక్తి దుస్తులు చింపివేస్తుంది. బాంబులు ఆ దుస్తులచాటున ఉన్నవీ లేనివీ గమనిస్తుంది. తన బలమైన చేతులతో ఆ టెర్రరిస్ట్‌ని ఎటూ కదలకుండా పట్టి ఉంచుతుంది.

ఆ తర్వాత శరీరమంతా అనేక రక్షణ కవచాలు చుట్టుకున్న బాంబ్ డిస్పోజల్ ఎక్స్‌పర్ట్ ఆ ప్రదేశానికి వెళ్లి క్షుణ్ణంగా ఆ టెర్రరిస్ట్‌ని గాలించి చూస్తాడు. ఏమైనా బాంబులు కనిపిస్తే వాటిని తొలగించి అతణ్ణి అంబులెన్స్‌లో హాస్పిటల్‌కి పంపి అటుపైన విచారణ ప్రారంభిస్తారు.



పెదబాబు ఇంటిముందు లైటు వెలిగింది.

"ఏం జరిగింది?" నాకేం అర్థంకాలేదు. చప్పున నా వెనక గోడకు వున్న లైటువేశాను.

నేను కొట్టిన దెబ్బకు తల పగిలి, అంతా రక్తసిక్తమై, మరణపు అంచున నిలబడిన మహా ప్రేమయోగిలా ఆ రక్తపు మడుగులో నా... మల్లేశం... బాధతో విలవిలలాడుతూ ఉంగలుచుట్టుకుపోతూ కనిపించాడు.

"హా..." నన్ను నేను నమ్మలేకపోయాను. తప్పుచేశాననే భావన నన్ను కలిచివేస్తుంటే తల బాదుకుంటూ అక్కడే కూలబడిపోయాను.

"నీ... వు... చెప్పిన మా...ట... నాకు... అనుమానం... కల్గిం...చిం...ది. అందుకే... ఏ సంగతి తెల్సుకుని... నిన్ను ఈ రాత్రికే తీ...సు...కు...వె...ళ్దా...మ...ని... బంగళాకు వెళ్లకుండానే తి...రి...గి...వ... చ్చే. శా...ను" దీనంగా దైన్యంగా శక్తిని కూడదీసుకుంటూ అతడు మాట్లాడగానే నా గుండెలు మరోసారి భళ్లున పగిలాయి.

"అయ్యో నాకోసం... నాకోసం... నీ యజమానిని వదులుకోడానికి సిద్ధమయ్యావా? నేనెంత పాపం చేశాను?" ఏడుస్తూ అతడి మీదకు అలాగే వాలి బిగ్గరగా పట్టుకున్నాను.

తర్వాత అతడు ఇంకేం మాట్లాడలేదు. "అ...మ్మా... అమ్మా" మెలిపెడుతున్న ప్రాణంమీది తీపితో ఆయాసపడుతూ గింజుకుంటున్నాడు.

నేను ఇంకేమాత్రం ఆలస్యం చేయదలుచుకోలేదు. వెంటనే అతడిని ఆసుపత్రికి తీసుకువెళ్లే ప్రయత్నంగా, ఒకవైపు మల్లేశాన్ని లేవదీస్తూనే మరోవైపు పెదబాబుకోసం ఆ ఇంటివైపు తిరిగిచూశాను.

ఎప్పుడొచ్చాడో! బహుశా లైటు వెలిగినప్పుడే ఇక్కడికి వచ్చేసి వుంటాడేమో? నన్నూ...మల్లేశాన్ని... ఏమీ పట్టనట్లుగా నింపాదిగా చూస్తూ చేతులుకట్టుకుని గుమ్మానికి ఆవల నిలబడివున్నాడు పెదబాబు.

అతడి వాలకం చూస్తుంటే నా కుట్ర తనకు అర్థమైపోయినట్టుగా తెలుస్తోంది. అయినప్పటికీ దీనంగా రోదిస్తూ "బాబుగారూ... మల్లేశాన్ని బతికించండి. మీ కాళ్లు పట్టుకుంటాను" ఆసుపత్రికి తీసుకువెళ్లండనే ఉద్దేశ్యంగా అభ్యర్థించాను.

అందుకు అతడు ఫకాలున నవ్వి "నీవు తవ్వుకున్న గోతిలో నువ్వే పడిపోయావు? స్టుపిడ్! ఎంత అందంగా నన్ను నమ్మించి మోసం చేయాలనుకున్నావే? నిన్ను కాదు కదా, ఇన్నాళ్లూ నా ఇంటిముందు విశ్వాసంతో పనిచేసిన ఈ మల్లేశంగాడిని గూడా క్షమించను! వీడు కూడా నిన్ను తీసుకెళ్ళి చివరిగా నన్నే మోసం చేయాలనుకున్నాడు కదా! వెరీగుడ్! ఆదర్శదంపతులు" వెకిలిగా వెక్కిరింతగా అంటూ విలాసంగా సిగరెట్టు వెలిగించుకున్నాడు.

అది చూస్తూ నాలో ఆవేశం కట్టలు తెంచుకుంది. అయినప్పటికీ ఆ స్థితిలోనూ సంయమనం పాటిస్తూ "మీ కాళ్ళు పట్టుకుంటాను బాబుగారూ" అంటూనే పరుగున వెళ్లి అతడి కాళ్లను బిగ్గరగా పట్టుకున్నాను. కాని అతడిలో చలనంలేదు. అక్కడ జరిగింది ఏదో పట్టింపుకురాని విషయం అన్నట్టుగా ప్రవర్తిస్తూ సెల్‌ఫోన్ తీసి ఎవ్వరితోనో నవ్వుతూ మాట్లాడసాగాడు.. నేను మాత్రం అలాగే ప్రాధేయపడుతూ, ఏడుస్తూ, అతడి మనసు కరిగించే ప్రయత్నం చేశాడు. దాదాపు పదిహేను నిమిషాలు నడిచిపోయినా పెదబాబులో మార్పు కనబడలేదు. దీంతో ఇక అతడ్ని ప్రాధేయపడి లాభంలేదనుకుంటూ, ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా చప్పున అక్కడ్నుంచి మల్లేశంవైపు కదిలాను.

కానీ... భ్రమపడుతూ నేను చేసిన పొరపాటుకు తను మృత్యుగుహలోకి జారబడి, ఆ తర్వాత పెదబాబును ప్రాధేయపడుతూ

నేను చేసిన ఆలస్యానికి ఆ గుహలోనే చిక్కుకుపోయి, నన్ను మరిచి తనని మరిచి ఈ లోకాన్ని మరిచి మరోజన్మకోసం మౌనంగా వెళ్ళిపోయిన మహామహర్షిలా అతడు జీవనవిముక్తుడై నిర్జీవావస్థలో కాంతిహీనమైపోయిన కళ్లని అలాగే నిశ్చలంగా తెరిచివుంచుకుని కనిపించాడు.

అతడి మరణం నా గుండెను కాల్చివేసింది. నా చైతన్యాన్ని మూగపరిచింది. అందుకే కాబోలు అతడ్ని ఆ స్థితిలో చూస్తూ ఒక్కసారిగా కొయ్యబారిపోయాను. కళ్ళింత చేసి వాస్తవాన్ని కలలోలా చూస్తూ శిలాప్రతిమనై పోయాను. జరిగిన ఘటనకు కన్నీరే స్తంభించిపోయిందేమో బహుశా... అందాకా గొల్లుమని రోదించిన నా నోరు, అందుకు తోడైన కన్నీరు, ఇప్పుడు స్తబ్ధతలో కూరుకుపోయి అంతా శూన్యాన్ని కనబరుస్తుంటే నాకు తెలీకుండానే నేను అలా అలా క్రమంగా కిందకి కుప్పకూలిపోయాను! ఆ తర్వాత ఇంకేం జరిగిందో కొన్నాళ్ళవరకు నాకేం అర్థంకాలేదు.



"వాస్తవాన్ని ఈ ప్రపంచానికి చెప్పే ప్రయత్నం చేయలేదా మీరు? " వసుంధర రాసిన కథ అంతా చదివాక, కనుబొమ్మలు ముడిచి ప్రశ్నించింది జర్నలిస్ట్ ప్రత్యూష.

"చేశాను! కాని నన్ను ఎవ్వరూ నమ్మలేదు. సింహం ఆవులించినా గాండ్రించిందని భ్రమపడే ఈ లోకం, పెద్దవాళ్లకు సహకరిస్తుంది కాని నాలాంటివాళ్లను ఎందుకు అర్థంచేసుకుంటుంది? " తన సమాధానాన్ని ప్రశ్నగా మాట్లాడింది వసుంధర.

"అంటే? ఈలోకం పాపిష్టిది అనుకుంటున్నావా? " అడిగింది ప్రత్యూష.

"అంతే కదా మరి!? " అంది వసుంధర.

"పొరపడొద్దండి! ఎందుకంటే అర్థంచేసుకుని ఆదరించేవాళ్లు చాలామంది వుంటారు. ఈ మీ కథని మా పత్రికలో పబ్లిష్‌చేసుకున్న తర్వాత వచ్చే రెస్పాన్స్ మీకే వాస్తవాన్ని కళ్లకుకట్టినట్టుగా తెలియజేస్తుంది" అంది ప్రత్యూష.

అందుకు చిన్నగా నవ్వింది వసుంధర.

"నవ్వుతున్నారు! అంటే నా మాటపై నమ్మకం లేదా? ఈ లోకంపై నమ్మకం లేదా? " ప్రశ్నించింది ప్రత్యూష.

రెండింటిపై" చెప్పింది వసుంధర.

"అదేంటి? " కనుబొమ్మలు ముడిచింది ప్రత్యూష.

అందుకు కాసేపు మౌనం వహించి, ఆ తర్వాత ప్రత్యూషవైపు సూటిగా చూస్తూ "నేను వేరు, నా జీవితం వేరు, నా పరిస్థితులు వేరు! కాని ఏ సానుభూతినో ఈ లోకంనుండి ఆశిస్తూ నా గురించి నేను ఓ అందమైన కట్టుకథను రాశాను అని, ఈ కథ ప్రచురింపబడ్డాక మరొక అపవాదు నామీదకు రావడం ఖాయం! ఒకవేళ రాలేని పరిస్థితి వున్నా వచ్చేట్టుగా చేస్తుంది ఆ కుటుంబం! అవును మేడమ్! నాకు తెలిసి దొరబాబు చాలామంచి వ్యక్తి! కానీ కొడుకును గట్టెక్కించడం కోసం తను

స్వార్థపరుడిగా మారిపోతాడు! మొదటి నుండి నాది అపవాదుల జీవితం కాబట్టి నన్ను ఆ దొరబాబే కాదు, నాదైన ప్రపంచంలో నన్ను ఎవ్వరూ నమ్మలేరు. ఒకవేళ నాది అపవాదుల జీవితం కాకపోయినా, మంచివాడుగా నమ్ముతున్న ఆ దొరబాబు నన్ను ఎట్టి పరిస్థితుల్లోనూ రక్షించే ప్రయత్నం చేయకపోయేవాడని, కొడుకు క్షేమానికై ప్రయత్నించేవాడని నేను అనుకుంటున్నాను. ఏది ఏమైనప్పటికి ఆ పెదబాబు... అదే నేను మనసు పడ్డ ఆ ధీరేంద్ర... లోకం దృష్టిలో ఇప్పుడూ ఎప్పుడూ మరెప్పుడూ నిరపరాధి! నేను మాత్రం జన్మజన్మలకి అపరాధిని! అవును... నేను అపరాధిని! కాలం వెక్కిరిస్తూ అదృష్టం వికటిస్తూ... పరిస్థితులు కాటేస్తూ జీవితం ఛిద్రమౌతుంటే, చీకట్లను అనుసరించిన అమాయకురాలిని! అసహాయురాలిని" అంటూనే ఇక తట్టుకోలేనట్టుగా వెక్కివెక్కి ఏడవసాగింది వసుంధర.

అందాక నిర్లిప్తంగా వున్న ఆమెనుండి ఒక్కసారిగా కన్నీరు ఉప్పెనగా రాగానే కలవరపడిపోయిన ప్రత్యూష "ఏడవొద్దండి! కూల్ డౌన్" ఓదార్పుగా ఆమె భుజంపై చేయివేసింది.

"నేను పెదబాబుని ప్రేమించాను కాని, అతడితో అక్రమసుఖంకోసం నేను ఏనాడూ ధైర్యంచేయలేదు. విలువల పరిధిలో నిలబడే అంతా ఆలోచించాను. కాని ఈలోకం నా గురించి ఎంత హీనంగా, ఘోరంగా భ్రమపడుతోందో తెలుసా? " అంటూ కళ్లనీళ్లు తుడ్చుకుని "పెదబాబు మీద మోజుతో వ్యామోహంతో కోరికతో మొగుడ్ని చంపుకున్నానని, నా అంతట నేను అతడితో అక్రమసంబంధం పెట్టుకోజూశానని, కాని విలువలకి గౌరవం ఇచ్చే పెదబాబు నన్ను అదుపులో వుండమని చెప్పాడని, తప్పుడు పనులు చేయడం తను సహించడు కాబట్టి నన్ను హెచ్చరించాడని, దీంతో మదమెక్కిన నేను నా భర్తను అడ్డుతొలగించుకుంటే పెదబాబు కాకపోయినా ఇంకెవడితోనైనా హాయిగా కులకవచ్చని అంత ఘోరానికి పాల్పడ్డానని, ఎన్నెన్ని మాటలు? ఎన్నెన్ని అపవాదులు? " అంటూ మళ్ళీ ఏడవసాగింది వసుంధర.

"ప్లీజ్! ఏడ్వొద్దండి! మీకు తప్పకుండా మేలు జరుగుతుంది! ఈ మనుషులు కాకపోయినా ఆ కాలం ఆ దేవుడు... మిమ్మల్ని ఏదో ఒకరోజు తప్పకుండా అర్థంచేసుకోవడం జరుగుతుంది" ఆమె రెండు భుజాలపై తన రెండు చేతుల్ని వేసి ఆమెను ధైర్యపరిచే యత్నం చేసింది ప్రత్యూష.

"నాకు మంచి జరుగుతుందో జరగదో నాకు తెలీదు! మంచి జరగాలని కూడా నేనిప్పుడు అనుకోవడంలేదు. కాని నాలో ఒకేఒక్క కోరిక మిగిలిపోయివుంది. దాన్ని నేను ఈ జీవితం చివరివరకు ఎప్పుడో ఒకప్పుడు నెరవేర్చుకోవాలి! ఆ తర్వాతే నా జీవితాన్ని ముగించుకోవాలి! కాసింత ఆవేశంగా అంటూ తన భుజాలమీది ఆమె చేతుల్ని తన చేతులతో బిగ్గరగా కప్పింది వసుంధర.

"అదేంటి? " ఆసక్తిగా చూసింది ప్రత్యూష.

"అది మీ పత్రికకుగాని, ఆ తర్వాత ఈ లోకానికిగాని, తెలియాల్సిన బహిరంగమైన విషయంకాదు. ఈ విషయమై నన్ను రహస్యంగా వుండనీయండి" అంది వసుంధర.

"నో! నేను తెల్సుకోవాలి! నీవు చెప్పే విషయం మనిద్దరికి మధ్య వుంటుంది. చెప్పండి ప్లీజ్" ఆమె గదవ పుచ్చుకుంది ప్రత్యూష.

"పె...ద...బా...బు...ను...
చం...పే...యా...లి...? "

# చతుర కతలు

## ట్రిబుల్ బెనిఫిట్

ఆఫీసులో పెండింగ్ వర్కుతో కుస్తీలు పడుతున్న వెంకట్ మీదకి ఒక లేఖాస్త్రం రయ్...ని దూసుకువచ్చింది. ఒక్కసారిగా తుళ్ళిపడ్డాడు. అసలే బాస్‌తో మెదడు వాచిపోయేలా చివాట్లు తిని వున్నాడేమో, ఫ్యాన్ గాలికి పేపర్ కాసింత ఎగిరిపడినా, గుండుపిన్ను జారిపడినా తెగ జడుసుకుంటున్నాడు.

ఆ లేఖాస్త్రం అతని ఊహకందని దివ్యాస్త్రం కాదు. అయితే అది తనపాలిట పాశుపతాస్త్రం కాకుండా ఉంటే బాగుండునని ముక్కోటి దేవతలకు మొక్కుకొని ఉత్తరం తెరిచాడు.

"ఒరేయ్, అప్పడూ!" ఆ సంబోధనతో వెంకట్ ముఖం కుంకుడురసం తాగిన వాడి ముఖంలా తయారైంది. (వెంకట్ అసలు పేరు వెంకటప్పడులెండి). వచ్చే




నెల్లో ముహూర్తాలకి నువ్వు పెళ్ళి కుదుర్చుకోకపోతే మన పాలేరు కూతురు అప్పమ్మని నీకు ఖచ్చితంగా కట్టబెట్టేస్తానంటూ జార్జి బుష్ సద్దాంకిచ్చే అల్టిమేటమ్ లెవెల్లో హెచ్చరిక జారీ చేశాడు. కాబట్టి రేపాది వారం ఏర్పాటుచేసే పెళ్ళిచూపులకి రా" అన్నది తండ్రినుంచి వచ్చిన ఆ లేఖ

సారాంశం. వెంకట్ ఊపిరితిత్తులనిండా ఊపిరి బిగపట్టి నెమ్మదిగా వదులుతూ రిలాక్స్ కావడానికి ప్రయత్నిస్తున్నాడు.

గత పదేళ్ళుగా యథాశక్తిన వధువుల సహనాన్ని పరీక్షిస్తూనే ఉన్నాడు వెంకట్ ప్రాంతీయ భేదం లేకుండా ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమ... ఏ ఒక్కప్రాంతాన్ని వదిలిపెట్టిన పాపాన పోలేదు. కళ్ళను టెలిస్కోపు మాదిరి మార్చేసుకుని అణువణువునా గాలిస్తూనే వున్నాడు. అతనికి తగిన వధువు దొరకలేదు. కాశ్మీరునుండి కన్యాకుమారివరకూ, బంగాళాఖాతంనుండి అరేబియా వరకూ విస్తరించియున్న ఈ సువిశాల భారతావని గొడ్డుపోలేదన్న గట్టి నమ్మకంతో వధువును సెలక్టు చేసుకోవడంలో కాంప్రమైజ్ కాలేదు.

ఆ ఆదివారం ఇట్టే వచ్చేసింది. వెంకట్ తన స్వగ్రామం చేరుకున్నాడు. చేరీచేరుకోగానే అతని తండ్రి పెళ్ళిచూపులకు బయల్దేరమన్నాడు.

"ఏంటీ? స్నానం, పానం లేకుండానే?" సందేహపు లుక్ ఒకటి ఇచ్చి అడిగాడు.

"దీనికి స్నానపానాదులతో పనిలేదు. అక్కడ నీ గురించి వెయిట్ చేస్తున్నారు. ఓ లుక్కిచ్చి ఇట్టే వచ్చేదువుగాని రా" తొందరపెట్టాడు తండ్రి.

తండ్రీకొడుకులు ఇరువురూ బయల్దేరారు. ఆదివారం శలవ్ కాబట్టి పెళ్ళిచూపులు ఆ ఊరి పాఠశాలలో ఏర్పాటుచేశారు. సుమారుగా పదిమంది పెళ్ళికూతుళ్లు, వారి తల్లిదండ్రులు ఈ విఘ్న రాజుకోసం అక్కడ నిరీక్షిస్తున్నారు.

"సామూహిక పెళ్ళిచూపుల కార్యక్రమంగా ఉంది. ఏంటిది నాన్నా?"

"అవున్నాన్నా సామూహిక పెళ్ళిచూపులే. కానీ పెళ్ళికొడుకువు నువ్వొక్కడివే. వీళ్ళందరికీ పెళ్ళి సంబంధాలు కుదరట్లేదట. నువ్వోసారి చూస్తే సంబంధాలు ఇట్టే కుదిరిపోతాయని వీరి ప్రగాఢ విశ్వాసం. నువ్వెలాగూ పెళ్ళి చేసుకోవు. నీవల్ల కనీసం వారికైనా కుదిరితే ఆనందిద్దామని వారు రిక్వెస్టు చేస్తే ఈ ఏర్పాటు చేశా. కప్పస్తంభంలా నువ్వోసారి అలా నిలబడితే, ఒక్కొక్కరూ నీ ఎదుటకు వచ్చి ఓరచూపు, చిరునవ్వు నీమీద రువ్వి వెళ్ళిపోతుంటారు.

"మధ్యలో ఈ కప్ప స్తంభం మోడల్ ఏంటి నాన్నా?"

"మన సింహాచలం అప్పన్న గుడిలో ఉందిలే. పిల్లలు కలగని వాళ్ళు దాన్నోసారి కౌగలించుకుంటే పిల్లలు పుడతారట"

"నాన్నా, నువ్వు మరీ నన్ను ఇన్సల్ట్ చేస్తున్నావ్" అన్నాడు బాధగా మూలుగుతూ.

"పరిస్థితిని ఇంతవరకూ లాక్కొచ్చావుగా మరి, నీకు బుద్ధి రావడానికి ఇలా చేయక తప్పలేదు. సర్లే గతం గతః. హైద్రాబాద్ నుండి పెళ్ళిళ్ళ పేరయ్యని రప్పించాను. వారిదగ్గర చాలా సంబంధాలున్నాయట. ఈ సారైనా ఏదో ఒకటి సెలక్టు చేసుకో" అన్నాడతడు.

అసలు వెంకట్ కి ఇన్నాళ్ళూ ఏ సంబంధం కుదరకపోవడానికి కారణం అతనికి పెళ్ళికూతుళ్ళు నచ్చకపోవడం కాదు. వెంకట్ కి ఇద్దరు అన్నయ్యలు ఉన్నారు. ఆ ఇద్దరికీ ఒక్క అక్షరం ముక్క కూడా అబ్బలేదు. కర్రబిళ్ళా, కోతికొమ్మచ్చి లాంటి ఆటలతో బాల్యం గడిచిపోయింది. కాస్త ఈడొచ్చిందనగానే వ్యవసాయంలో తండ్రికి తోడుగా నీడగా ఉంటూ, వ్యాపారాలు చేస్తూ, ఉన్న నాలుగెకరాలని పాతిక ఎకరాలు చేశారు. అందుకే ఆ తండ్రికి ఆ కొడుకులంటే ప్రాణం. పెద్దవాడు ఉద్యోగం చేసుకుంటున్న పేదింటి పిల్లని ప్రేమించి, కానీ కట్నం తీసుకో

కుండా పెళ్ళి చేసుకున్నాడు. ఇక రెండో వాడు తండ్రి కుదిర్చిన లక్షలు తెచ్చిన గొప్పింటి అమ్మాయిని చేసుకున్నాడు.

వెంకట్‌కి చదువంటే ఆరో ప్రాణం. అందుకే ఎం.సి.ఎ. చేసి చక్కటి ఆఫీసు గిరి వెలగబెడుతున్నాడు. చదువుకోని అన్నలు కన్న అతడు మంచి హోదాలో ఉన్నాడు. తన కాబోయే భార్య కూడా అలాగే ఉండాలని అతని ఆశ. అందుకే పెద్ద వదిన కంటే పెద్ద ఉద్యోగం చేస్తూ, రెండో వదినలా లక్షల ఆస్తి తెచ్చే అమ్మాయికోసం వెదుకులాట ప్రారంభించాడు. అలాంటి వధువు ఇంతవరకూ తన కంటికి కానరాలేదు.

"చూడండి సార్ ఈ ఫొటోలు" అన్నాడు పెళ్ళిళ్ళ పేరయ్య.

"అన్నీ బాగానే ఉన్నాయయ్యా. కాకపోతే అమ్మాయిని చేసుకుంటే డబుల్ బెనిఫిట్ ఉండాలి. అలాంటి సంబంధం ఉంటే చెప్పు" అన్నాడు వెంకట్.

"డబుల్ బెనిఫిట్ అంటే? " ఆశ్చర్యపోయాడు పేరయ్య.

"పెద్ద ఉద్యోగం చేస్తూ, కట్నకానుకలతో బాటు లక్షల ఆస్థిని తీసుకురావడాన్ని డబుల్ బెనిఫిట్ అంటాం. అలాగని మతాంతరాలు, కులాంతరాలు, శాఖాంతరాలు పనికిరావు సుమా" జాగ్రత్త చెప్పాడు వెంకట్.

కాస్త దీర్ఘంగా ఆలోచించిన పేరయ్య, "సార్, డబుల్ బెనిఫిట్ అమ్మాయిలు ప్రస్తుతానికి లేరుగానీ, ట్రిబుల్ బెనిఫిట్‌తో వచ్చే వధువుంది" అంటూ ఓ ఫొటో తీసిచ్చాడు.

ఆ ఫొటోని తీక్షణంగా పరికించిన వెంకట్ 'యురేకా' అంటూ పెనుకేక పెట్టి, "ఈ సంబంధం ఖాయం చేసేయ్. పెళ్ళిచూపులు ఏర్పాటు చేసెయ్. అదీ ఫార్మాలిటీకోసమే. నీ కష్టం ఉంచుకోనులే. కమీషన్ దండిగా ఇస్తాను" అన్నాడు వెంకట్ పట్టరాని ఆనందంతో.

పెళ్ళిచూపులు ఏర్పాటు చేయబడ్డాయి.

"పేరయ్యా! పిల్ల, ఉద్యోగం, ఆస్థిపాస్తులు అన్నీ పిచ్చ పిచ్చగా నచ్చేశాయి. ఇక ముహూర్తాలు పెట్టుకోవడమే తరువాయి. అవును నాకో డౌటు. వచ్చిన దగ్గర్నుండీ చూస్తున్నాను, ఆ ఇద్దరు పిల్లలూ పెళ్ళికూతురు చుట్టూనే తిరుగుతున్నారు. కారణం ఏమై ఉంటుందంటావ్? " సందేహం వెలిబుచ్చాడు.

"కలిసొచ్చే కాలంవస్తే, నడిచొచ్చే కొడుకులు పుడతారని, బహు అదృష్టవంతులు సార్ మీరు. గొప్ప ఉద్యోగం, తరగని ఆస్థి, ఇద్దరు పిల్లలు. ట్రిబుల్ బెనిఫిట్ సార్" అన్నాడు పేరయ్య చెవిలో గుసగుసగా.

అంతే వెర్రిచూపులతో, వెకిలి నవ్వుతో, వెంకట్ పరిస్థితి దయనీయంగా మారింది.

**– కావేరిమణి జయంతి**

---

## రెండు... రెండు

"నాన్నా..." ఘొల్లుమంటూ లోపలికి వచ్చిన కూతురు కనకమహాలక్ష్మి వంక బిత్తరపోయి చూశాడు వామనావతారం.

"ఏంటమ్మ... ఏమయిందీ" ఆందోళనగా అడిగాడు కూతుర్ని. మరొకసారి ఘొల్లుమంది కనకమహాలక్ష్మి. తండ్రి పైపంచె అందుకొని కళ్ళు ఒత్తుకుంటూ "ఏమైందమ్మా... నా బంగారు తల్లివి కదూ. చెప్పు తల్లీ" అనునయంగా బుజ్జగిస్తూ అడిగాడు వామనావతారం.

"ఏమిటంటావేమిటి నాన్నా. అంతా అయిపోయింది" ముక్కు చీదుకుంటూ

యింకొకసారి ఘొల్లుమంది కనకమహా
లక్ష్మి.

"అబ్బబ్బ... ఎందుకమ్మా అలా మాటి
మాటికీ ఘొల్లుమంటావు. ఏమి జరిగిందో
చెప్పమ్మా" చిరాకు కప్పిపుచ్చుకుంటూ
నెమ్మదిగానే అడిగాడు వామనావతారం.

"అది కాదు నాన్నా! వాళ్లు మనకేం
చెప్పారు. ఇప్పుడేమో అవెక్కడున్నాయి,
ఇవెక్కడున్నాయి అంటూ తెల్లముఖాలేస్తు
న్నారు" వెక్కిళ్లు పెడుతూనే చెప్పింది కన
కమహాలక్ష్మి.

"ఎవరమ్మా వాళ్లు. ఏం చెప్పారు
మనకి? విషయం ఏమిటో వివరంగా
చెప్తే కదా నాకు అర్థమయ్యేది"

"అదే నాన్నా. నా పెళ్ళికి ముందు
వాళ్ళు మనకేమని చెప్పారు. అబ్బాయికి
రెండు సైట్లు, రెండు కాంప్లెక్సులూ ఉన్నా
యని చెప్పాడా లేదా ఆ మధ్యవర్తి. 'అవె
క్కడున్నాయండీ' అంటే "సైట్లేమిటీ...
కాంప్లెక్సులేమిటీ అంటున్నారు నాన్నా"
అంటూ మరోసారి ఘొల్లుమనబోయి
"ఆ..." అంటూ గుండె పట్టుకొని కూలబ
డిపోయిన తండ్రిని చూసి ఆ ప్రయత్నాన్ని
విరమించుకొని "నాన్నా... నాన్నా" అంటూ
తండ్రిని పట్టుకొని గట్టిగా కుదిపింది కనక
మహాలక్ష్మి.

ఉలికిపాటుగా లేచి "ఎంతపని జరిగిం
దమ్మా. అవున్నాయనేకదమ్మా నిన్నా
త్రాష్టుడికి కట్టబెట్టిందీ" గుండెలు రాసు
కుంటూ అన్నాడు వామనావతారం.



"అవును కదా మరి. లేకపోతే ఇంతోటి
అందగాడు నాకు దొరక్కపోయాడా!"
మూతి విరుచుకుంటూ అంది కనకమహా
లక్ష్మి.

"ఉండమ్మా, ఈ సంగతేమిటో ఆ మధ్య

వర్తి భజగోవిందంగాడితోనే తేల్చుకుంటాను. నువ్వు లోపలికెళ్ళి కాస్త ఎంగిలి పడు తల్లీ. మీ అమ్మ ఆ పక్కింటికెక్కడికో అఘోరించినట్టుంది" కూతురిచేతిలో ఉన్న పైపంచె లాక్కుని దులిపి భుజానవేసుకుకొని విసవిసా నడుచుకుంటూ బయటకు పోయాడు వామనావతారం.

★ ★ ★

"అయ్యా భజగోవిందంగారూ... అన్నిటికీ మీరే ఉన్నారని మిమ్మల్నే నమ్ముకున్నాము మరి. నీటనే ముంచుతారో, పాలనే ముంచుతారో అంతా మీదే భారం. కట్నకానుకలేమీ పెద్దగా ఇచ్చుకోలేను. కాస్త వీలున్న సంబంధమేదో కుదిరిస్తే..." ప్రాధేయపడుతున్నాడెవరో ఆడపిల్ల తండ్రి భజగోవిందం చేతులు పట్టుకొని.

"మీరింతగా చెప్పాలా రామతీర్థంగారూ! మీ వెనుక ముందులు నాకు తెలీదూ. మీ కందుబాటులో వుండే సంబంధం. మీకనువైన సంబంధం చూసే పూచీ నాది. మీరు నిశ్చింతగా ఉండండి" భజగోవిందం చెప్పండగానే దురుసుగా లోపలికొచ్చాడు వామనావతారం గట్టిగా అరుచుకుంటూ "ఆ...ఆ! బాగానే చూస్తావు. చూడవు మరీ! అవతల వాళ్ళదగ్గర డబ్బులు బాగా భోంచేసి అన్నీ అబద్ధాలతో బాగానే అంటగడతావు అడ్డమైన అడ్డగాడిదల్నీను" అరుస్తున్న వామనావతారం వంక బెదురుగా చూశాడు రామతీర్థం. "బాబూ మిమ్మల్ని చూస్తుంటే ఆడ పిల్లల తండ్రిలాగా ఉన్నారు. ఈ గుంటనక్క ఉచ్చులో పడకండి. వీడి మాయలో పడి పిచ్చిపిల్ల నా కూతురు గొంతుకోశాను గదండీ" ఆవేశంగా అరుస్తున్న వామనావతారాన్ని "ఇలా కూర్చోండి వామనావతారంగారూ! ఏమయింది. విషయమేమిటో చెప్పకుండా తొందరపడతారేం" ప్రశాంతంగా అన్నాడు భజగోవిందం.

"మర్యాదల కేంతక్కువొచ్చెలే. ఏదో కాస్త కమిషన్ సొమ్ముకి వెనకాడానని యింత మోసం చేస్తావా నన్ను. నువ్వేం చెప్పావు ఆరోజు. అబ్బాయికి రెండు సైట్లు... రెండు కాంప్లెక్సులు ఉన్నాయని చెప్పావా లేదా!" బల్లగుద్ది మరీ అడిగాడు వామనావతారం. ఆ అదురుకి పైకెగిరిన పేపర్ వెయిట్‌ని ఒడిసిపట్టుకొని "భేషుగ్గా చెప్పాను. ఇందులో అబద్ధం ఏముంది?" అన్నాడు భజగోవిందం.

"అబద్ధం కాకపోతే ఏమిటోయ్ మరి. పిల్ల ముచ్చటపడి మన సైట్లు, కాంప్లెక్సులూ చూసొద్దామండీ అంటే "సైట్లా, కాంప్లెక్సులా" అంటూ వెర్రిమొగాలేసారట నా అల్లుడూ, వియ్యంకుడూను" అంటూ విరుచుకుపడ్డాడు వామనావతారం.

"బలేవారే మీరు అవతారంగారూ! చూపించమంటే చూపించడాన్కి అవేమన్నా రూపమున్నవా మరి" నవ్వుతూ అన్నాడు భజగోవిందం.

"రూపం లేకపోవడమేవిటయ్యా" విస్తుపోతూ అన్నాడు వామనావతారం.

"అవునండీ. ఆరోజు మీకేమని చెప్పాను. అబ్బాయికి రెండు సైట్లు ఉన్నాయని, అంతేనా! ఇప్పుడు మాత్రం లేవనెవరన్నారు. ఒకటి లాంగ్ సైట్. రెండు షార్ట్ సైటు" చిద్విలాసంగా నవ్వుతూ అన్నాడు భుజగోవిందం.

"ఓర్నాయినో. ఇదేం ఫిట్టింగ్‌రా బాబూ! మరి ఆ కాంప్లెక్స్‌ల సంగతేమిటి" అన్నాడు వామనావతారం.

"అవి మాత్రం లేవన్నదెవరు. శుభ్రంగా రెండు కాంప్లెక్సులూ ఉన్నాయి మీ అల్లుడికి. ఒకటి సుపీరియారిటీ కాంప్లెక్సు, మరొకటి ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సూ" చెప్పాడు భజగోవిందం.

– సూరిపండు

✻

# 'ఆలంబన' పై సమీక్షలు

ఏప్రిల్ చతురలో ప్రచురితమైన ఎ.అన్నపూర్ణ నవల 'ఆలంబన' పై
మాకందిన ఉత్తమ సమీక్షల్ని ఈ దిగువన ప్రచురిస్తున్నాం

## కనువిప్పు

*(మొదటి బహుమతి రూ.100/– పొందిన సమీక్ష)*

స్త్రీ, పురుషులు ఒకరికి ఒకరు ఆలంబన. అలాకాని పక్షంలో షాలినిలా ఎవరికి వారు ఏదో ఒక ఆలంబన సృష్టించుకోవడం ద్వారా తృప్తిని, ఆనందాన్ని పొందవవచ్చు అనే ఇతివృత్తాన్ని 'ఆలంబన' నవలగా రూపకల్పన చేయడంలో రచయిత్రి ఎ.అన్నపూర్ణగారు చాలా శ్రమ పడ్డారని చెప్పాలి. సమాజానికి ఆలంబన కుటుంబం. కుటుంబంలోని అన్ని బంధాలకు ఆలంబన స్త్రీ పురుషులను ఒకటి చేసే వివాహం. అందుకే మన పూర్వీకులు వ్యక్తిగత భావాలకు ప్రాధాన్యం ఇవ్వకుండా సమాజ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని వివాహ వ్యవస్థను తీర్చి దిద్దారు అని సుస్పష్టంగా చెప్పి ఉంటే బావుండేది.

షాలిని, సమీర్, రేణు ముగ్గురు ఒకరికి ఒకరు ఆలంబన అవుతారు. షాలిని, సమీర్‌ల ఆలంబన నైతికమైనది. సంసార సుఖమే కాని సంసార బాధ్యతలు వద్దు, హాయిగా స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలతో జీవిస్తాం, మాకు కెరియర్ ముఖ్యం అనుకునే రేణు లాంటి స్త్రీ, సమీర్‌లాంటి పురుషుడితో ఏర్పరుచుకొన్న ఆలంబన అనైతికం. ఆ ఆలంబన చివరకు మనస్తాపాన్ని, పశ్చాత్తాపాన్ని కలిగిస్తుంది. షాలిని లాంటి స్నేహితురాలు అందరికీ దొరకకపోవచ్చు. అలాంటప్పుడు రేణులాంటివారి జీవితాలు కుక్కలు చింపిన విస్తరే అవుతాయి. డబ్బు, హోదా, పలుకుబడి, గౌరవం ఎన్ని వున్నా వివాహం అనే చట్రంలో కట్టుబడని రేణు జీవితంలో ఏదో వెలితి, అసంతృప్తి మనకు గోచరిస్తూనే ఉంటాయి.

పెళ్ళి, పిల్లలు, భర్త, సంసారం అనే బాదరబందీ లేకుండా స్త్రీ పురుష సంబంధాలు కొనసాగిస్తూ ఎప్పుడు నచ్చకపోతే అప్పుడే తెగతెంపులు చేసుకోవచ్చు అనుకునే భావాలు కల నేటి యువతరానికి ప్రతినిధి తుషార. ఆమె మొదట రేణువల్ల ప్రభావితురాలౌతుంది. సమీర్ అకాల మరణం, రేణు వ్యాధి పీడితురాలు కావడం తుషారలో మార్పును తెస్తాయి. తల్లిలోని మంచితనం, దయార్ద్ర హృదయం సమీర్, రేణుల పట్ల తల్లి ప్రవర్తనలోని ఔన్నత్యం తుషార ఆలోచనలను ప్రభావితం చేస్తాయి. స్త్రీపురు



షలు ఒకరికి ఒకరు ఆలంబన కావాలంటే అది నైతికమైనదై వుండాలని, అందుకు వివాహం తప్పనిసరి అని తెలుసుకుని తన జీవితాన్ని అందుకు అనుగుణంగా మలుచుకుంటుంది. ఇది నేటి యువతరానికి ఒక కనువిప్పు.

స్త్రీల మనోభావాలలో, ఆలోచనా తీరులో వస్తున్న మార్పులను రచయిత్రి ఈ నవలలో చక్కగా విశ్లేషించారు. పార్వతమ్మ తన భర్త ఎంత అసమర్థుడైనా, ఎన్ని కష్టాలుపడినా కుటుంబంపట్ల తన బాధ్యతలు నెరవేర్చితే కాని భర్తను విడిచిపెట్టలేదు. అందుకు భిన్నంగా ఆమె కోడలు అసమర్థుడైన తన భర్తను వదిలిపెట్టి చిన్నినా పొట్టకు శ్రీరామరక్ష అన్నట్లు తన దారి తాను చూసుకుంది. భర్త చనిపోయిన తరువాత ఒంటరి జీవితం గడపాలి అని అనుకోకుండా తనకు నచ్చిన పురుషుడు ఎదురయితే వివాహం చేసుకోవటానికి హారతిలాంటి స్త్రీలు సంశయించటం లేదు. భర్త, కుటుంబం, సమాజం పట్ల స్త్రీ బాధ్యత ఏమిటో షాలిని పాత్ర ద్వారా తెలుస్తుంది. పిల్లలు చదువుల్లో, భర్త తన ఉద్యోగంలో బిజీ అయినప్పుడు స్త్రీ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఒంటరితనాన్ని అనుభవిస్తుంది. అలాంటప్పుడు తనకు తానుగా ఏదో ఒక ఆలంబన సృష్టించుకొని తృప్తిని, ఆనందాన్ని పొందవచ్చని ఈ నవల ద్వారా తెలుస్తుంది.

అండర్‌లైన్ చేసుకుని చదువుకోవలసిన ఆణిముత్యాల్లాంటి వాక్యాలు ఈ నవలలో చాలా ఉన్నాయి. ఉదాహరణకు 'మనం ఎన్నుకున్న మార్గం నలుగురికి ఉపకరిస్తే ఏ దేశమైనా ఒకటే', 'కాలానుగుణంగా దేశకాల పరిస్థితులకనుగుణంగా సాగిపోవడమే జీవితం', 'అనుభవం అన్నీ నేర్పుతుందేమో'.

– గోపరాజు జయశ్రీ
జగ్గంపేట-533435

# సమస్యల వలయం

*(రెండవ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

నేటి సమాజంలో సంసారజీవితంలో వివిధ సమస్యల వలయంలో స్త్రీ, పురుషులు ఏవిధంగా చిక్కుబడి పోతున్నారో అద్దం పట్టినట్లు నవలను అల్లుకుపోయేరు రచయిత్రి. ముఖ్యంగా భార్యాభర్తల మధ్య అన్యోన్యత, ఆత్మీయత, అనురాగాలు లోపిస్తున్న నవసమాజాన్ని విభిన్న పాత్రలలో మలచి, రచయిత్రి అన్నపూర్ణ జీవిత పరమావధిని చవిచూపించేరు. మొత్తం నవలంతా షాలిని పాత్ర చుట్టూ తిరుగుతూ ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగింది. నవల చదువుతున్నంతసేపు, షాలిని నిత్యం ఎదుర్కొన్న సమస్యలతో మనసు భారంగా అనిపించింది. రచయిత్రి చెప్పినట్లు భారతదేశ జనాభాలో సగంమంది విదేశాలకి తరలిపోవడంతో వృద్ధులు మాత్రమే మిగిలిపోయారా అన్న సందేహం కలుగుతుంది. ఇటువంటి వృద్ధులకు నవల చివరలో 'డాడ్ వున్నంత కాలము ఆయన ఎక్కడవున్నా నీకు ఆయనే ఆలంబన, నువ్వు ఒంటరిదాన్నని ఫీలవుతుంటే ఇండియా వెళ్లొద్దు నా దగ్గరే వుండు' అని తుషార తన మమ్మీతో అన్నప్పుడు షాలిని చెప్పిన ఆలంబనకు నిర్వచనం వర్తిస్తుంది.

సమాజసేవకోసం నిస్వార్థంగా తన జీవితాన్నే పణంగా పెట్టిన షాలిని లాంటి స్త్రీలు నేటి సమాజంలో అరుదు. ఇక నవలలో నాకు నచ్చని అంశం ఒక్కటే. అనవసర పాత్రలు మరీ ఎక్కువగా సృష్టించబడి, చదివేవారికి కొంత విసుగు, కన్‌ఫ్యూజన్ రావచ్చు. ఈ ఒక్క లోపం తప్పితే నవల చివరవరకు ఆసక్తికరంగానే సాగిందనడంలో సందేహంలేదు.

– బి.రాధాకృష్ణమూర్తి
విజయవాడ-10

# వింత మనస్తత్వం

*(మూడవ బహుమతి రూ.50/–
పొందిన సమీక్ష)*

అద్భుతమైనకథనం, ఆద్యంతమూ ఏకబిగిన, అక్షరం వదలకుండా చదవగలిగే శైలి, ప్రతి ఒక్కరినీ ఆలోచింపచేసే కథాంశము గల 'ఆలంబన' నవలతో ముస్తాబయి వచ్చిన ఈ నెల చతుర మాసపత్రిక మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది.

ప్రధాన పాత్ర షాలిని మనస్తత్వం మొదట్లో వింతగా అసహజంగా అన్పించినా చివరలో ఆమె వ్యక్తిత్వం, గొప్పదనం అర్థమవుతుంది. తన గురించికన్నా ఇతరుల గురించి, వారి సమస్యలకు పరిష్కారాల గురించి ఆలోచించి వారి సుఖంలోనే తన ఆనందాన్ని చూసుకునే మనస్తత్వంగల మహిళ షాలిని. ఈ ఆనందంలో తన భర్తనీ, కూతురినీ పట్టించుకోక (సంసారాన్ని) వారు మానసికంగా తనకి దూరమయ్యారని తెలుసుకున్నాక అప్పుడు వారి కోసం తన ఇష్టాలని వదిలిపెట్టి వారితో అమెరికా చేరుతుంది షాలిని. భర్త తన స్నేహితురాలికి దగ్గరయ్యాడని తెలిసీ కూడా భర్తని ప్రశ్నించక, ఆ స్నేహితురాలిని తన దగ్గరే ఉంచుకుంటుంది. ఇది వాస్తవానికి దూరమైనప్పటికీ ఆ పాత్ర స్వభావం చదువరులకి అర్థమవటంతో అతిశయోక్తిగా అన్పించదు. ఈ విషయంలో రచయిత్రి ఈ పాత్రని చాలా గొప్పగా సృష్టించి కృతకృత్యులయ్యారు.

ఒక నవలలో విభిన్న మనస్తత్వాలని సృష్టించి వారి సమస్యలకి పరిష్కారాలు సూచించి పాఠకులు విసుగు చెందకుండా రాయడం చాలా కష్టం. అమెరికాకి వలస పోతున్న నేటియువతని సమర్థిస్తూ అమెరికా గొప్పదనం గురించి రాస్తూ అమెరికాని మెచ్చుకున్నంత మాత్రాన కన్నతల్లిలాంటి మన దేశాన్ని కించపరచటం కాదని, తల్లి కన్నా గొప్పదయిన మరో తల్లిని పొగడటం తప్పుకాదని ఆ భావన కలవారికి ఒక చురక తగిలించారు రచయిత్రి. అక్కడి జీవన విధానం, క్రమశిక్షణ చూసి నేర్చుకుని మన దేశాన్ని గొప్పదేశంగా చేయించే భావన కావచ్చును. ప్రతీపాత్రనీ వాడుకుని అనవసర పాత్ర అనేదే లేకుండా ఉండటం ఈ నవల గొప్పదనం.

– జె.శ్రీలక్ష్మీపల్లవి
సిర్‌పూర్ కాగజ్‌నగర్

# మార్గదర్శి

*(నాల్గవ బహుమతి రూ.50/–
పొందిన సమీక్ష)*

సామాజిక కట్టుబాట్లు, పురుషాహంకారం లాంటి అనేక కారణాలుగా స్త్రీల జీవితాలు అపసవ్యంగా సాగుతున్నాయి అనే వాటికి ఎ.అన్నపూర్ణ గారి నవల 'ఆలంబన' ఒక చక్కటి పరిష్కార మార్గం అని చెప్పవచ్చు. షాలిని లాంటి పాత్రని సృష్టించి అందులో ఒక స్త్రీ జీవితం పూర్తిగా వ్యక్తిగత సామర్థ్యంతో ఎలాగ ఎన్ని మలుపులు తిరగగలదో చాలా చక్కగా చూపించారు. సామాజిక సేవకోసం సంసారం వదులుకో అక్కర్లేదనీ సంసారసాగరంలో పడి సమాజిక శ్రేయస్సు చూడలేము అన్నది కూడా ఒక కుంటిసాకే అనీ చెప్పేందుకు ఈ ఆలంబన ఒక చక్కటి ఉదాహరణ.

ప్రస్తుత సమాజంలో అనేకమంది ధీరవనితలూ ఉన్నారని అలాగే అధైర్యవంతులూ ఉన్నారన్నది మనకు తెలిసిన విషయమే. జీవితం ఎలా మలుపు తిరిగితే అలా బతకవచ్చు కాని అవకాశం ఉన్నంతవరకు తనకు అనుకూలంగా మలుపు తిప్పుకోవాలి. సమాజసేవలో కూడా కొంత ఆలంబన ఉంది అని నవలని ముగిస్తూ స్త్రీ జడత్వంగా ఉండకూడదు, ఉన్నంతవరకు పరిధిని విస్తరిస్తూ తనకి తాను భారంకాక

తను సమాజానికి భారంకాకుండా స్త్రీలు తమ జీవితాన్ని జీవించవచ్చని నిరూపించిన నవల ఈ ఆలంబన.

మొత్తం మీద ఈ నెల ఆలంబన నవల మొదటపేజి నుంచి చివరి పేజీ వరకు ఉత్కంఠగా ఆపకుండా చదివించగలిగింది అంటే అతిశయోక్తి కాదు.

– వోలేటి శ్రీనివాసరావు
విజయనగరం

## ఫోకస్

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఏప్రిల్ నెల చతురలో ప్రచురించిన 'ఆలంబన' నవల సమకాలీన భారత సమాజంలో ఉన్న మౌలిక సమస్యలన్నింటినీ స్పృశించింది. ఉమ్మడి కుటుంబాల కథలు, వ్యథలు ఉద్యోగినులు ఎదుర్కొంటున్న సమస్యలు, ఉద్యోగ వ్యాపార రంగాల్లో సైతం స్త్రీలు దూసుకుపోతున్న తీరు, విదేశాలకు ఒంటరిగా ఎగిరిపోయి జీవితాలను దిద్దుకుంటున్న వైనం ఒకటేమిటి అన్ని ధోరణులను వర్ణించారు రచయిత్రి. అయితే ఈ రచనలో ఫోకస్ (కేంద్ర విషయం) లోపించింది. ఆలంబన ప్రసక్తి అన్ని పాత్రల జీవితాల్లోను చాలా ఆలస్యంగానే వచ్చింది.

మంచి శైలి ఉన్నా ఈ నవల మాత్రం కొంత నిరుత్సాహాన్నే మిగిలించింది. ఎందుకంటే కీలకపాత్ర షాలిని ఒక ఎనిగ్మా. ఆమె తల నిండా గందరగోళం. జీవితాన్ని కాచి వడపోసినట్లు గొప్ప జనరలైజేషన్స్ చేస్తుంది. ఉదా: 'నాకు మగవాడి గురించి బాగా తెలుసు నందినీ! సంపదా, శరీరం పంచుకుందుకు సిద్ధపడతాడు తప్పితే బరువు, బాధ్యతలు స్వీకరించటానికి అంగీకరించడు' అంటూ సిద్ధాంతీకరిస్తుంది. తన కర్తవ్యం ఏమిటో తాను చేయగలిగినది ఏమిటో తెల్సుకోలేని అపరిపక్వత ఆమె మాటల్లో, చేతల్లో వ్యక్తమౌతుంది. ఇంట్లో అనాథ శరణాలయం పెడతాననటం, భర్త వద్దంటే 'ఓ గాడ్! ఎందుకిలా శాసించాలని చూస్తాడు' అంటూ రుసరుసలాడటం, తన స్నేహితురాలు (?) రేణుని తన ఇంట్లోనే ఉండమని ఆహ్వానించడం, తన కూతురు తుషార ఇంట్లోనించి వెళ్లిపోయి హాస్టల్లో ఉంటానంటే నిస్సహాయంగా రాజీపడటం ఇందుకు ఉదాహరణలు. తన భర్త సమీర్ రేణుతో సంబంధం ఏర్పరచుకుంటే కూడా రాజీపడిపోతుంది. దృఢమైన అభిప్రాయాలు, నిశ్చయాత్మకమైన, క్రియాశీలమైన ఆలోచనలు లేని షాలిని పాత్ర అపరిపక్వతను, బలహీనమైన వ్యక్తిత్వాన్ని, జీవితంలో నమ్మిన వాటికోసం పోరాడలేని జడత్వాన్ని ప్రతిబింబిస్తుందే తప్ప ఆదర్శంగా నిలిచే పాత్రకాదు. సానుభూతి చూపవలసిన పాత్ర కూడా కాదు. ఎందుకంటే ఆమెకు ఎదురైన చేదు అనుభవాలు చాలావరకు స్వయంకృతాల ఫలితాలే. మంచి శైలికి తోడు మంచి అవగాహన, విశ్లేషణ ఉంటే రచయిత్రి కలకాలం నిలిచే రచనలు చేయగలరు.

– కె.పురుషోత్తం
కాకినాడ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78





# రుచి పచి లేని రోజులకిక గుడ్ బై...

అసలైన సాంబారు రుచి, రసంలోని ఘుమఘుమలు మర్చిపోలేని గరంమసాలా ఘాటు. ఇప్పుడు మీ అభిమాన 'ప్రియ' అందిస్తోంది ఇవన్నీ. మెరుగైన నాణ్యత, మర్చిపోలేని రుచులతో వస్తున్నాయి 'ప్రియ' వారి సాంబారు, రసం, గరంమసాలా పొడులు. ఒక్కసారి వండిచూడండి.

మీ 'ప్రియ' రుచుల్ని ఆస్వాదించండి.






**priya**

*Masala Powders*

సాంబారు పొడి • రసం పొడి • గరంమసాలా పొడి